# అశ్వమేధ ఉపన్యాసాలు

డా॥ ఎమ్. శ్రీరామకృష్ణ



ఫోన్ 63322

శ్రీమహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్
మ్యూజియంరోడ్ * ఏలూరురోడ్ కార్నర్
గవర్నరుపేట ... విజయవాడ-2.

**అశ్వమేధ ఉపన్యాసాలు**

డా॥ M. శ్రీరామకృష్ణ

పబ్లిషర్స్ :

**శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్**

మ్యూజియం రోడ్డు, విజయవాడ-2.

ముద్రణ :

**జనవరి, 94.**

**వెల : రూ. 15-00**

ముఖచిత్రం :

**వి. ఎస్. ప్రకాష్**

ప్రింటర్స్ :

**జ య శ్రీ ప్రె స్**

విజయవాడ-11

# అశ్వ మేధ ఉపన్యాసాలు

**ఓం భూర్భువః స్వః త త్సవితు ర్వరేణ్యం**
**భర్గో దేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥**

[8 సార్లు ఓంకారము. గురుబ్రహ్మ, 8 సార్లు గాయత్రీ మంత్రం]

ఈనాడు ఇక్కడ సమావేశమయినటువంటి మనము కొన్ని చాలా విచిత్రమయిన పరిస్థితులలో,అద్భుతమయిన పరిస్థితులలో మనకి ఎప్పటికి అందనటువంటి, తెలియనటువంటి కాలచక్రభ్రమణంలో ఇక్కడ సమావేశము అయ్యాము మనము ఆధ్యాత్మిక సమావేశములు భారతదేశములో పెద్ద వింత కాదు. కాని ఆధ్యాత్మికతకు ఒక వైజ్ఞానిక మైనటువంటి రంగు ఇచ్చి 'ఆధ్యాత్మికత ఒక మూఢ విశ్వాసము కాదు ఆధ్యాత్మికత కూడా ఒక అసలైన సిసలయిన విజ్ఞానమే. ఇందులో కూడా — ఏ విధంగా అయితే విజ్ఞానములో ఆక్సిజన్,హైడ్రోజన్ కలిసి నీరు ఏర్పడతాయో, ఏ విధంగా అయితే 3X3=9 అని ఖచ్చితంగా చెప్పగలుగుచున్నారో, అలాగే ఆధ్యాత్మిక జగత్తులో మీరు ఆధ్యాత్మిక నియమాలు గనక పాటిస్తే ఫలితాలు ఖచ్చితంగా అప్పటికప్పుడే తెలుస్తాయి' అనే సత్యాన్ని గ్రహించే దీనిని ముఖ్యంగా భారతీయులు తెలుసుకోగలుగుతారు. అని గురు పరంపరలోని వ్యక్తులు–ముఖ్యంగా వ్యాసమహర్షి యొక్క ఉద్దేశ్యము కాని మహత్తరమయిన కాల గమనంలో యోగవిద్య నష్టప్రాయమై పోయి చివరికి దాని అవశేషాలు మాత్రమే ఇపుడు ఉన్నాయి

భారతదేశం, ప్రపంచానికే మార్గదర్శకమై జీవించవలసిన భారతదేశం–ఇంకా తన నిగ్రహం కోల్పోలేక, ఇంకా తను చేయవలసిన కార్యక్రమాల మీద స్పష్టమయిన అవగాహనలేక ఈ విధంగా వుంది. అని అనేక మంది మహాత్ములు,అనేక మంది ఋషులు, అనేక మంది అవతార పురుషులు చెప్పుకుంటూ వచ్చారు. ఈ నాడు ఇక్కడ ఒక ఐదు రోజుల పాటు మీ ముందు నేను చెప్పదలచుకున్న విషయం ఏమిటి అంటే, మనకు ఆధ్యాత్మికత గురించి తెలియని విషయము లేదు. నిజంగా చెప్పాలంటే భారతీయులకు ఆధ్యాత్మికత గురించి ఏమీ చెప్పనక్కరలేదు.

వివేకానంద ఒకసారి అమెరికాలో ఇలా అన్నాడు భారతీయులకు కావలసింది ధర్మం కాదు ఈనాడు ధర్మం గురించి మాకు చాలా తెలుసు కావలసింది Freedom– కాని, స్వాతంత్ర్యం లభించిన తరువాత కూడా భారతదేశంలో ప్రపంచ చరిత్రలో తను ఏ విధమయినటువంటి Role play చేయాలో, తాను ఏ విధంగా జీవిస్తూ ఇతర దేశాలకి మార్గదర్శకంగా ఉండాలో అది మర్చిపోయింది. అది మర్చిపోయింది అని తెలియజేయుటానికి అనేకమయినటువంటి అవతారాలు, అనేక మంది గురువులు, అనేక మంది మహాత్ములు, అనేక మంది ఋషులు, అనేక మంది అవతార పురుషులు వచ్చి తెలియచేస్తున్నా కూడా ఎందువల్లనో ఆ నిద్ర నుంచి మెలకువ రావడం లేదు. ఆ మేల్కొల్పటానికి కాలపురుషులు, అవతార మూర్తులు నిర్ణయించి నటువంటి సమయము 1980 నుండి 2000 వరకు ఉన్నటువంటి 20 సంవత్సరాల కాలము. మన అందరి అదృష్టం ఏమిటి అంటే ఈ 1980 మధ్యకాలంలో మనము జీవించి యున్నాము. జీవించి యుండటమేకాక ఆధ్యాత్మికత గురించి కొంత అవగాహన అయ్యింది. దానిని తెలుసుకోవటానికి, ప్రయత్నం చేయటానికి సమావేశం అయ్యాము అది యింకో అదృష్టం అసలు ఆ కాలంలో జీవించి వుండటమే ఒక అదృష్టం. రెండవది ఈ కాలం యొక్క ప్రాముఖ్యత తెలుసుకోవటం ఇంకో అదృష్టం. దీని గురించి పురాణాలు, జ్యోతి శ్శాస్త్రిలు అనేకమయినటువంటి మహాత్ముల అతీంద్రియ శక్తుల ద్వారా 1425 వ సంవత్సరం నుండి మనకు తెలియచేస్తూనే వున్నారు 1980 నుండి 2000 వరకు చాలా ప్రముఖమైన సంవత్సరములు ఈ 20 సంవత్సరములలో ఏమి జరుగు తుందో, ఏమి జరగబోతుందో మీరు వూహించలేరు. దానిలో ఉన్నటువంటి మార్పులు దాని తరువాత వచ్చే జీవన విధానమును మీరు ఏ మాత్రం ఊహించ లేరు, ఏ విధంగా అయితే ఆఫ్రికాలో నేటి ఆధునిక జీవిత విధానము గురించి తెలియని ఆదివాసులకు ఈ నాడు అంతరిక్ష గ్రహయానము చేయుచున్న సమా జంలో ఎంత తేడా కన్పిస్తుందో అలాగే, ఈ 1998 లో సమావేశమై 21వ శతా బ్దంలో ఉండేటటువంటి– అంటే మనము–అంటే ఇంకో 10 సంవత్సరాల తరువాత ఉండే జీవన విధానానికి ఏ విధమయిన సంబంధం ఉండదు. అది మీ యూహకు అందదు. అని మన ఋషులే చెప్పటం కాకుండా విదేశాలలో చాలా మంది చాలా రకాలుగా చెప్పారు. ఆ చాలామంది చాలా రకాలుగా చెప్పే వారిలో Einstein పేరు మీరు అందరు వినే వుంటారు అతని మేధస్సు ఎంత ఎక్కువ అంటే అతని

మెదడు ఎలా పనిచేస్తుందో అని తెలుసుకోవడానికి ఈ నాటికి ఆయన మెదడు సురక్షిత పరిచి అమెరికాలో అనేక **Physiological laboratories లో** పరిశోధన జరుగుతోంది ఈయన మెదడు ఎలా పని చేసింది అని. 1855 మార్చి నాటికి శరీరాన్ని వదిలేశాడు ఆయన ఒక మాటన్నాడు. నాకు చాలా బాధగా వుంది ఎందుకంటే ఇపుడు వున్న చిన్న పిల్లలు చాలా అద్భుతమయిన జీవితాన్ని చూడబోతున్నారు దానిని నేను చూడలేక పోవుచున్నాను. కాని ఇది ఏదో గొప్పగా వుంటుందని అపోహపడుచున్నారు కాని అది రాబోయే జీవిత కాలం ఎలా గొప్పగా వుంటుందో మీ ఊహకు అర్థం కాదు కాబట్టి గొప్పగా వుంటుందన్న పదం మనకు తెలియనితనాన్ని తెలియచేస్తుంది అని అన్నాడు. ఇటువంటి 20 సంవత్సరాల కాలంలో 1980 నుండి 2000 సంవత్సరకాలం వరకు ఏ సంవత్స రములో ఎటువంటి కార్యక్రమాలు జరగాలో అనేటటువంటి విధానము మహాత్ములు చెప్పింది ఒకటి 1427 వ సంవత్సరములో హిమాలయాలలో జరుగుతుంది. ఈ మహాత్ములు పుట్టింది ముఖ్యంగా ఈ కార్యక్రమాలు వారు మానవ జాతికి అందించ దలుచుకున్నటువంటి దేవసూత్రాలు, ఆధ్యాత్మిక రహస్యాలు, అనేకమంది గురువులను భారతదేశానికి పంపించి తెలియచేస్తుంది ఈ గురువులందరు కూడ వారు వారు చేయదలుచుకున్న ఆధ్యాత్మిక ప్రయోగాలు, వారితోపాటు పూర్వ జన్మ సంబంధమున్న శిష్య సముదాయాలు భారతదేశంలో అనేక చోట్ల ఉపయోగించి నడుపుకు వస్తూయున్నారు వాటిలో కొన్ని ముఖ్యమైన పేర్లు మన అందరికి తెలుసు అందులో షిర్డిసాయిబాబా, సత్య సాయిబాబా రాబోయే టటువంటి ప్రేమ సాయి అవతారం చాలా విశిష్టమయిన పాత్ర వహించ బోవుచున్నది దానిని గురించి కూడ మనం 5 రోజులు చర్చించుకుందాం. కాని ఈ సాయి త్రిమూర్తులే కాదు. సాయి త్రిమూర్తులు అంటే షిర్డిసాయి, సత్యసాయి, ప్రేమసాయి తత్వమే కాకుండా రామకృష్ణ పరమహంస, కబీరు దాసు, సమర్థ గురు రామదాసు. ఈ మూడు ఒక రకమైన సందేశాన్ని భారతదేశాన్ని అందింప చేశాయి. ఇది కాకుండా రామకృష్ణ పరమహంస తన జీవిత విధానములో భారత దేశానికి ఇంకొక సందేశాన్ని అందించారు. అరవిందు, మెహర్‌బాబా, వీరందరూ కూడ ఒకే విధ మయినటువంటి 20 సంవత్సరాల కాలాన్ని 1980 నుండి 2000 సంవత్సరాల మధ్య కాలంలో మొత్తం మానవజాతి ఏ విధంగా జీవించాలి, ఏ విధమయిన పరిణామానికి లోను కాబోతోంది, దాని తరువాత మానవ సమాజంలో భారత

దేశం కాబోయేటటువంటి కాలంలో జగద్గురు పీఠాన్ని ఏ విధంగా అధిష్టించబోతోందో అన్న విషయం చెప్పటానికి వారు అవతరించారు కాని ఏ విధంగా అయితే అనేకసార్లు చెప్పిన విషయాన్ని, నిర్ణయాలను మనం సరిగ్గా అర్థం చేసుకోలేమో దాని వల్ల ఏమవుతుందంటే మహత్తరమైన కాలాన్ని మనము ఉపయోగించుకోలేక పోవుచున్నాము ఆ ఉపయోగించుకునే విధానాన్ని ఈనాడు చెబుతున్నటు వంటి గురువులు అధునిక భాషలో చెప్పిన మన భారతీయు లందరికి కూడ మూడు ప్రముఖ సూత్రాలను భారతీయ జీవిత విధానాన్ని ఋషులు ఏనాడో అందచేశారు ఆ మూడు ప్రముఖ సూత్రాలను గుర్తుంచుకొని మనము ఈ ఐదు రోజుల కార్యక్రమములో ఆ మూడు సూత్రాలు సంపూర్ణ మానవజాతికి ఏ విధంగా ఉపయోగపడుచున్నాయో, భారత దేశంలో అవి ఏ విధంగా పరిణతి చెందుచున్నాయో చెప్పారు అది పరిణతి చెందటాన్ని ఈ అశ్వమేధ యజ్ఞము అనేటటువంటి కార్యక్రమము ద్వారా మన సంపూర్ణ మానవజాతికి ఏ విధంగా—— విస్తరించగలవో చర్చించుకుందాము అందుచేత ముందు ఆ మూడు సూత్రాలు తెలుపుచున్నాను. ఇందాక మాధవి పాడిన పాటలో ఆ మూడు సూత్రాలు వున్నాయి. కాని ఆ మూడు సూత్రాలు కొత్తవి ఏమీకావు. సైన్సులో ఒక సామెత వుంది సామెత అని వ్రాశారు కాని అది ఒక Fact. అది ఏమిటంటే "The gretest truths are always simple" అరుదైన సత్యాలు ఎప్పుడూకూడ చాలా Simple గానే వుంటాయి కష్టతరంగా ఏమీ వుండవు కాని వాటిని ఆచరింప చేయటంలో చాలా కష్టతరంగా వుంటాయి, భారతదేశం గురుకులానికి ప్రాధాన్యత ఉన్నపుడు ఇపుడు ఏ విధంగా అయితే Medical entrance, Engineering entrance పరీక్షలు పెట్టుచున్నారో ఒక గురువు ఆశ్రమంలో కూడ ఈ Test జరిగింది. ఆ రోజులలో అయితే ఈ Test జరిగే ముందు చాలా Serious గా వుంది

కొన్నివేల మంది విద్యార్థులు ఆ గురుకులంలో అర్హత పొందటానికి, ప్రవేశార్హత పొందటానికి పరీక్ష వ్రాస్తే జరిగిన పరీక్షలో కేవలం 5గురు మాత్రమే పరీక్షలో ఉత్తీర్ణులు అయినారట. గురువుగారు వారిని పిలిచి మీరు 5గురు పరీక్షలో ఉత్తీర్ణులు అయితే అయ్యారు. కాని మీ అవగాహనశక్తి ఎంత వుందో తెలుసుకుంటే తప్ప మీకు గురుకులంలో ప్రవేశాన్ని ఇవ్వను కనుక మీకు చిన్న ప్రశ్న, చిన్న పరీక్ష పెడతాను ఆ పరీక్షలో మీరు కృతార్థులు అయితే నా గురుకులంలో మీరు

వుంటారు. లేకపోతే నేను ఏమీ చేయలేను అని అన్నారట. పిల్లలు, వాళ్ళ వాళ్ళ తల్లిదండ్రులు Entrance పరీక్ష పాసవకపోతే చేయగలిగినది ఏముంది పెట్టండి అని అన్నారట. సరే పెడతాను అని ఆ ఐదుగురిని కూర్చోబెట్టుకుని భగవంతుడు సర్వవ్యాపి అని చెప్పారట. భగవంతుడు సర్వవ్యాపి అని చెప్పిన తరువాత ఒక్క నిముషం వుండండి. అరటిపళ్ళు వున్నాయి గదా! ప్రొద్దుననుండి ఏమీ తినలేదు పరీక్ష హడావిడిలో వున్నారు మీరు ఇవి తినండి. అని 5 అరటి పండ్లు ఇచ్చారు. కాని ఒక Condition— ఎవరూ చూడకుండా తినండి వీటిని. తరువాత పరీక్ష పెడతాను అని అన్నారట సరే అందులో ఒక కుర్రాడు స్తంభం అవతలకి, ఇంకొకడు గోడ అవతలకి, అలా నలుగురు తలా ఒక ప్రక్కకు వెళ్ళి వచ్చారు నలుగురూ వచ్చేశారు కాని ఐదవ వాడు ఈనాటికీ రాలేదు. సత్యయుగం పోయినా కూడా. గురువు ఏమన్నాడంటే అతనురాడు అని ఏమంటే అతనికి అర్థం అయిపోయింది. ఆ సత్యం ఏమిటో! భగవంతుడు సర్వం వ్యాపించి వున్నాడు. అన్న సూత్రాన్ని చెప్పిన తరువాత ఎవరూ చూడకుండా తినే ప్రసక్తే లేదు అది అర్థమయిన తరువాత విద్య అక్కరలేదు అలాగే నేను చెప్పబోయే మూడు సూత్రాలు కూడా ఇటు వంటివే అందరికీ తెలిసినటువంటివే కాని దాసని ఆచరణలో పెట్టేసరికల్లా మన అలవాట్లు తొలుగుతాయి. అంతకంటే ఇంకేమి లేదు. అలవాట్లు మార్చుకొనే విధానము, ఆ అలవాట్లను మార్చుకొన్న తరువాత ఇతరులలో ఆ అలవాట్లు ఎలా మార్చాలి అన్న విషయాలన్నీ మిగతా రోజులలో చర్చించుకుందాం ఈ అలవాట్లు మనం అర్థం చేసుకొనే విధానం ఏ విధంగా వుంటుందో గురువులు ఇంతో కథ ద్వారా చెప్పారు. అంటే హిమాలయాలలో శ్రీనగరం దగ్గర ఒక కుగ్రామము వుంది. శ్రీనగరంలో ఆ కుగ్రామములో ఉండే టటువంటి ఒక వ్యక్తి రాత్రిపూట తన పొలాలకు కాపలా వుండేవాడుట. శీతాకాలం, చలిగా వుంటుంది కాపలా వుంటున్నాడు రాత్రి. ఒక రోజు సాయంత్రం కాపలాకు వెళ్ళే ముందు నడిచి ఊరిలోనికి వచ్చాడట. ఊళ్ళోకి వస్తుంటే ఏదో మీటింగు జరుగుతోంది. సరే ఏమి జరుగుతుందో చూద్దాం అని వచ్చాడు. చాలా సార్లు మీటింగులో మనం ఒకటి అనుకుని వస్తుంటాము కాని అక్కడ చెప్పేది ఇంకొకటి వుంటుంది. అదే విధంగా అతను ఏదో మీటింగు జరుగుతుందిలే కాసేపు కాలక్షేపం చేద్దాం అని వచ్చాడుట time pass అవుట లేదు. ఎలాగో time pass చేసుకుందాము అని. కాని ఆ మీటింగు డాక్టర్ల సమావేశం అయింది. ఆ

డాక్టర్లు మృత్యువు గురించి మాట్లాడుకుంటున్నారట. చెబుతున్నారు వాళ్లు మృత్యువు గురించి మనిషి చనిపోయేటపుడు ఏ యే పరిస్థితులు వుంటాయి; ఎలా వుంటుంది అని చెప్పుకొనేటప్పుడు మనిషి చనిపోయినప్పుడు కాళ్ళుచేతులు బిగుసుకుంటాయి, శరీరం చల్లబడి పోతుంది, కదలలేడు, ఏమీ చేయలేడు, మాట్లాడలేడు, వినిపించదు అని చెప్పుకుంటున్నారు ఈ లోపల అతనికి జ్ఞాపకం వచ్చింది. వీళ్ళు ఏదో చెప్పుకుంటున్నారు. సరే అక్కడ పొలానికి వెళ్ళి కాపలా కాయాలి అనుకొని ఇంటికి వెళ్ళాడు. భోజనం చేశాడు ప్రక్క బట్టలు అవి తీసుకొని పొలానికి వెళ్ళి పడుకున్నాడు ఆరోజు Cold Wave ఎక్కువ వచ్చింది. ఉదయం 4 30 కి మెలుకువ వచ్చింది. శరీరం అంతా బిగుసుకు పోయింది శరీరం అంతా చల్లగా వుంది. గుర్తు వచ్చింది. సాయంత్రమే విన్నాడు మృత్యువు యొక్క లక్షణాలు. చచ్చి పోయానని అనుకున్నాడు. చచ్చిపోయాను అనుకున్నాక సాధనలో ఉండేటటువంటి లోపాలు ప్రజలు తెలుసుకుంటారు. సాధారణంగా బాగా జాగ్రత్తగా అర్థం చేసుకోండి ఈ point ని. ప్రొద్దున ఎపుడో 4.30 నుండి లేవలేకపోయాడు కళ్లు తెరవలేక పోవుచున్నాడు. బిగుసుకు పోయాడు అని నిర్ధారణకు వచ్చాడు. కొంతమంది మనుష్యులు ఆ పొలం వెంబడి వెళ్లుతూ వుంటే ఇతనిని చూసి "పాపం! చచ్చిపోయాడు కాబోలు" అని అనుకున్నారు. విన్నాడు. ఓహో! నేను చచ్చిపోయాను కాబోలు అని అనుకున్నాడు. ఎందుచేత? నలుగురు కూడా చెబుతున్నారు గదా చచ్చిపోయాడు అని ఒకసారి ఏదో పత్రికలో ఒక joke చదివాను. అది ఎంతవరకు నిజమో నాకు తెలియదు గాని ఈ కాలం పరిస్థితులను చూస్తుంటే అది నిజం అన్పిస్తున్నది నాకు ఏమిటంటే ఒక patient ను మార్చురీకి తీసుకొని వెళ్లుతున్నారు స్ట్రెచర్ మీద వాడు లేచి అరుస్తున్నాడు బాబూ నేను చచ్చిపోలేదు అని నర్సు అంటుంది అంత పెద్ద Doctor చెపుతుంటే మధ్యలో నువ్వేమి చెబుతావు నోరు మూసుకొని పడ ఉండు అని. మార్చురీకి తీసుకొని వెళ్ళిపోతున్నారన్నమాట. అలాగే ఈ వ్యక్తి ప్రక్కన వాళ్లు చచ్చిపోయాడు అని అంటుంటే 'అమ్మయ్య అవును గాబోలు నేను చచ్చి పోయాను' అని నిర్ధారణకు వచ్చేశాడు. నిర్ధారణకు వచ్చి ఇంకొంచెం బిగుసుకు పోయాడు కదలకుండా వున్నాడు అందులో ఒక వ్యక్తి ఒడ్డున పడి ఉండనివ్వండి. నెమ్మదిగా తరువాత తీసుకొని వెళదాము అని అనుకున్నాడు. నాలుగు

రోజుల తరువాత చూడాలని వచ్చారు ఇతను ఎవరో తెలియదు. ఎక్కడికి తీసుకొని వెళ్ళాలో తెలియదు నాకు. ఏమి చేయాలో అని అనుకున్నారు అతను లేచి కూర్చుని 'మా ఇల్లు ఇటువైపే నాలుగో రోడ్డులో. నేను మాట్లాడకూడదు. చచ్చిపోయిన వాళ్ళు మాట్లాడకూడదు కానీ,నేను చెప్పాల్సి వచ్చింది ఏమి చేస్తాం?' అని పడుకున్నాడు తరువాత జరిగింది చూచి భయపడి పోయారు దయ్యం అనుకున్నారు వదిలేశారు పారేశారు సరే మన ఆధ్యాత్మిక సాధనలో కూడా మనం ఇటువంటి తప్పులు చేస్తున్నామేమో అంటారు గురువుగారు. గురువులు కూడా నిరంతరం మనకు సాధనా రహస్యాలను ఇస్తూ ఉంటారు ధ్యాన స్థితిలో అపుడు మనం అతీంద్రియ స్థితికి వెళ్ళితే ఏమిటో తెలియనపుడు ఎవరు పిలిచినా, ఏమి చేసినా మనకు వినిపించదు బాగానే వున్నది కాని పాలవాడు వచ్చి తలుపు తడుతున్నా కూడా మనకు వినిపించికూడ ధ్యానంలో వున్నాము అంటే తప్పేమో! ఒక్కసారి ఆలోచించండి. ఒక సారి లేచి వెళ్ళి తలుపు తీసి ఆ పని అయిన తరువాత మళ్ళీ వచ్చి కూర్చుంటే మంచిదేమో! ఇలాంటివి చిన్న చిన్న విషయాలు చిన్న చిన్న పనుల ద్వారా నిరంతరం అన్వేషిస్తూనే వున్నారు ఋషులు. కాని నిరంతరం అన్వేషిస్తున్నపుడు కూడా అసలయినటువంటి తత్వాన్ని మనం అర్థం చేసుకోలేక పోతే-రెండో దశలో-ఏకాదశి సమయంలో-గురుశిష్యుల సంబంధం ఏమో! భారత దేశం యొక్క బాల విశిష్టమయిన సంబంధం, తల్లిదండ్రుల సంబంధం కంటే చాలా గట్టిది, చాలా విలువయినది, చాలా అద్భుతమయినది కూడా. ఎందుకంటే తల్లిదండ్రుల సంబంధం ఒక్క జీవితానికి సంబంధించిందే.కాని గురుశిష్యుల సంబంధము ఒక్క జీవితానికి సంబంధించి కాదు ఒకసారి గురుశిష్యుల సంబంధం ఏర్పడిన తర్వాత మరల ఆ శిష్యుడు గురువులో పూర్తిగా లీనమైపోయేదాక ఆ సంబంధం అలా జరుగుతూనే వుంటుంది. అనాదిగా భారతదేశం నుండి వస్తుంది. ఏనాడు కూడ మన టీచర్ల సంబంధం గురించి మాట్లాడలేదు మన వాళ్ళు ఇది ఎందుకు చెబుతున్నానంటే భగవద్గీతలో గురుశిష్యుల సంబంధం పరాకాష్ఠ గురించి చెబుతూ విశ్వరూప సందర్శనంలో అయ్యేటప్పటికి భగవంతుడు ఏమి చెబుతాడంటే—

**"భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున**
**జ్ఞాతుంద్రష్టుం చతత్త్వేన ప్రవేష్టుం చ పరంతప".**

**11 అ॥ 54 శ్లో॥**

ఈ విధంగా విశ్వరూపాన్ని మీరు చూడలేరు. దీనిని మూడు విధాలుగా పని చేస్తేగాని తప్ప— 'వేము వేదాలు చదివాము చాలా పనులు చేశాము యజ్ఞాలు చేశాము అయినప్పటికీ మేము చేసినటువంటి సాధన ఎవరూ చేయలేదు' అని అనుకున్నా కూడా భగవంతుని యొక్క ఆ విరాట్ స్వరూపాన్ని ఆ విశ్వరూపాన్ని మీరు తెలుసుకోలేరు మూడే మూడు Conditions చెప్పాను ఈ మూడు Conditions మీరు పాటిస్తే మీరు నా యొక్క విశ్వరూపాన్ని తెలుసుకోగలరు ఏమి చెప్పేరు జ్ఞాతుం ద్రష్టుం, ప్రవేష్టుం ఈ మూడే మూడు Conditions చెప్పారు జ్ఞాతుం-తెలుసుకోండి. ద్రష్టుం-చూడండి, ప్రవేష్టుం-చొచ్చుకుపోండి- ఈ మూడు మన సాధనలో కనుక ఉంటే ఈనాడు ఇంతమంది గురువులు ఇన్ని కాలుగా బాధలు పడి మన మధ్య అవతారాలు ఎత్తి నిరంతరం చెప్పాల్సినటువంటి అవసరం వుండక పోయేది కాని భారత దేశంలో ఇపుడు మనం చెప్పుకున్నటువంటిది 5వ సంవత్సరమునాడే ప్రతి జీవికి కూడా గాయత్రీ మంత్ర స్వరూపం చెప్పాలి. మనకు అనేక రకాల అపోహాలు ఉన్నట్లే గాయత్రి మంత్రం గురించి బ్రహ్మాండమైనటువంటి ఒక అపోహ వున్నది. ఏమిటంటే ఆ అపోహ గాయత్రి మంత్రం ఓ భూర్భువఃస్వః తత్ సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్, ఇది గాయత్రి మంత్రం అనుకుంటున్నాం ఇదే గాయత్రీమంత్రం కాదు రామ గాయత్రి అని, హనుమాన్ గాయత్రి అని, సత్యసాయి గాయత్రి అని, గురు గాయత్రి అని రకరకాల గాయత్రీలు ఉన్నాయి. అందుచేత రకరకాల గాయత్రీలు వున్నపుడు ఓం భూర్భువః స్వఃతత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ అని ఒక్కటే గాయత్రి మంత్రం అని కదా మనకు స్ఫురణకు వస్తుంది! అది మనలో అనాదిగా ఉంటున్న పొరపాటు పంకజం—అన్నాము. పంకజం అంటే ఏమి చెబుతాము? పద్మం అని చెబుతాము కాని పంకజం అంటే పద్మం అని మాత్రమే అర్థం కాదు మట్టిలో పుట్టింది అని అర్థం వుంది. మట్టిలో పుట్టింది ప్రతీదీ పద్మమే, కాని మనం అలవాటుగా పద్మము అనే మాటను ఉపయోగిస్తాము అలాగే ఈ మూడు చెప్పాక విశ్వరూప దర్శనంలో జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం ఈ మూడు ఎక్కడయితే ఉంటాయో ఆ విధమయినటువంటి విధానాలు ఆ విధమయినటువంటి మానసిక స్థితి, ఆ విధమయినటువంటి అలవాటు కనుక మీకు ఉంటే మీరు గాయత్రి స్వరూపులే గాయత్రీ మూర్తులే. గాయత్రి మంత్ర మంటే మంత్రాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే అర్థమవుతుంది విద్మహే, ధీమహి, ప్రచోదయాత్, ఈ మూడు

ప్రతి గాయత్రి మంత్రంలోను వుండేవి. ఏ కారణం చేతనైనా, ఏ విధంగానైనా చెప్పుకున్నా కూడ ప్రతి గాయత్రి మంత్రంలో కూడ విద్మహే- తెలుసుకొనుట ధీమహి—దర్శించుట, ప్రచోదయాత్- ప్రేరణ పొందుట, ఈ మూడు వుంటాయి. ఈ విధంగా దేనినైనా దర్శించవచ్చు, దేనినైనా తెలుసుకోవచ్చు, దేనికైనా ప్రేరణ పొందవచ్చు ఈ మూడు కార్యక్రమాలు ఎక్కడయితే జరుగుతూ వుంటాయో అక్కడ గాయత్రి పనిచేస్తూ వుంటుంది. గాయత్రి ఎక్కడ పనిచేస్తూ ఉంటుందో అక్కడ మూడు రకాలయినటువంటి విలక్షణమైనటువంటి సిద్ధులు పొందుతారు అన్నారు. ఆ మూడు రకాలయిన సిద్ధులు పొందటానికి గాయత్రి మంత్ర జపం, గాయత్రి కర్మకాండ కాదు కావలసినది మీ మనస్సులో ఈ మూడు రకాలయి నటువంటి దాన్ని మీరు అర్థంచేసుకుంటూ ఉండాలి జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం విద్మహే, ధీమహి, ప్రచోదయాత్ ఈ పదాలు మన మామూలు జీవిత సరళిలో పెద్దగా అభివృద్ధి సాధించలేదు అనే ఉద్దేశ్యంతో వీనినే రకరకాలుగా త్రిపుటి అనే పేరుతో మన ఋషులు అన్వేషిస్తూనే వున్నారు గంగ, యమున, సరస్వతి ఇది ఒక త్రిపుటి ఇలాంటివే ఇంకా లభిస్తాయి

మీరు కాస్త జాగ్రత్తగా ఆలోచిస్తే, అలాగే మూడు రకాలయి నటువంటి జీవిత తత్త్వాలు ప్రజ్ఞ, నిష్ఠ, శ్రద్ధ. ఈ మూడు మీ జీవితంలో వుంటే మీరు ఏ పని చేసినా కూడా ఆ పనిలో సిద్ధి పొందుతారు ఇది మనకు గాయత్రీ మంత్రం ఇచ్చేటటువంటి సందేశం. ఈ గాయత్రి మంత్ర సందేశాన్ని ఏ విధంగా అయితే ఇదివరకు 5 యేళ్ళు 8 యేళ్ళ మధ్యన గాయత్రీ మంత్ర ఉపనయనాలు సంస్కా రాలు చేయబడేవో అవి తిరిగి మన జీవితంలో ప్రవేశింపచేయాలి. అనేటువంటి సంకల్పం 1465-1600 సంవత్సరముల మధ్యలో ప్రకృతిలో మనకు చాలా స్పష్టంగా కనబడుతోంది. ఇక్కడనుంచి నేను చెప్పే విషయాన్ని మీరు చాలా జాగ్రత్తగా వినండి. ఎందుకు నేను చాల జాగ్రత్తగా వినమని చెబుతున్నానంటే ఈనాడు మనం చర్చించుకున్న విషయం ఆకాశ పథంలో కొంతమంది మాత్రమే వింటున్న విషయము కాదు. ఆధ్యాత్మిక మైనటువంటి విషయాలు, మహాత్ములు అనంతమైనటువంటి ప్రేమతో ఆప్యాయతతో మానవ జాతికి అందించాలి అనే దృష్టితో గత 400 సంవత్సరాలుగా చేస్తున్న ప్రయత్నాల యొక్క పరాకాష్ఠ

ఈ 20 సంవత్సరములు. 1980 – 2000 వరకు, ఈ 20 సంవత్సరాల కాలంలో మనము ఒక వ్యక్తినిగాని, ఒక సంస్థనుగాని, ఒకానొక జీవిత విధానికి గాని, ఒకానొక కర్మకాండనుగాని అనుసరించకపోతే సత్యం మనకు కనిపించదు. Miss అయిపోతాము ఆ Pointని అర్థం చేసుకోవటానికి ముందు ఇందాక నేను చెప్పానే గాయత్రి మంత్రం అంటే ప్రజ్ఞ, నిష్ఠ, శ్రద్ధ, ఈ మూడింటినికూడ గాయత్రీ మంత్ర పరాకాష్టగా వేదమాత, దేవమాత, విశ్వమాత స్వరూపాలుగా అర్థం చేసుకున్నారు. ఈ 5 రోజుల కార్యక్రమంలో మేము మీ నుంచి ఆశించేది, మేము మీకు తెలియచేయటానికి చేసే ప్రయత్నము ఎందుకంటే ఈ ఐదు రోజుల తరువాత ఇక్కడినుంచి వెళుతున్న వ్యక్తి మీరు అవగూడదు. పూర్తిగా సంస్కరించబడి, భారతదేశ ఆధ్యాత్మిక తత్వాన్ని పూర్తిగా అవగాహన చేసుకున్న వ్యక్తులుగా, మీరు ఒక దివ్యజ్యోతులుగా మీరు వెలుగుతూ, ఆ వెలుగులను ఇతరులకు అందింప చేయుటకు తగిన వ్యక్తులుగా మీరు వెళ్ళాలనే ఆకాంక్ష. దీనిలో ప్రయత్నమే నాది. గొంతుక మాత్రమే నాది మిగతా కార్యక్రమాలలోగాని, ఆ దివ్యానందంలో మీకు వచ్చే ప్రేరణలుగాని ఆ గురువులవే. అది జాగ్రత్తగా అర్థం చేసుకున్న తరువాత అసలు విషయానికి వద్దాము.ఇక్కడ రెండు మాటలు ఉపయోగించాను నేను. ఒకటి అశ్వమేధ యజ్ఞము; రెండవది దేవ సంస్కృతి దిగ్విజయము ఈ రెండు మాటలు అర్థం చేసుకోవటానికి ముందు అశ్వమేధ యజ్ఞం అనగా ఏమిటి ? దాని తరువాత దేవ సంస్కృతి దిగ్విజయము అన్న మాట మనము వాడుచున్నాము ఈ దేవ సంస్కృతి దిగ్విజయము అంటే మనము ఏమి చేయాలి? జీవన విధానంలో ఏ విధమయినటువంటి మార్పులు రావాలి? అని తెలుసుకునేముందు మాధవి పాడిన పాటలో అతి స్పష్టమయినటువంటి, అతి సులభమైనటువంటి మూడు ఆధ్యాత్మికమయినటువంటి రహస్యాలు వున్నాయి—వానిని మీరు ప్రేరణగా తీసుకుంటే చాలు అని చెప్పాను.

ఏమిటంటే మొట్ట మొదటిది కర్మసిద్ధాంతం. ఈ కర్మసిద్ధాంతం భారతీయునికి తెలియనిదిగాదు. ఇది నీ కర్మ అని అనేస్తుంటాము అందరం కూడ ఎక్కువ బాధపడం మనం. ఎందుచేత? మనం చేసిన పనులన్నీ ఇదివరకు చేసిన దానినిబట్టి వచ్చినవే అని రాగద్వేషాలతో వచ్చింది అనే అవగాహన భారత దేశంలో చాల ఎక్కువగా వుంది

మన కర్మ సిద్ధాంతం ఈనాడు ఏమనుకుంటున్నామంటే మనం ఏం

చేస్తాం. చాలా ప్రయత్నం చేస్తున్నాను కాని నా కర్మ అలా యేడ్చింది. నేనేమి చేయను. నా తప్పు గాదిది. పూర్వజన్మలో చేసిన పాపాలు ఇలా బాధ పెడు తున్నాయి. అన్నది కర్మసిద్ధాంతము అనుకుంటున్నాము. ఇదికూడా ఋషులు ఆ విషయం గురించి చెప్పలేదు చెప్పవలసిన అవసరంలేదు. ఎందుకంటే మనం చేసినటువంటి పనులే ఫలితాన్ని యిస్తాయి. దానిని మార్చుకోలేము అనుకుంటే అసలు ఆ కర్మ సిద్ధాంతాన్ని తెలుసుకునే అవసరం ఏముంది? జరిగేది ఎలాగూ జరుగుతుంది. కాని ఆ కర్మ సిద్ధాంతమే మనకు అందచేస్తున్నప్పుడు ఋషులు చెప్పినటువంటి కర్మసిద్ధాంతానికి ముందు ఒక మాటున్నది, 'బుద్ధిః కర్మానుసారిణీ' అని. దీనినికూడ మనము చాల తప్పుగా అర్థం చేసుకున్నాము మనబుద్ధి యెలా వుంటే అలా ఆచరిస్తాము అని మనం పని యెలా చేస్తామో మనకు అటువంటి బుద్ధి వస్తుంది నేను Chemistry లో Chemistry practicles చేస్తుంటే నాకు Physics రమ్మంటే రాదు. నా బుద్ధిలో Chemistry యే వుంటుంది కదా! నేనుచేసినటువంటిపని ఏవిధమయిన కర్మ వుంటుందో అటువంటి బుద్ధివస్తుంది. అటు వంటిబుద్ధివల్ల ఫలితాలు మారుతూ వుంటాయి, అనేటువంటి అతి చిన్న రహస్యాన్ని మనం ఎంత తప్పుగా అర్థం చేసుకున్నామో చూడండి. కర్మసిద్ధాంతంతో మనం పని చేయనవసరంలేదు ఎవరి పాపానికి వాళ్ళే బాధ్యులు. ఒకడు బాధపడుతూ వుంటే బాధపడనీ వాడి కర్మ అలా వుంది మనము ఏమీ చేయలేము. అనేటటు వంటి సిద్ధాంతాన్ని మన ఋషులు చెప్పలేదు కర్మసిద్ధాంతంలో. జాగ్రత్తగా వినండి ఎవరు ఏ ఫలితాన్ని పొందాలనుకుంటారో ఆ ఫలితాన్ని పొందేటటువంటి కర్మకాండ, ఆ ఫలితాన్ని పొందగలిగినటువంటి క్రియా విశేషాలన్నీ తెలుసుకొనే టటువంటి జ్ఞానాన్ని మన ఋషులు మనకు అందచేస్తే, అది చెయ్యకుండా ఉండడం ఎలాగా? అనే విషయాన్ని మనం తీసుకుంటాం.

నాయనా! నీకు అర్థం అవటంలేదు నేను చెప్పేది. నేను Clear గానే చెపు తున్నాను విషయాన్ని, కాని నీవు అసలు విషయాన్ని అర్థం చేసుకోకుండా నాయనా నీవు Confuse అయి పోవుచున్నావు అని 18 అధ్యాయాలు చెప్పాడు. 18 అధ్యాయాలు భగవానుడు చెప్పిన తరువాత శిష్యుడు అయినటువంటి అర్జునుడు కృతజ్ఞత ఎలా చూపిస్తున్నాడో చూడండి. నాకు చాలా ఆశ్చర్యమేస్తుంది. మన భారతదేశములో కృతజ్ఞతకు చాల విలువ ఇచ్చుకుంటాము. అందులో శ్రీకృష్ణుడు స్వయంగా చెప్పిన భగవద్గీత జ్ఞానాన్ని అందుకున్నటువంటి అర్జునుడు 18

అధ్యాయాలు పూర్తిగా విన్న తరువాత తన కున్నటువంటి సంశయాలు పూర్తిగా తీర్చుకున్న తరువాత ఇందాక చెప్పాను మీరు జాగ్రత్తగా వింటే తెలుస్తుంది. ఇందాక ఏమి చెప్పానో సుశీలను అడగండి ఇందాక ఏమి చెప్పానో గుర్తు వచ్చిందేమో? ఇందాక ఏమీ చెప్పలేదు నేను. మరి 18 అధ్యాయాలు చెప్పిన తరువాత ఏమి చేశాడు అర్జునుడు? "నష్టో మోహః! మోహః! అంటే నేను తప్పుగా అర్థం చేసుకుంటున్నానే– ఆ తప్పుగా అర్థం చేసుకునే విధానాన్ని నీవు సక్రమంగా పెట్టేవు కాని ఆ జ్ఞానం నాలో లేదా? ఈ నష్టోమోహః అంతవరకు అంటే బాగుండేది. మనం చాలా సుఖపడే వారము దాని తరువాత పదం ఉందే ఈ మూడు పదాలు గీతను మన నుంచి చాలా దూరం చేశాయి ఎందుకంటే, మొదటి నుండి చదివి వుంటే సందేహాలనివృత్తి చేసుకుంటూ భగవద్గీతలోని పదాల అంతరార్థాలను తెలుసుకొనే ప్రయత్నం చేస్తాముతప్ప భగవద్గీత పూర్తిగా చదివిన తరువాత మనలో ఉండేటటువంటి మోహము ఎంత నష్టమయింది, మన మోహం పోయిందా అన్న ఆలోచన 'నష్టోమోహః!'· మన మోహం పోయిందా? అన్నదానికి Proof ఏమిటి? అందులోనే చెబుతున్నాడు నీకు కనుక శక్తి వస్తే నీ శక్తి ఎవరికి? నీ యొక్క శక్తి నీకు గుర్తుకు వస్తే, మొదటి నుండి అర్థం అయితే చదువనక్కర లేదు. కాని రోజూ పారాయణ చేస్తూనే ఉన్నా ఫలితం ఏమీ రాదు సరే! భగవద్గీత పారాయణ చేశాము. నాకు మోహం పోయింది నేను భగవంతుడిని అహం బ్రహ్మాస్మి! అని తెలుసుకున్నాను. అంటే కాదు నాయనా నీవు తెలుసుకుంటే లాభం లేదు. నీవు భగవంతుడవని తెలుసుకున్న తరువాత నీ నోటిలోనుండి రావలసిన పదాలు చాలా స్పష్టమయిన పదాలు ఇచ్చారు. 'కరిష్యే వచనంతవ' నీవు ఏది చెప్తావో అదే నేను చేస్తాను. నా యొక్క ఆలోచనలు గాని, నేను చేయదల్చుకున్నది గాని ఏమీ లేదు అనేటటువంటి అద్భుతమైన జీవిత ప్రణాళిక, మన ఋషులు కర్మ సిద్ధాంత రూపంలో అందించారు ఈ ప్రణాళికను మనం ఎంత అర్థం చేసుకోగలిగితే చేయవలసినది ఇంతేమీలేదు సందర్భోచితము కాకపోయిన Reader digest లో చదివిన ఒక చిన్న కథ గుర్తుకు వస్తుంది నాకు. ఒక చిన్న elementary school లో ఆఫ్రికాలో టీచరు పాఠం చెబుతున్నదట. ఎందుకో టీచరు ఆ ప్రశ్న ఎందుకు అడిగాడో తెలియదు. ఆఫ్రికా కాబట్టి అడిగాడేమో హఠాత్తుగా సింహం ఇక్కడకు వస్తే ఏమి చేస్తారురా అని అన్నాడట. elementary school చిన్న పిల్లలు సింహం వస్తే ఏమి చేస్తారురా అంటే ఏమి చెప్తారు

చిన్న పిల్లలు? class అంతా silent అయిపోయిందట వెనక నుంచి చిన్న sound వినిపించిందట. మేమేమి చేస్తాం sir? చేసేదేదో సింహమే చేస్తుంది అని. కరిష్యే వచనంతన వారి మానసిక స్థితి. అది ఆత్మ సమర్పణకు పరాకాష్ఠ. మన జీవిత విధానము భారతీయ సంస్కృతి నిరంతరం రకరకాలుగా మనకు అందచేస్తుంటే అది తప్ప వేరువిధమైనవి ఆలోచిస్తాము మనము. కరిష్యే వచనంతవ కాదు, నాకు ఏది correct అనిపిస్తే అది చేస్తాను.

కౌరవులు, పాండవులు యుద్ధానికి ready అయ్యారు. యుద్ధానికి ready అయిన తరువాత 'నా రధాన్ని ఇటు పాండవులకు, అటు కౌరవులకు మధ్య తీసు కొని వెళ్ళి వుంచు నేను ఎవరితో యుద్ధం చేయాలో చూసుకుంటాను' అన్నాడు అర్జునుడు చూసుకుంటాను అన్న తరువాత వెళ్ళాడు, చూసుకున్నాడు. చూసు కున్నాక ఎవరు కన్పిస్తున్నారు. ఎదురుగా ద్రోణుడు, తాతగారు, బంధువులు మేన మామలు—, అందరు బంధువులే! వీళ్ళతోనా నేను యుద్ధం చేస్తాను? అని ఈ నెత్తురు కూడు నాకు అక్కర లేదు దయ, కరుణ మానవత్వము అంటే నా బంధు వుల నందరినీ చంపుకొని, ఈ రాజ్యం నాకు అక్కరలేదు రాజ్యం ఏమిటి? ఈ ఊళ్ళు అన్నీ నాకు అక్కరలేదు అని ఎవరికి చెబుతున్నాడు అర్జునుడు? శ్రీకృష్ణు డికి చెబుతున్నాడు గురువుకి శిష్యుడు చెబుతున్నాడు. ఇదే తప్పు మనము చేస్తూ ఉంటాము గురువులు ఎలా చేయాలి గురువులు ఎలా ప్రవర్తించాలి అని మనం నిర్ధారణ చేసి ఆ విధంగా ప్రవర్తిస్తేనే అతను గురువు. ఆ విధంగా ప్రవర్తించక పోతే అతను గురువు కాదు. అని నిర్ణయానికి వచ్చేస్తాము. అసలు గురుత్వము అంటే ఏమిటో మనకు తెలియదు కనుక అతను చెప్పింది మనం చేయం. దానిని మనం చాల జాగ్రత్తగా గుర్తుంచుకోవలె. భారతీయ ఆధ్యాత్మికత ఏమిటో, అసలు విషయం ఏమిటో మనం చేస్తున్న తప్పు ఏమిటో మనం గురువును వెతుక్కుంటూ వెళ్ళతాము. భారతీయ ఆధ్యాత్మికతలో గురువు మనలను వెతుక్కుంటూ రావాలి. మళ్ళీ అదే తప్పు చేస్తాం. ఇంతమంది శిష్యులు ఉంటారు. ఇంతమంది మహాత్ములకు ఎంత శిష్యగణం ఉంటారో వీళ్ళలో ఆ మహాత్ముడు ఇతడు నా శిష్యుడు అని చెప్పే వాళ్ళు చాలా తక్కువమంది ఉంటారు. మిగతావాళ్ళు అందరు ఫలానా వాళ్ళు నా గురువు అని అంటూ ఉంటారే తప్ప ఆ గురువు చెప్పినటువంటి జీవిత విధానాన్ని ఆ గురువు ఏ విధంగా జీవించాలో మనం చెబుతూ ఉంటాము తప్ప ఆయన మీకు తెలుసునాండి సిగరెట్టు కాలుస్తున్నాడు. ఆయన సిగరెట్టు కాలుస్తూ

న్నాడు కనుక నాకు గురువు కాదు ఇక్కడ గురువు సిగరెట్టు కాల్చవచ్చు అని చెప్పానని అనుకుంటే మీరు మళ్ళీ నన్ను సరిగ్గా అర్థం చేసుకోలేదని అర్థం. నేను చెప్పే విషయం కొంచెం అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చేస్తే ఆ గురువు మనసులో ఎలా ప్రతిబింబిస్తారో అర్థమవుతుంది. ఎందుచేతనంటే గాయత్రిని గురు మంత్రం అని కూడ అంటూఉంటాము మనము అందుచేత నష్టోమోహః! స్మృతిర్లబ్ధా అనే మానసికస్థితి మనకు రానంత వరకు మనము శిష్యులము కాదు. ఈ మూడు మాటలను నష్టోమోహః! స్మృతిర్లబ్ధా, కరిష్యేవచనంతవ మీరు చెప్పింది నేను చేస్తాను అనే స్థాయికి ఎప్పుడైతే మనం ఎదుగుతామో- గురువుకు చెప్పటం మానివేసి గురువు చెప్పింది మనము చేస్తామో అపుడే మనం నిజమైన సాధకులం కాగలం— నీవు పండితుడివలె మాట్లాడుచున్నావు కాని నీవు పండి తుడవు కావు. ఈ విధమైన అవగాహన కర్మ సిద్ధాంతం. ఇదంతా దేనికి చెబు తున్నానో మర్చిపోకండి. ఇదంతా నేను భారతీయ ఆధ్యాత్మికత అశ్వమేధ యజ్ఞము పుస్తకంలో దేవ సంస్కృతి దిగ్విజయాత్ర ఏ విధంగా భారతదేశంలో యున్న మనందరం చేయాలని చెప్పి, చర్చించు కుంటున్న ఋషులు మనకి అంద చేసిన మూడు సిద్ధాంతాలలో కర్మ సిద్ధాంతం గురించి చెప్పేను. కర్మ సిద్ధాంతం అంటే బుద్ధి కర్మానుసారిణి. మనం ఏ విధమైన పనులు చేస్తూంటామో ఆ విధమైన బుద్ధి మనకు వస్తుంది. బుద్ధి అంటే ఫలితం పొందచేసేటటువంటిది బుద్ధి ఇది జాగ్రత్తగా గుర్తుంచుకోండి. అంటే అర్థం ఏమిటి ? నీకు ఏ విధమైన ఫలితాలు కావాలో నీకు ఎ కోరికలు ఉన్నాయో ఆ కోర్కెలన్నీ తీర్చుకొనే మార్గము కర్మ సిద్ధాంతం చెబుతుంది.

భారతీయ జీవన విధానములో మొట్ట మొదటి నుండి చాలా సవ్యమైన అవ గాహన యుండాలి కర్మ సిద్ధాంతం మీద. కర్మ సిద్ధాంతం అంటే గుర్తు ఉంచు కోండి మీరు ఏ కోరికలైతే మీరు కోరారో అది మంచి కోరిక, చెడ్డ కోరిక ఋష లకు అనవసరం. విజ్ఞానంలో మీరు దానిని ఎందుకు ఉపయోగిస్తారో మాకు అన సరం లేదు.మనుష్యులను చంపటానికి ఉపయోగిస్తారా, సేవా కార్యక్రమాలు చేయ టానికి ఉపయోగిస్తారా అనేది మీ నిర్ణయం. కాని ఉపయోగించుకోవచ్చు అనేది చెప్పటం మాత్రమే Science కనుక ఋషులు ఏమి చెప్పారంటే మీకు ఏ కోరిక లున్నా ఆ కోరికలు ఏమిటో మాకు అనవసరము కోరికలు తీర్చుకోదలుచ కున్నారా? కర్మ సిద్ధాంతం నేర్చుకోండి. అందువల్ల భగవద్గీత 3 వ అధ్యాయంలో కర్మ సిద్ధాంతం అనే పేరుతో యజ్ఞం గురించి చెప్పబడింది. మీకు ఏ కోరికల

ఉంటే ఆ కోరికలు తీర్చుకోండి విధానం మాత్రం ఇది. కాని ఈ విధానంలో ఎంత పెద్ద తప్పు చేస్తున్నామో చూడండి. జాగ్రత్తగా నా స్నేహితుడు ఒకసు సింగపూర్ వెళ్ళాడు. ఎందుకెళ్ళాడో అడక్కండి.

ఎందుకో వెళ్ళాడు వెళ్ళిన తరువాత నా కోసం ఒక Present పట్టుకొచ్చాడు. నాకు ఈ భగవంతుడు, సాధన, ఉపాసన వీటి మీద Interest ఉంది కనుక ఏమి తెచ్చాడా అని. చాలా ఆలోచించాను 'రామకృష్ణా! నీకు సరియైనటువంటి బహుమతి ఏమిటంటే ఊదుకడ్డీలు తెచ్చాను అక్కడి నుండి' అన్నాడు. foreign నుండి అది Foreign అనగా నాకు కొంచెం ఉత్సాహము వచ్చింది. ఏమి తెచ్చాడా అని చూశాను సింగపూర్ నుంచి Packet ఇచ్చాడు Packet చూసేసరికి అవి మన ఏలూరులో చేసిన ఊదుకడ్డీలు సింగపూర్ నుండి foreign వస్తువు అని తెచ్చాడు. ఇదేమిట్రా! ఇది తెచ్చావు సింగపూర్ నుండి అంటే, సింగపూర్‌లో ఎలూరు foreign గదా అన్నాడు. ఈ కర్మ సిద్ధాంతం, ఈ జ్ఞాన సంపద భారత దేశము నుండి విదేశములకు ఎగుమతి అయ్యాయి అక్కడ నుండి ఆంగ్లభాషలో వస్తేగాని మనకు నచ్చదు. ఎందువల్ల ఏమి జరుగుతుంది అనే దానికి అసలైన సాధన ఏమిటంటే విదేశాలలో ఏదైనా ఒక విషయాన్ని అవగాహన చేసుకున్న తరువాత దానిని practical utility అంటూ ఉంటే నిజంగా దానిని మనం ఉప యోగించుకోగలమా అని test చేసుకున్న తరువాత గాని దానిని ఉపయోగించుకో లేరు మన భారత దేశములో ప్రతిచిన్న విషయము, ప్రతీదీ కూడా Most practical కాని most practical అవటానికి సామాజిక, మానసిక, భౌతిక సామర్ధ్యము ఈనాడు మనలో లోపించాయి అది లోపించడానికి గల కారణము ఏమిటంటే మొత్తం, భారతీయ జాతి మొత్తం కూడా సాధన అనే ప్రక్రియ పూర్తిగామర్చిపోయింది నేను సాధన చేసుకుంటున్నాను అనే పదాన్ని ఎవరైనా పలికితే మనకు ఏమని అన్పిస్తుందంటే ఏదో జపం చేసుకుంటున్నాడు సాధన చేసుకుంటున్నాడు గదిలో కూర్చొని మాల తీసుకుని సాధన చేస్తున్నాడు అంటాము. ఏదో యజ్ఞం చేస్తుంటే సాధన చేస్తున్నాడు అంటాము కాని సాధన అనే పదం ఏ క్షణాన్న మనము ఉచ్చరిస్తామో ఎంత భయంకరమైన చిక్కుల్లో మనం ఇరుక్కుపోతున్నామో మనమే తెలుసుకుంటే మీరు సాధన చేసుకుంటున్నాము అనే మాటను ఉపయోగించరని గురుదేవులు ఎప్పుడూ అంటూ ఉంటారు. ఎందుచేతనంటే సాధన చేయుట అను

మాటను ఉపయోగించిన మరుక్షణం ఇరవై నాలుగు గంటలు మీరు ఇరుక్కుపోయి నట్లే. ఎందుచేతనంటే సాధన అనేది 2 నిమిషాలు, 3 నిమిషాలు, 5 నిమిషాలు చేసేటటువంటి కార్యక్రమము కాదు. 2 నిమిషాలు, 3 నిమిషాలు, 5 నిమిషాలు ఒక గంటసేపు చేసేటటువంటి కార్యక్రమాన్ని ఉపాసన అంటారు సాధన అనేది 24 గంటలు చేసేటటువంటి Self analysis. మనం ఏ దేవతను ఉపాసన చేస్తు న్నామో, ఏ ఫలితాన్ని పొందటానికి మనం ప్రయత్నం చేస్తున్నామో ఆ ఫలి తానికి కావలసినటువంటి మానసిక స్థితిని నిరంతరం 24 గంటలు మనము ఆ స్థితిలో ఉన్నామో లేదో చూసుకొనే విధానము సాధన. అందుచేత సాధన 24 గంటలు జరుగుతూ ఉంటుంది. ఏదో ఒకసారి జరిగేది కాదు. గాయత్రి ఉపాసన చేస్తున్నాము. ఆ సద్బుద్ధి అనే మనస్సు ప్రేరణ పొందాలి అనేటటువంటి ప్రతి మాటను ఉచ్చారణ చేసిన తరువాత ఆ మంత్రాన్ని మననం చేసేటటువంటి జ్ఞానాన్ని మన నిత్య జీవితంలో సాధన చేయాలి అంటే మీరు చేస్తున్నటువంటి ప్రతి పని కూడా సద్బుద్ధి వైపుకే ప్రేరణ చెందుతుంది. లేకపోతే అందులో మీ స్వార్థం ఏదైనా ఉందా అని నిరంతరం మీరు పరిశీలన చేసుకుంటూ ఉంటే అది సాధన అవుతుంది అది కర్మకాండ అవుతుంది. అందుచేత గాయత్రి మంత్రంలో కర్మకాండలో మనం నేర్చుకోవలసినటువంటి మొట్ట మొదటి సూత్రం ఏమిటంటే మనం ఏ విధమయిన పని చేయదలచుకున్నామో, ఏ విధమయినటువంటి ఫలి తాన్ని పొందదలచుకున్నామో దానికి తగినటువంటి కర్మ నిర్వహణ చేయాలి. 10 రూపాయలు పెట్టి ఎవరైనా డైమండ్ నెక్లెస్ కొన్నాము అని ఎవరయినా అంటే ఆ విషయం మనం అనుకుంటాము. ఒకటి వాడు తెచ్చినటువంటి నెక్లెసు డైమండ్ గాదు మామూలు గాజుతో చేసినవే imitation, నకిలీయే అని ఒక నిర్ణ యానికి వస్తాము కాకపోతే రెండవ నిర్ణయం దేనికి వస్తాము. పాపం మోస పోయాడు 10 రూపాయలకు ఎక్కడైనా వజ్రాల హారం దొరుకుతుందా! ఈ రెండే భావనలు వస్తాయి మనకు. కాని ఆధ్యాత్మిక జగత్తులో కేవలం రూపాయి పావలాకే మనం ఇటు గోదానం, సువర్ణదానం మిగతా అన్ని ఫలితాలు మనకు వచ్చేస్తాయి అంటే, ఈ మానసిక దౌర్బల్యం నుండి బైటపడాలి. అంటే ఇంత నీచమయిన మానసిక స్థితిలో ఉండకు. అంత తేలికగా మీకు ఫలితాలు రావు అన్న సత్యం మీకు తెలుసు గదా! 10 రూపాయలకే వజ్రం దొరకదు అనుకుంటే రూపాయి పావలాకు అన్ని రకముల పుణ్యాలు పొందుతాము అనేటువంటి మూర్ఖత్వము

ఇమిడి ఉంది నీలో అన్నది కనుక మనం జాగ్రత్తగా గుర్తుంచుకో గలిగితే భారతీయ ఆధ్యాత్మికలో తిరిగి తన ఔన్నత్యాన్ని పొందగలుగుతుంది. ఆ స్థాయిని పొందగలుగుతుంది ఈ జీవిత విధానాన్ని మనం ఎప్పుడైతే అర్థం చేసుకోగలుగుతామో కర్మ సిద్ధాంతాన్ని చాలా స్పష్టంగా అర్థం చేసుకొని మనం ఎంత పని చేశామో అంత ఫలితం వస్తుంది For Every action there is an eQual reation అనేటటువంటి natuarl phenomena అనే మానసిక, భౌతిక స్థాయిలో కూడా మన ఋషులు మనకు అందించిన కర్మ సిద్ధాంతం అని మనం అర్థం చేసుకోవాలి...

పూర్వ కాలంలో ఎవరికి ఏ ఫలితాలు కావాలన్నా ఏమి చేస్తే ఆ ఫలితాలు వస్తాయి అనేటటువంటి విషయాలు మొత్తం కూడా మన వేదాలలో చెప్పబడి ఉంటాయి. ఉపాసన కాండంలో ఇది ఒకటి. కర్మ సిద్ధాంతం చాలా జాగ్రత్తగా గుర్తుంచుకోండి. దీనిని మనము రేపటి నుండి చర్చించుకోబోయే అశ్వమేధయాగం, దేవ సంస్కృతి దిగ్విజ యాత్రలో నిరంతరం మనము దీనిని చర్చించుకుంటూ ఉంటాము. కర్మ సిద్ధాంతం తరువాత మన ఋషులు అనుగ్రహించినటువంటి ఇంకొక చాలా గొప్ప సూత్రం వుంది. ఈ ఒక్క సూత్రాన్ని మీరు practice చేస్తే మీ జీవిత విధానము పూర్తిగా మారిపోతుంది. అది నా అనుభవమే కాకుండా నా స్నేహితుల అనుభవం కూడా.

వాళ్ళ పిల్లలు, ఒకళ్ళు Doctor, ఒకడు Engineer అవ్వాలని కోరిక అందరి కోరికల్లాగే. కాని వాళ్ళ అబ్బాయికి చిన్న దురలవాటు వున్నది. రాద్దామనుకున్నా కూర్చుని పరీక్షల్లో వ్రాయలేను మాష్టారు. అనే వాడు నాతో. అందు చేత ఇంటర్మీడియట్ పరీక్షలో ఎప్పుడూ కూడా పది మార్కులు దాటేవి కావు. ఎప్పుడూ కూడా Botany, Zoology లో కాని, Physics లో గాని, Chemistry లో గాని. ఇలానే ఒకసారి మీటింగు జరుగుచున్నప్పుడు నేను చెప్పబోయేటటువంటి సూత్రాన్ని చెప్పితే అతను వచ్చాడు. వాళ్ళ పిల్లవానిని తీసుకొని నా దగ్గరకు వచ్చిమాష్టారు మీరు చెప్పారు బాగానే ఉంది కాని వీడు రెండవసారి అంటే March అయిపోయింది September కి కట్టబోవుచున్నాడు. వీడు Doctor అవ్వాలని నా కోరిక. మీరు చెప్పిన సూత్రాన్ని నేను తు. చ తప్పకుండా పాటిస్తాను. వీడు Doctor అవుతాడా అని అన్నాడు. నేను చెప్పినటువంటి సూత్రము

అయితే నేను గ్యారంటీ ఇవ్వలేనయ్యా ! కాని ఇది నేను చెప్పినటువంటి సూత్రం కాదు. యుగ యుగాలుగా భారతీయ సంస్కృతి యొక్క flash back కనుక మనము ఆలోచిస్తే చాలా తమాషాగా ఉంటుంది. రామాయణంలో హనుమంతుడు వచ్చి సీతను రావణాసురుడు ఎత్తుకుపోయాడట. ఎక్కడ ఉంది మాకు తెలియడం లేదు చెప్పగలరా? మీరు చెప్పగలరా? అని అన్నాడట ఎన్నో రాముడు? అని అడిగాడట చాలా పాతది అలా ఒక రామాయణం గురించి మాట్లాడటం లేదు ఎన్నో రామాయణాలు జరిగాయి. ఎంతోమంది రాముళ్ళు వచ్చారు పోయారు ఏ రాముడి గురించి అడుగుతున్నావయ్యా అన్నాడట. అంత పాత చరిత్ర చెప్పి దానిని పాతది అనటం అనవసరం మాష్టారు దాని అంతం ఎక్కడుందో మనకు తెలియదు వాళ్ళు చెప్పిన సూత్రం నేను చెబుతున్నాను. కనుక ఖచ్చితంగా జరుగుతుంది అందుచేత గుర్తుంచుకోండి రామకృష్ణ చెప్పాడు కనుక అది corret అనుకుంటే తప్పు అది ఋషులు చెప్పారు కనుక corret అది. ఆ సూత్రం ఏమిటంటే ఇంగ్లీషులో చెప్పుకుందాము ఎందుకంటే ఇంగ్లీషులోనే చెప్పుకుంటే బాగుంటుందది Energy Follows Thought మీ ఆలోచనలను బట్టి శక్తి ప్రవాహము వుంటుంది. అటువంటి విధానము అంటే ఏమిటి ఇపుడు అతను Doctor అవ్వాలి, అంటే మొట్టమొదటి మీ ఆలోచనలో అతను Doctor అయి వుండాలి. మీరు ఇంట్లో ఎవరయిన రాగానే ఏం చెబుతారు. పరిచయం చేయటం వాడు వట్టి వెధవండి వాడు వట్టి శుంఠండి. వాడు ఎందుకు పనికిరాడండి మార్కులు రావండి. ప్రక్కింటి వాడిని చూడండి.ఇది మనం చెప్పే విధానము. మన ఆలోచనా విధానము ఇదే మన ఆలోచనా విధానములో inspite of it వాడు పరీక్ష పాసవుతున్నాడు అంటే ఆశ్చర్యపోవాలి. పరీక్ష పాసవ్వకుండా వుండటానికి ఎన్ని రకాల ప్రయత్నాలు చేయగలుగుచున్నామో అన్ని రకాల ప్రయత్నాలు చేస్తున్నాము మన ఆలోచనలను బట్టి శక్తి ప్రవాహముంటుందని విషయాలనందించిన ఋషి హిమాలయ వాసి

—అతని గురించికూడ దేవసంస్కృతి దిగ్విజయాత్రలో వస్తుంది. అతను హిమాలయాలలో ఉన్నటువంటి మహర్షి.

ప్రతి పరమాణువును Transfor చేసి 18 పుస్తకాలు వ్రాశాడు. Transcri-Ption of souls అనేవి 18 పుస్తకాలు అంటే ఏమిటి పరకాయ ప్రవేశము అనేది పుస్తకాలలో చదివేది కాదు అది ఈనాడు వుండే ప్రపంచంలో జరుగు

చున్న సత్యం దానికి ఇపుడు నేను చెప్పానే Energy follows thought మీ ఆలోచనా విధానము ఎటువైపు వెళ్ళుతుందో అవే ఫలితాలు వస్తాయి అనే ఇంకొక రహస్యాన్ని చెప్పారు మన ఋషులు

అందుచేత అప్పటినుండి నేను ఆయనను Reguest చేసింది ఏమిటంటే మావాడు Doctor అవుతాడండి. చాల బాగా చదువుచున్నాడండి అని చెప్పటం మొదలు పెట్టండి అన్నాను ఇంకో రెండు నెలలు పట్టింది. Serious గా చదువు చున్నాడు అంటే ఇక్కడ నేను చెప్పదలుచుకున్నది ఆలోచనా విధాన్నానుస రించి మన శక్తి ఆదిశగానే ప్రవహిస్తుందనేది అక్షరాలా సత్యమే. దానికి తగిన వాతావరణం ఇవ్వాలి. అక్బరు బీర్ బల్ కథలు మనం అందరం చదువుకుంటూ వుంటాము కాని అక్బరు బీర్ బల్ కథలలో అనేకమైన ఆధ్యాత్మిక రహస్యాల వైపు మన దృష్టి ఎప్పుడూ వెళ్ళదు ఈ Energy follows thought అన్నదానికి చాల చిన్న కథ యున్నది అక్బరు బీర్ బల్ కథలలో అక్బరు చిన్న పరీక్ష పెట్టాడట.

ఈ రాజులకు ఒక్కొక్కసారి ఎందుకు యిలాంటి బుద్ధులు పుడతాయో మనకు తెలియదు. శీతాకాలంలో, వెన్నెల్లో అక్బరు మనస్సుకు ఏదో తట్టింది. ఎవరయినా రాత్రంతా కంఠం వరకు నీళ్ళలో మునిగి వుంటే వాళ్ళకు 50 వేల రత్నాలుగాని, కొంత ధనము యిస్తాను అని ఎందుకన్నాడో తెలియదు. శీతాకాలం ఒక ముసలివాడు తన కూతురికి పెళ్ళి చేయాలనే వుద్దేశ్యంతో దానికి ఒప్పుకున్నాడు.యమునా నదిలో కంఠం వరకు మునిగి కూర్చున్నాడు శీతాకాలం, NorthIndia కూర్చున్నాడు. సరే రాత్రంతా వున్నాడు. రెండవరోజు దర్బా రుకు వచ్చాడు. దర్బారుకు వచ్చిన తరువాత మహారాజా నేను ఉన్నాను అంటే అపుడు సైనికునిగూడ Correct ఏనా అని అడిగాడు. అవును Correct అండి రాత్రంతా అలాగే వున్నాడు. ఎలా వున్నావయ్యా అన్నాడట ఎలా ఉన్నా వయ్యా అంటే మీ పడగ్గదిలో దీపం వెలుగుతుంది గదా ! దానిని చూస్తూ నేను వున్నాను అని అన్నాడట.

దీపం నుండి వచ్చే వేడితో చలి కాచుకున్నావా! పరీక్షలో నెగ్గలేదన్నాడు అక్బర్. మోసం చేస్తున్నారు మహారాజా ! చక్రవర్తి మీరు అలా చేస్తే యెలా రాత్రంతా చలికి వణికిపోతూ యున్నాను.

అది కాదయ్యా! నీవు దీపాన్ని చూస్తూ వున్నావుకదా ! అక్కడెక్కడో

కోటలో పడగ్గది యమునానది 12 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. మరి కోటలో దీపాన్ని నీవు చూస్తున్నావుగదా! ఆ వేడే నీకు వచ్చినది. అందుచేత నీళ్ళలో ఎక్కడ వున్నావు చలి కాసుకుంటూనే వున్నావు కదా! నీకు అర్హతలేదు అన్నాడట బీర్‌బల్ దగ్గరకు వెళ్ళాడు. ఇలా జరిగింది. నేను ఏమిచేసేది అని.

నువ్వేమి గాభరా పడకు అన్నాడట గాభరా పడకు అని ఆ రోజు సాయంత్రము బీర్‌బల్ అక్బరు షికారు వెళుతూ వుంటే మహారాజా! ఇక్కడ వుండండి. నేను కాస్త కిచిడి వండుకుంటాను. కిచిడి అంటే బియ్యం. పెసరపప్పు వేసి వండేది. సరే నీ యిష్టం.

నీకు సాత్వికాహారమే గదా కావలసింది వండుకో అని అన్నాడట.

సాధారణంగా కిచిడి 15 నిముషములలో ఉడికిపోతుంది, గంటయింది— రెండు గంటలయింది బీర్‌బల్ రాడే ఏమిటంటే ఉడికిపోతుంది ఆగండి అన్నాడట అదేమిటయ్యా! 10 నిముషములు అయ్యింది, 15 నిముషాలు అయ్యింది. గంటయ్యింది, రెండు గంటలయ్యింది, నీ కిచిడి ఉడకలేదా అన్నాడు. ఉడుకుతుందన్నాడు, ఆయన లోపల ఎక్కడో వున్నాడు. ఇతను బయట చెట్టుక్రింద కూర్చున్నాడన్నమాట. విసుగెత్తి అక్బరు లోపలకు వచ్చాడట. వస్తే ఏమిచేశాడంటే చెట్టు చిటారుకొమ్మకి పాత్ర కట్టాడట అందులో నీళ్లుపోశాడు పెసరపప్పు వేశాడు. బియ్యం వేశాడు క్రింద చిన్న చిన్న చితుకులుపెట్టి అంటిస్తున్నాడట. ఉడకడంలేదండి అని అన్నాడట.

పిచ్చివాడా! ఇక్కడెక్కడో మంటపెడితే అక్కడ ఉడుకుతుందా! అని అన్నాడట.

అదేనండి మీరు రాజుకదా! మీకు అన్ని విషయాలు తెలుసు ఎక్కడో మీ పడగ్గదిలో దీపం వెలుగుతూవుంటే అక్కడకి వేడి వచ్చిందని అన్నారే. అలాగే ఇక్కడ వస్తుందేమో అని చేశాను అని అన్నాడట

సరే! ఇది మామూలు కథ కాని కథలోని అంతరార్థాన్ని జాగ్రత్తగా తెలుసుకోండి అంటే Energy follows thought అంటే మీ ఆలోచనల తీవ్రత ఎంతవుంటే అంత శక్తి వస్తుంది తప్ప మీరు చిన్నగా ఆలోచించి పెద్ద ఫలితాలు రావాలంటేరావు. దానినే సంకల్ప బలం అన్నారు మన ఆలోచనలలో, మన కోరికలలో ఎంత సంకల్ప బలం వుందో జాగ్రత్తగా ఆలోచించుకోండి. ఫలితాలు ఎందుకు రావడం లేదో మనకే తెలుస్తాయి ఇది మన ఋషులు అందించిన రెండవ సూత్రం.

ఎటువంటి పని చేస్తుంటే అటువంటి బుద్దే వస్తుంది. అది మొదటి సూత్రము. రెండవ సూత్రము మీ శక్తి, మీ కోరిక, మీ స్తోమత ఎంత తీవ్రవేగంతో ఆ దిశవైపు ప్రయాణం చేస్తుందో అంత పరిమాణంలోనే మీకు ఫలితం వస్తుంది తప్ప అక్కడెక్కడో చెట్టుకి కట్టి ఇక్కడెక్కడో అగ్గిపుల్లలు గీస్తే అన్నం వుడకనట్లు, ఫలితాలు రావు ఏదైనా ఫలించాలంటే, దానికి కావలసినంత పరిమాణంలో ఉష్ణోగ్రత ఇవ్వకపోతే, దానికి కావలసిన పరిమాణంలో ఆలోచనలు ఇవ్వకపోతే లాభం లేదు. Energy follows thought దీని తరువాత మాటకు సూత్రము మూడు సూత్రాలే ఉన్నాయి భారతీయ ఆధ్యాత్మికతలో 4 వ సూత్రము లేదు జాగ్రత్తగా గుర్తుంచుకోండి. అన్నారు. అందుచేత మొత్తం ఆధ్యాత్మికత మీరు తెలుసుకోవాలంటే మీరు శాస్త్రాలు అన్నీ తెలుసుకోనక్కరలేదు నియమ నియమాలు తెలుసుకోండి. ఇవి చాలు. ఇది ఋషులు చెప్పారు. ఒకటి బుద్ధి కర్మానుసారిణి కర్మ సిద్ధాంతం. రెండవది ఇప్పుడు చెప్పారు. ఆలోచనలలో తీవ్రత మీ ఆలోచనలు ఏ దిశలో వుంటే, ఆ దిశగా మీ శక్తి ప్రవహిస్తుంది. మొదటి రోజున మా students ని గత 16 ఏళ్ళుగ ఒక ప్రశ్న అడుగుచున్నాను ఏమయ్యా! ఈ group ఎందుకు తీసుకున్నారు అని సీటు రాక సార్ అని అంటారు. Engineering లో సీటు రాక సార్ అంటాడు. లేక మా నాన్న తీసుకోమన్నాడు అంటాడు. అంతేకాని వాడికి చదవాలని లేదు. మనం Correct గా జీవిత విధానం తెలుసుకోక నేర్చుకోకపోతే మనకు ఆధ్యాత్మికత తెలిసినందువల్ల లాభం లేదు కదా! మొట్ట మొదట ఇంతవరకు ఒక్క Student ఇది నాకు చదవాలని ఉంది మాష్టారు అందుకు చదివాను అని అన లేదు. నేను B.Sc లో I st year Join అయినపుడు అమర్‌నాథ్ అనే స్నేహితుడు ఒకడు ఉండేవాడు అతను కూడా M P C. Science గ్రూపులో Join అయ్యాడు. నాకు I st Year అయిపోయింది. II year అయిపోయింది. final year లోకి వచ్చాను. అతను B Sc. I st year లోనే ఉన్నాడు స్నేహితులం గదా మాట్లాడకుంటూ ఉండే వారం మాటల సందర్భంలో అతను చాలా సార్లు నా దగ్గర బాధపడుతూ చాలాసార్లు చెప్పేవాడు. ఎలా చెప్పేవాడంటే నాకు రామకృష్ణా నాకు Science చదవాలని లేదు. నాకు బొమ్మలు గీయాలని ఉంది అనేవాడు. అతను బాగా బొమ్మలు గీసేవాడు. అతని తండ్రి Doctor. ఇప్పటికి Banaras లో వున్నారు. అతని కోరిక ఏమిటి? నేను Doctor ని కదా నా పిల్లవాడు

కూడా Doctor అవ్వాలి అని. చదువు అంటే అతను చదవటం లేదు B Sc. III year లోకి వచ్చాక నాకు కాస్త ధైర్యం వచ్చింది. వాళ్ళ నాన్న దగ్గరకు వెళ్ళి చెప్పాను ఏమండి మీ అబ్బాయి Artist అవుదామని అనుకుంటున్నాడు. అతనికి Science మీద interest లేదు అతనిని బాధ పెట్టకండి Art లో ప్రవేశ పెట్టండి అని నీవు Science చదువుచున్నావు బాగానే వుంది మా వాడిని Science చదవ వద్దంటావా బాగానే వుంది మా ఇంటికి రావద్దన్నాడు. ఏదేదో అనేశారు. కాని అతని అదృష్టం బాగుందో, కర్మ సిద్ధాంతం ఉపయోగిస్తున్నా అదృష్టం బాగుందంటే ఆ మాట అనగూడదు కాని అలవాటులో పొరపాటు. ఆ మాట అనేశాను నేను. ఆయన తాతగారు కలకత్తా నుండి వచ్చారు. అంటే Doctor గారి నాన్నగారు. ఆయన వింటున్నాడు ఈ సంవాదాన్ని. బయటకు వచ్చి అతనికి కోరిక వున్నది Arts లో Join చేయకూడదా అని అన్నారు సరే తరువాత ఏమి జరిగిందో నాకు తెలియదు Next day Arts లో Join అయ్యాడు. Gold medal తెచ్చుకున్నాడు. ఇక్కడ ఢిల్లీలో అతను 8 వేలు, 9 వేలు Draw చేసే ఉద్యోగంలో వున్నాడు. ఇదంతా ఎందుకు చెప్పానంటే మీ ఆలో చనలు ఏ దిశలో ప్రయాణిస్తున్నాయో ఆ దిశలో Convert చేయగలిగారంటే అద్భుతమైన ఫలితాలు వస్తాయి అన్న సంగతిని మనం పూర్తిగా మర్చిపోయాం. పూర్తిగా అసలు ఏ Parent కూడా ఆ విషయాన్ని ఆచరణలో పెట్టగలరా! ఇది గాయత్రి మంత్రం యొక్క రెండవ అధ్యాయం. నిష్ఠ, శ్రద్ధ, భగవద్గీతలో స్పష్టంగా శ్రీ కృష్ణుడు చెబుతాడు. నీ శ్రద్ధ ఎటువంటిదో నీవు అటువంటివాడవు అని మన శ్రద్ధ ఎటువైపు వుందో ఆ విషయాలు పట్టుకుంటాము తప్ప మిగతా విషయాలు మనము పట్టుకోము. రాక్షసులు, దేవతలు, మనుష్యులు, బ్రహ్మ దగ్గ రకు వెళ్ళి ఉపదేశం ఇవ్వండి మాకు అని అన్నారట. పూర్వ కాలంలో ఉప దేశం అంటే ఇలా గంటలకొద్ది మైకులు పెట్టి speaches ఇవ్వడం కాదు బ్రహ్మ దేవుడు, దేవతలు, రాక్షసులు, మనుష్యులు వెళ్ళారు గనుక నేను ఉపదేశం ఇస్తాను జాగ్రత్తగా వినండి అన్నాడు. "ద" అని తన విశ్వ నిర్మాణ కార్య క్రమములో మునిగిపోయాడు అంటే ఈ దీక్ష ఇవ్వడం, మంత్రోపదేశం చేయ డము తను చెప్పడం అంతా అయిపోయింది. ఆ ఒక్క అక్షరం పల్కడంలో అదేమిటో అశ్వమేధ యజ్ఞం, దేవ సంస్కృతి దిగ్విజయం అన్నారు ఒక్క మాట చెప్పి వదిలేశారే అని మిగతాది ఏమి చెప్పటం లేదే అన్నట్లు ఆ దేవతలు రాక్షసులు, మనుష్యులు ఆలోచించుకున్నారు 'ద' అంటే ఏమిటి? రాక్షసులు ఏమి

అనుకున్నారు అంటే మనం చాలా క్రూరంగా ప్రవర్తిస్తాము మనలో దయలేదు. అందువల్ల ఈ లోపాన్ని పూరించుకోవాలి అని కొందరు, దయలేదు కనుక దానిని సంపాదించుకోవాలని కొందరు, 'దమము' లేదు కనుక ఇంద్రియాలను నిగ్రహించుకోమని వుపదేశించాడని మరొకడు అర్థం చేసుకొని ఆ ప్రకారంగా సాధన చేసారు.

నిన్న 1980 నుంచి 2000 సంవత్సరాల మధ్య కాలము ఈ 20సం॥ల కాలము యొక్క ముఖ్యమును కొంత తెల్సుకున్నాం అనంత కాల ప్రభావంలో ఒక 20 సం.. యొక్క మహిమను యుగాన్ని మార్చేటటువంటి విషయాన్ని కేవలము కొన్ని రోజుల్లో, నెలల్లో వివరించి చెప్పడం చాలా కష్టం అందువల్ల నేను చేస్తున్న ప్రయత్నమంతా ఇదేమిటంటే మీ అభిరుచిని అటువైపు మళ్ళించడం చాలు అందుచేత నిన్న నేను చెప్పిన విషయాలమీద అనేక రకాల వ్యాఖ్యానాలు మీకు దొరుకుతాయి ముఖ్యంగా భగవద్గీత, భారతము, భాగవతము అలాగే పురాణాల్లో బ్రహ్మాండ పురాణం, భవిష్య పురాణం, అగ్ని పురాణం ఇవికాక విదేశీయులు ఎరోల్డ్ షెర్మిన్, కె సి ఎడ్గర్ లాంటి అనేక మహనీయులందించిన పుస్తకాల్లో ఈ 20 సం॥లను చాల వివరంగా వ్రాసారు చెప్పదలచి నేను చాలా వ్రాయదలచుకున్నాను కాని ఇంతకంటె చెప్పలేక పోతున్నాను అంటూ 980 పేజీల పుస్తకాన్ని జ్వాలాకుల్ అనే మహర్షి గీతలో 46॥6 శ్లోకానికి వివరణ వ్రాశాడు **A Treatise on white magic**

గీతలో ఒక శ్లోకానికి వివరణ చేయ యత్నించి 980 పేజీల వివరణ వ్రాసి ఇక నేకు వ్రాయలేకపోతున్నాను అన్నాడు. అంచేత మనం రామాయణ, భగవద్గీత, భాగవతాన్ని చదివేటప్పుడు యుగయుగాల మానవజాతికి మార్గదర్శక సూత్రాలు అందులో ఉన్నాయి అనే దృష్టితో గనక మనం చదవగల్గితే, చదివితే 1980-2000 మధ్యకాలంలో ఇప్పటికి 18 సం॥లు గడిచాయి ఇంక భారతంలోని 12సం॥ల అరణ్యవాసం 1సం॥ అజ్ఞాతవాసం-లేకపోతే నలదమయంతుల చరిత్ర ఇలాగ అవగాహన చేసుకొనేందుకు ప్రయత్నించాలి అనేది నిన్న నేను చెప్పాను ఇంకొకటి ఏం చెప్పాను అంటే "గయాంత్రాయతి ఇతిగాయత్రి" అనే మహావిద్యను నేర్వాలి మనం మన ప్రాణాల్ని అసలు వుపయోగించుకోవడం లేదు అనేది ఎపుడు తెలుస్తుందని గురువుగారు మనల్ని చాలా తమాషాగా చెబుతారు.

నొప్పివస్తేగానీ ఆ ఇంద్రియాలను గురించిగాని మనకు తెలీదు. అంతవరకు

వాటిని వుపయోగించుకుంటాం కాని దాని గురించి ఆలోచించం. తెల్సుకోవడం లేదు. గురువుగారు ఏమంటారంటే ఓసారి మరి తలనొప్పి వచ్చిందంటే దాని అర్థం ఏమిటి? తలనొప్పి వచ్చినపుడు తల వుందని గుర్తు వుంది. ఎప్పుడైతే శరీర ములో ప్రాణశక్తి ప్రవాహం కొన్ని కారణాలవల్ల ఆ ఇంద్రియాలలో సక్రమంగా వెళ్ళదో అప్పుడే మనం ఆ ఇంద్రియాన్ని గుర్తిస్తున్నాము తప్ప లేకపోతే Correctగా వుంటే ఆ ఇంద్రియాన్ని గుర్తించటంలేదు. గాయత్రీ మహా విద్య ఈ సూత్రాన్ని చెబుతున్నది గుర్తుంచుకోండి "ప్రభోదయాత్" ఐతే ఈ శబ్ద కూటమి మాత్రమే గాయత్రికాదు ఇది కూడ గాయత్రియే కాని ఆ విద్య ఏమంటే గాయత్రిని పంచముఖి అని పిలుస్తూంటాం మనం అంటే 5 ఇంద్రియాలలో (కొన్ని జ్ఞాన) 5 రకాల ప్రాణశక్తిని తెల్సుకునే విద్య ఇది ఒక అక్షర సముదాయంలో మాత్రమే వుంది అనే భ్రమ నుండి మనం బైటపడాలి తెలుగులో వున్నట్టి అక్షర సముదాయము తెలుగుకాదు. Englishలో వున్న 26 అక్షరాలు English కాదు. అవి భాషను అభివ్యక్తం చేయడాన్కి వుపయోగపడే పదార్థాలు మాత్రమే. ఆ 26 అక్షరాలను వుపయోగించుకొని మనం అనేక రకాల భావపరంపరను తెల్పుతాము. భావపరంపరనే కాదు. శాస్త్రాలనుకూడ తెల్పుతాం ఇంగ్లీషులో కెమిస్ట్రీ, ఫిజిక్సు నవలలు వ్రాస్తాం. ఆర్ట్సు, కామర్సు-ఇలా రకరకాల భావ ప్రకటన 26 ఇంగ్లీషు అక్షరాలను రకరకాలుగా ఎలా వుపయోగించడం జరుగుతుందో అలాగే గాయత్రిలో గల 24 అక్షరాల కూటమిని తెల్సుకొని మనం రకరకాల శాస్త్రాలను తెలుసుకోవచ్చు. అందుచేత గాయత్రిని—24 అక్షరాల కూటమిని వేదమాత అన్నారు అందుచేత అలాగని అంటే A,B,C,D అది ఇంగ్లీషు కాదు ఈ అక్షరాలను కల్పుకుని ఆ అక్షరాలలో భావం వున్న అక్షర సముదాయాన్ని ఇంగ్లీషు అంటాం అర్థంలేని X,Y,Z అంటే అది ఇంగ్లీషు కాదు పనికిరాని అక్షర సముదాయము. అదే Cat అనో God అనో అక్షర సముదాయాన్ని మనం కూర్చుకొన్నపుడు, అది ఒక భావాన్ని తెల్పుతోంది అందువల్ల ప్రపంచంలో, మన శరీరంలోని ప్రాణాలన్నింటినీ ఎలా వుపయోగించుకోవాలో తెల్పేటటువంటి జ్ఞానాన్ని, వేదాన్ని మనకు అందజేస్తున్నది కాబట్టి ఈ 24 అక్షరాలను గాయత్రి వేదమాత అన్నాం కానీ, వేదమాత అన్నప్పుడు ఈ 24 అక్షరాలను పట్టుకొని ఇదే వేదమాత అంటే మనకు ఇంకా సవ్యమైన అవగాహన రాలేదు. అంచేత గాయత్రిమంత్రాన్ని వినియోగం ఎలా చేయాలి? గాయత్రి మంత్రానికి 8 రకాల Conditions—శాపాలు పెట్టారు. శాపాలు 8 వున్నాయి అన్నారు. అనేక పదాలను

తలక్రిందులుగా అర్థం చేసుకోవటమే మనకు ఎందుకో అలవాటై పోయింది! నిన్న చెప్పాను. ఎన్ని వున్నా "బుద్ధి కర్మాను సారిణి - ప్రారబ్ధం ఇలా వుంది కనుక నేను ఏం చేయలేను. నా కర్మ ఇలా వుంది అనే భ్రమలో వున్నాం. అది కాదు. నేను చెప్పా-మన కర్మను బట్టి బుద్ధిని మార్చుకోవచ్చు. మన బుద్ధిని బట్టి ఎటువంటి ఫలితాన్నైనా మార్చుకోవచ్చు. కనుక మన జీవితంలో ఎటువంటి ఫలితాలను కోరుతామో అటువంటి కర్మను చేసేటటువంటి శక్తి-కర్మ సిద్ధాంతం చెబుతుంది. అదే విధంగాఇంకొకటి చెప్పాను. ఎటువంటిఫలితాలను పొందదలుచుకున్నామో, అటువంటి ఆలోచనలు మన మస్తిష్కంలో లేకుంటే ఆ ఫలితాలు రావు వచ్చినా దాన్ని గుర్తించలేం. సైన్సులో విద్యార్థులకు పాఠాలు చెబుతున్నప్పుడు 3 లక్షణాల మీద సైన్సు ఆధారపడివున్నదని చెబుతాం. ఈ మొత్తం ప్రకృతి 3 లక్షణాలపైనే ఆధారపడి వున్నది గనుక. ఆఖరికి ఇంట్లో వంట కూడ 3 లక్షణాలపైనే ఆధారపడి వున్నది ఈ జ్ఞానాన్ని ఈ వేదమాత అయిన ఈ శక్తి సమూహాన్ని 'త్రిపద' అంటాం 3 పదముల గలది అంటాం. ఒక ప్రయోగంలో ఏదైనా క్రొత్తవిషయాన్ని కనుక్కోవాలంటే రకరకాల ప్రయోగాలు చేస్తాం పాటలు వ్రాయాలంటే అలా కూర్చోని ఇలా వ్రాసేయడు రకరకాల పదాలను వ్రాసి కొట్టేసి అలాగ భావం వచ్చేవరకు Try చేస్తాడు. దీనికి అవసరమైనది. జ్ఞానం కనుక గాయత్రీ మహా విద్యలో మొదటిది 'ప్రజ్ఞ' అని చెప్పుకున్నాం. 2. ప్రయోగం చేసాం ఏం చెప్పుకున్నాం? ఫలితం ఎలా వచ్చిందో చూడాలి. ఫలితం ఒక వంటకం చేసిన తర్వాత రుచి చూపిస్తారు. Correct అయితే మిగతా వంట పూర్తి చేస్తారు. ఉప్పు తక్కువైందో, కారం తక్కువైందో అనే దానికి కావలసిన Correction చేసుకొని మిగతా పూర్తి వంటకు వెళ్తాం. అలాగే 'ప్రజ్ఞ' ఆ తర్వాత Correctగా మనకు కావలసిన 'కూర' లో ఆ రుచి వచ్చినదా లేదా అనేది దాని కనుగుణంగా భౌతిక జగత్తులో కార్యక్రమాలను చేస్తాం కనుక మనం ఆలోచించడం నేర్చుకోవాలి. Energy Follows Thought నేర్వాలి. ఇది గాయత్రి మాత రెండవచరణము. 3వ చరణంగా మనం ఏం చెప్పుకున్నాం అంటే "శ్రద్ధ". శ్రద్ధ లేదు కనుక ఫలితం రాలేదు అనుకుంటారు చాలమంది. కానీ ఈనాడు 'శ్రద్ధ' అనే పదానికి 'మూఢ విశ్వాసము' అనే పదానికి పెద్దగా తేడా తెలీటం లేదు. నల్లపిల్లి కథ అని తరచుగా వింటూ వుంటాం. కానీ నల్లపిల్లి మన అందరి మన

స్కూల్లో గూడ దూరి ఎన్ని రకాల గందరగోళాలను చేస్తున్నదో గుర్తించుకుందాం మనం. ఒకసారి "శ్రద్ధ" అంటే మూఢ విశ్వాసమంటే, నల్లపిల్లి అంటే ఏమిటో తెల్సుకోవడానికి ప్రయత్నిద్దాం. ఒకసారి ఇలాంటి ఒక ఊళ్ళో ఒక కుటుంబము సత్యనారాయణ వ్రతం చేద్దామనుకున్నారు పురోహితుల్ని పిలిచారు. పూర్ణిమనాడు సత్యనారాయణ వ్రతం చేయాలనుకుంటున్నాము. తర్వగా వచ్చేయండి సత్యనారాయణ వ్రతం మీద మనసు పెట్టలేము ఆకలేస్తే అన్నారు కనుక త్వరగా వచ్చేయండి. ఆయన త్వరగా వచ్చేసాడు. Sorry అన్నారు. అడ్డంకి వచ్చిందేమో అనుకున్నాడు. ఈసారి వద్దులే అన్నారు. అలా 2 సార్లు జరిగింది. 3వ సారి కూడ జరిగింది.ఆ పురోహితుడు ఏమండీ మీరు ఎందుకిలా మూడు సార్లు వాయిదా వేసారు అంటే పెద్దవాళ్ళు ఏమి మాట్లాడలేదు. చిన్నపిల్లలు నిజం చెప్పేసారు. వాళ్ళతో Danger. నల్లపిల్లి దొరకలేదు అంచేత ఆ సత్యనారాయణ వ్రతం చేయలేక పోతున్నామని మా అమ్మవాళ్ళు అనుకుంటున్నారని అన్నారు ఎందుకలాగ అన్నాడు పురోహితుడు. అదేం మాట? మీకు తెలీదా? నల్లపిల్లి లేకుండా సత్యనారాయణ వ్రతం ఎలా చేస్తాము అని సందేహము వెలిబుచ్చారు పాపం! పురోహితులు శాస్త్రాలన్నీ తిరగేసారు—నల్లపిల్లికి, సత్యనారాయణ వ్రతానికి సంబంధం ఏమిటో? సాధారణంగా ఏమంటే శాస్త్రాలలో దొరకని విషయాలు పెద్దవాళ్ళ నడిగితే సులభంగా చెప్తారు. పెద్దమామ్మగారిని అడిగారు నా చిన్నతనంలో మా యింట్లో నల్లపిల్లి వుండేది పూజలు, వ్రతాలు చేసే వాళ్ళం అప్పుడు ముట్టుకుంటుందని ఆ నల్లపిల్లిని బైట స్తంభానికి కట్టేవాళ్ళం. దీంతో ఊళ్లోవాళ్ళకు మా యింట్లో వ్రతం అని తెల్సేది ఆ నల్లపిల్లి లేదు కనుక వ్రతం ఇప్పుడు చేయటం లేదు అని కారణం చెప్పింది. నల్లపిల్లి ఉంటేనే సత్యనారాయణ వ్రతం.

ఈనాడు కూడ మన ఆధ్యాత్మికతకు ఇలాంటి దౌర్భాగ్యమే పట్టుకుంది. అసలైన సిసలైన రహస్యాలు, కారణాలు మరిచిపోయి, బాహ్య జగత్తులో ఎక్కడో ఏదో ఆచార వ్యవహారాలను, ఎందుకో పట్టుకొని...ఆ నల్లపిల్లిని కట్టాల్సిందే. కానీ లేని నల్లపిల్లిని కట్టడం ఎందుకు? అలాంటి పరిస్థితులేమన్నా మనం చేస్తున్నామేమో అనే ప్రశ్న మనకు కావాలి ఆలోచనాశక్తి మనకు కావాలి ఎందుకు కావాలి? అంటే నేటి పరిస్థితులకు కేవలము ఐదు సంవత్సరాల క్రితం పరిస్థితులకు మనం జాగ్రత్తగా ఆలోచిస్తే మన సమాజం బాధపడ తున్నదానికి అర్థం అవుతుంది. మన మందరం Continuous గా చెప్పేది ఈనాటి తరం పాడైపోయింది పెద్దల

మాటలు వినటం లేదు అని రకరకాలుగా చెప్తాం. కాని ఒక్కసారి ఆలోచిస్తే ఈ విధమైన పరిస్థితి ఎందుకు ఏర్పడింది? అని ఒక్కసారి మనం ఆలోచిస్తే కొన్ని విచిత్ర సత్యాలు తెలుస్తాయి

మనం ఆలోచించి కొన్ని సంవత్సరాలు అయింది. 1586 సం॥లో భారతీయులు ఆలోచించడం మానేసారు. ఆఖరికి ఏ గాయత్రి ప్రాణశక్తి గురించి మాట్లాడుతున్నామో, ఆ మంత్రం వచ్చే సరికి, ముక్కు పట్టుకోండి. అంటే పట్టుకోవడమే కాని ముక్కు ఎందుకు పట్టుకుంటున్నాము అనేది ఎవరికీ తెలీదు. ఆ ప్రాణాయామ విధానం తెలీదు. ఈ పరిస్థితి ఎందుకు వచ్చింది అంటే, కర్మకాండకు ప్రాముఖ్యత నిచ్చేసి, దానితోపాటు వుండవలసిన బంధాన్ని, అనుబంధాన్ని మనం పరిశీలించకుండా ఉండడం వలన వచ్చిందే కనుక ఈ విధమైన జ్ఞానాన్ని ఉపయోగించుకొంటే తప్ప భారతీయ ఆధ్యాత్మికతయొక్క మొదటి step పడదు. కనుక దీనిని వేదమాత అన్నాము. గాయత్రీ మంత్రంలోని ఈ 24 అక్షరాలను జాగ్రత్తగా వినియోగించుకోవడం తెల్సుకుంటే...ఇదంతా ఎందుకు చెప్పానంటే నేను, గాయత్రీ మంత్రానికి 3 శాపాలు ఉన్నాయి అని చెప్పాను. శాపాలు అనే పదం వింటేనే భయం వేస్తుంది.శాపగ్రస్తులు అవటం ఎవరికీ ఇష్టం వుండదు కానీ శాపగ్రస్తత అంటే మానవ జీవితము యొక్క అసలు సిసలైన రహస్యం, నేను College లో Chemistry చెప్తున్నపుడు గాయత్రి పరివార్ విధానంలో శాపగ్రస్తుణ్ణి. గాయత్రి మంత్రము గురించి చెపితే కుర్రాళ్ళు, గాయత్రి గురించి అద్భుతంగా చెప్తాను అంటే, ఒకసారి విని Principal ఊరుకొన్నా, 2వ సారి, 3వ సారి ఇంక ఊరుకోను అంటే మన జీవిత విధానంలో ఒక పని చేస్తూ ఉంటే అది రెండవ పనికి అడ్డు తగుల్తూ వుంటుంది. శాపం తగుల్తూంది. అంటే Limitation వస్తుంది అని అర్థం చేసుకోవచ్చు. గాయత్రీ మంత్రానికి కూడా limitations ఉన్నాయి. మీరు ఇష్టం వచ్చిన చోట ఇష్టం వచ్చినపుడు గాయత్రీ మంత్రాన్ని ఉపయోగించుకోలేరు ఇక్కడ Tape Recorder వుంది. Plug కు connection ఇచ్చేసాము. Fan కి కూడా Connection ఇవ్వాలి అంటే ఇంకో 3way pin పెట్టుకోవాలి లేకుంటే ఈ Plug తీసేసి Fan పెట్టుకోవాలి. ఈ విధంగా గాయత్రి మంత్రశక్తిని మీరు మీ జీవితంలో ఉపయోగించుకోవాలంటే 3 రకాలైన limatations ఉన్నాయి.

ఈ మూడురకాల విధానాలను ఉపయోగించకుండ మీరు గాయత్రీ మంత్ర

శక్తిని ఉపయోగించదల్చు కుంటే, అది మీకు వుపయోగపడదు  దాన్ని మూడు రకాల శాపాలుగా భావించారు. విశ్వామిత్ర శాపం  అంటాం  వశిష్ఠుని శాపం అంటాం, బ్రహ్మ శాపం అంటాం. అంటే బ్రహ్మ, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు– గాయత్రీ  మంత్రాన్నుపయోగించవద్దు  అనలేదు వాళ్ళు  వాళ్ళు వాళ్ళ–వాళ్ళ గాయత్రీ మంత్ర అనుభవాల్ని జోడించుకొని, ఈ విధమైనటువంటి అడ్డంకులు వుంటే, మీకు గాయత్రీ మంత్రము పలుకదు  Correct చేసుకో అని చెప్పారు. 1960 సం॥లో నేను P hd కి enrole అయ్యాను  B. H Universityలో మా Guide complicated electric circuit ఇచ్చారు. దాని ప్రకారం నేను అన్నీ చేస్తూ ఆ components అన్నీ కలుపుకుంటూ వచ్చా. ఆయన ఇచ్చిన కాగితం పద్ధతి ప్రకారం  మొత్తం circuitలో  పెట్టడానికి నాకు 3, 4–నెలలు  పట్టింది. Switch on చేస్తే పనిచేయలేదు  circuit అంతా జాగ్రత్తగా కలిపానా  లేదా? అని చూశాను. అక్కడ circuit తప్పు అనకూడదు  పనిచేయలేదు  కారణం ఏంటి?అలాగే గాయత్రీ మంత్రము తప్పుకాదు అది Time Tested కనుక దానిలో ఏ దోషము లేదు  కనుక Current రాక Machine పని చేయకపోతే లోపం Machineలో వెతకాలి  ఆ యంత్రంలో లోపం వెతికడం మొదలుపెట్టాలి నా Estimation ప్రకారం B. H U. మొత్తం  ఈ అమలాపురం కంటే కొంచెం పెద్దగా వుంటుంది Electricity department  electronic  department పనిచేయడానికి  B.H.U వాళ్ళు 60 లక్షలు ఖర్చుపెట్టి  earth wire వేసారు దాంట్లో లోపం ఉందేమో అని V.Chanceller కి చెప్పి నానా అవస్థలు పడ్డాం. 5, 6 నెలలు గడిచాయి  మీరు పేరు వినే వుంటారు V. C  పేరు.  ఆయనను జర్మనీ వాళ్ళు కూడ పిలిపించుకుంటూ వుంటారు ఆయన B H U  Engineering Head of  the department, ఆయన పేరు గోపాల్ త్రిపాఠీ  ఒక భవనం మొత్తాన్ని craneతో లేపి ఇంకొక చోటకి మార్చగల్గిన ఇంజనీరింగు కౌశలం కల వాడు. ఆయనకు చెప్పాను నేను. ఎందుకోనండి ఈ diagram పనిచేయటం లేదు అని. మనుషులను పంపి wire correct చేయించాము.  11 నెలలు గడిచాయి. ఈ లోగా మా departmentలో attenderవున్నాడు.అతడు ఒకమాట చెప్పనా? అన్నాడు.

కాని అతను మొదటే ఏదో నాకు చెప్పబోయాడు. నేను మా Supervisor  గోపాల్ త్రిపాఠీ వంటి  ఇంజనీరు చెపుతున్నపుడు ఇతను చెప్తే  ఎందుకు

వింటాను? వినలేదు. మాస్టారు! నాకు చాలామంది research scholars తో అనుభవం. ఎక్కడైన loose connection ఉందేమో చూడండి, ఎక్కడైనా nut loose ఏమో చూడండి అన్నాడు నేను సరిచేసుకోవచ్చుకదా? చెయ్యను చేయక Supervisor కు చెప్పాను ఆ! వాడి మొహం వాడికేం తెలుసు! నేను అన్నీ check చేసాను అన్నాను తర్వాత ఇంటికి వెళ్ళి ఎందుకన్నా మంచిదేమో అని అన్ని నట్లు సరిచేసుకుంటూ వచ్చాను Switch వేయగానే circuit on అయ్యింది. ఇంత గొప్ప త్రిపాఠీ మా Supervisor, M.Sc , అయిన నేను చెయ్యలేనిది ఒక చిన్న సలహా—ఏమిటంటే—ఇంత పెద్ద ఆధ్యాత్మికత గురించి మాట్లాడుతున్నారో, శాస్త్రిలు అంటూ ఇంత పెద్ద Lecturer కొడుతున్నారో, కాని ఎక్కడైన ఆచరణలో చిన్న లోపం ఉందేమో అని, మన ఆలోచనా విధానంలో తప్పు వుందేమో ఒకసారి వెనుక తిరిగి చూసుకుందాం—అనే ఆలోచనను బ్రహ్మశాపం అంటాం. బ్రహ్మ—creativity అంటే సృజనాత్మక శక్తి కనుక ఒక్కసారి ఆ గాయత్రిని ఉపయోగిస్తున్నపుడు ఏమనుగుతున్నాము? ఆ ఆలోచనా విధానంలో ఏమన్నా లోపం వుందేమో చూసుకోండి అలా కాకపోతే మీకు గాయత్రీ మంత్రం ఉపయోగించదు అంటాడు. ఎందుకంటే ఎండాకాలంలో ఒకసారి గుంటూరు నుండి విజయవాడకు ప్రయాణించాల్సి వచ్చింది రెండు ఎండల గురించి మీకు తెల్సే వుంటుంది చాలా కార్టూన్స్ దీనిమీద వున్నాయి. నాకు నచ్చినదేమిటంటే—ఒక వ్యక్తి కాళ్ళు, చేతులు కట్టి వున్నాయి నూనె కాగుతోంది యమధర్మరాజు ముందు ఉన్నాడు. వాడికి శిక్ష ఈ మరిగే నూనెలో వేయండి అన్నాడు వాడు నవ్వుతూ విజయవాడ ఎండలనే నేను తట్టుకున్నాను, ఇది ఒక లెఖ్ఖా అన్నాడు. అందువల్ల అటువంటి విజయవాడ ఎండాకాలంలో గుంటూరు To విజయవాడ ప్రయాణము చేస్తున్నాడొకడు. ఒక చెట్టుక్రింద సేద తీర్చుకుంటున్నాడు. దాహం వేసింది. నీళ్ళుంటే బాగుండును అనుకుంటే నీళ్ళు వచ్చాయి. ఆకలి. సరే ఆకలి తీరింది. నిద్ర వస్తోంది మంచం అంటే బాగుండును అనుకున్నాడు మంచం వచ్చింది పడుకున్న తర్వాత ఆలోచన వచ్చింది

అమ్మో! దయ్యమేమో ఇది! అనుకున్నాడు. మింగేసింది. అది కల్పవృక్షమనే విషయం వాడికి తెలీదు. అన్ని విషయాల్లోను మనం జాగ్రత్తలు తీసుకొంటాం. పిల్లలు Electric వస్తువులని ముట్టుకుంటే పరుగులు తీస్తాం మనం. సవ్యంగా ఆలోచించడం నేర్పటంలేదు. నేర్చుకోవడం లేదు. కనుక మనం

ఆలోచించలేదు కాబట్టి మనకు ఆ కల్పవృక్షమైన గాయత్రీ శక్తిని వుపయోగించుకోవాలి అందే మొదట సవ్యంగా ఆలోచించటం నేర్చుకోవాలి. సవ్యమైన ఆలోచనలు చేయకపోతే ఆ గాయత్రీ శక్తి పనిచెయ్యదు అంతకంటే ఏమీ కొంప లంటుకుపోవు అందువల్ల మూల పడేస్తాం. ఇది బ్రహ్మ శాపం మీరు చేస్తున్న పనులలో కొత్తదనం వుందా? Creativity కొత్త విషయాలను ఆలోచిస్తున్నారా? అలా కాకపోతే గాయత్రీ మంత్రం అనవసరం. ఏదైన చేసుకోండి మీరు.గాయత్రికి పనికిరారు ఇదే బ్రహ్మశాపం. ఇక రెండవది విశ్వామిత్ర శాపం. నా కోసం మాత్రమే దీనినుపయోగించు కొంటాను అంటే లాభం లేదక్కడ. అగరత్తు వెలిగించిన తర్వాత ఆ సుగంధం అంతటా వ్యాపిస్తుంది కదా!

ఇక యజ్ఞముగురించి తెల్సుకుందాం.ఋక్కుగ్గర్లు మొదలైన వారు ఎంతమందినైన ఎదిరించైనా సరే వాళ్ళ వస్తువుని అక్కడ చేరుస్తారు.పరస్పరం అంతసహకారం వుంటుంది అక్కడ. అది కేవలం ఆ సహకారాన్ని మంచివైపు మళ్ళించగల్గితేచాలు అంతకంటే కావల్సిందేమిటి? అంటే ఏమిటి? మంచి పనికి మీరు చేసే సహాయం కూడా యజ్ఞమే. ఈ యజ్ఞాన్ని మీరు అర్థం చేసుకున్న తర్వాత, యజ్ఞంలో ఇంకో Condition వుంది అది రాజసూయ యజ్ఞము. అశ్వమేధం యొక్క యజ్ఞ పరాకాష్ట భారతంలో చెప్పబడింది. ఈ కథ మనందరికీ తెల్సినా దీనిని మనం సరిగా అవగాహన చేసుకొని వుండము. జాగ్రత్తగా వినండి.అశ్వమేధ యజ్ఞం జరిగింది. ఈ యజ్ఞానికి శ్రీకృష్ణుడు సారథ్యం వహించాడు. ఎందుకు అశ్వమేధం చేసాడు ధర్మరాజు? "నేను బంధు బాంధవులందరినీ చంపేసాను. ఎంతమంచి కోసం చేసినా నా వాళ్ళను నేను చంపాను. ఆ పాపం ఎక్కడికి పోతుంది? దాని నివారణ నాకు ఎలాగ? అని వ్యథ చెందుతుంటే అశ్వమేధం చెయ్యండి అన్నారు. దానికి శ్రీకృష్ణుని ఎన్నుకున్నారు.మీ Guidence లో మేము అశ్వమేధం చేస్తాము అన్నారు. యజ్ఞము సరిగా పూర్తి అయినది లేనిది తెలిసేదెలాగ?అంటే పాంచజన్యాన్ని తెచ్చి యజ్ఞవాటిక మధ్యలో కట్టేశాడు శ్రీకృష్ణుడు. నన్ను మీరడగక్కర్లేదు. ఋషులని అడగక్కర్లేదు. ఎవ్వరినీ అడగనక్కరలేదు– బాగా జరిగిందా, బాగా జరిగిందా అని ఈ శంఖం తనంతట తాను ఎప్పుడు శబ్దం చేస్తుందో అపుడు మీరు Correct గా యజ్ఞం చేసినట్టు, ఫలితం పొందారు అని తెల్సుకోండి అని చెప్పారు యజ్ఞం మొదలైంది.అందరి దృష్టి శంఖం మీదనే, యజ్ఞంమీద లేదు. అందరూ పాంచజన్యంవైపే దృష్టిని వుంచారు. యజ్ఞం అయి

పోయింది. దక్షిణ లిచ్చేసారు. అవభృత స్నానం అయిపోయింది శంఖం మ్రోగ టము లేదు. చివరికి శ్రీకృష్ణుని దగ్గరికి వచ్చారు ఆయన నవ్వాడు ఏం? ఎందుకు వచ్చారు? అని అడిగాడు. శంఖం మ్రోగలేదు అని చెప్పారు సరే ఇక్కడ ఏమేం తప్పు చేశారో list out చేయండి అన్నాడు శ్రీకృష్ణుడు.

అశ్వమేధ యజ్ఞంలో ఒక condition ఉంది. ఏ దేశంలో అయితే అశ్వ మేధ యజ్ఞం జరుగుతుందో ఆ దేశం లోని ప్రతి వ్యక్తికి అశ్వమేధ యజ్ఞంలో పాల్గొనాలనే ఆహ్వానం personalగా ఇవ్వాలి అంతేకాని ఈనాడులో last page లో "మేము చాల బాధ పడుతున్నాం మిమ్మల్నందరినీ ఆహ్వానించలేకపోయాము. అందుచేత ఇదే మా ఆహ్వానంగా భావించి మీరందరూ తరలిరండి" అనే పలు రకాల advertisements చూస్తాము. అలా ఒప్పుకోరు అశ్వమేధ యజ్ఞంలో. ప్రతి వ్యక్తికి personal ఆహ్వానం వెళ్ళాలి అశ్వమేధ యజ్ఞం చేయదల్చుకున్న వారు లేక సమూహము ప్రతివ్యక్తి దగ్గరికి వెళ్ళి మేము అశ్వమేధ యజ్ఞం చేయ దల్చుకున్నాము దీంట్లో మీ సహకారము కావాలి, అంటే మీరు యజ్ఞంలో పాలు పంచుకున్నట్లే ఇందాక చెప్పాను కదా! సహకరించుకొనుట అంటే యజ్ఞమే. ఈ దేవ ప్రవృత్తుల వికాసము కొరకు మీరుకూడ సహకరించండి అని అడగకపోతే ఆ యజ్ఞము ఫలించదు. అంటే ఏమిటి? ఎక్కడో మారుమూల అడవిలో కల ఒక నిషాదుడికి ఆహ్వానం అందలేదు. పంచపాండవులు, ద్రౌపది వెళ్ళి అతనితో చెప్పి ఈవిధంగా యజ్ఞం చేశాము, మిమ్మల్ని పిలవలేకపోయాము, మీరు ఏమైనా సహ కారము ఇవ్వండి అని అతనికి ఆహ్వానం ఇచ్చారు. ఆవిధంగా అతనికి ఆహ్వానం అందగానే పాంచజన్యం ఇక్కడ మ్రోగింది యజ్ఞంలో కొన్ని లక్షలు ఖర్చు అవుతాయి కదా! యజ్ఞం అయిపోయిన తర్వాత అయినా డబ్బు ఇవ్వచ్చు కదా! ఈ కథ మహాభారతంలో వస్తుంది. ఎవరికి వారే యమునా తీరే అని ఎవరికివారే యజ్ఞము చేసుకుంటాము, మా ఆధ్యాత్మిక సమాజము వేరు, మా గురువులు వేరు, వాళ్ళవేరు, వీళ్ళవేరు... ఈ దేవతా సమూహాల మధ్యనే అవగాహన లేకపోతే, వీరి మధ్యనే పరస్పర సహకారం లేకపోతే ఇక అశ్వమేధం ఏంచేస్తాం? అసలు అక్కడ యజ్ఞమే లేదు. ఇక యజ్ఞమేం చేస్తాము? పరస్పర అవగాహన లేదు. అందుచేత ఈ పరస్పర అవగాహన అనేది యజ్ఞానికి చాల ప్రముఖమైన సూత్రం. కనుక ఈ అశ్వమేధ యజ్ఞానికి ప్రణాళిక ఎప్పుడైతే వేయబడిందో సంపూర్ణ విశ్వానికి ఈ ఆహ్వానం వెళుతున్నది మీరు గుర్తుంచుకోండి ఇది

అమలాపురం సభికులకే కాదు, ప్రపంచంలోని అన్ని దేశాలకి ఇది వెళ్ళి... యజ్ఞమంటే ఇది - దేవ ప్రవృత్తులు, ఉపాసన, అంటే ఇది, సుగుణాలను ఇలా పెంచుకోవాలి, దీనికి అందరూ సహకరించండి అనేటటువంటి ఆహ్వానం ఇవ్వడమే ఈ సమావేశాల పాత్ర అని గుర్తుంచుకుంటూ, ఈ యజ్ఞము అంటే సహకరించు కోండి పరస్పరం. ఈ సహకరించుకోవడం ఎక్కడ? యజ్ఞం చేయడమంటే రాజసూయ యజ్ఞము - శ్రీకృష్ణుడి లాంటి అవతారమూర్తి, వ్యాసుడు లాంటి వేద రచయిత, వశిష్టుడు, విశ్వామిత్రుడు లాంటి ఋషులు అందరూ కలసి ఉంటేనే యజ్ఞం జరుగుతుందేమో అనే అనుమానం కనుక మీకు వస్తే, వస్తుందేమో అని మహాభారతంలోనే ఇంకొక కథ ఉంది అలాంటి అనుమానం మీకు వద్దు దేవతలు మీకు అక్కర్లేదు ఋషులు అక్కరలేదు. శాస్త్ర ప్రమాణము అంత కంటే అక్కర్లేదు. త్యాగము ఒక్కటి ఉంటే renunciation కనుక మీరు సత్యంగా చేయగల్గితే అదే బ్రహ్మాండమైనటువంటి యజ్ఞము అని చెప్పటానికి...

యజ్ఞము పరిసమాప్తమైనది పాంచజన్యం గురించి ఇంక పట్టించుకోలేదు. నిషాదుడి గురించి ఇంక వెళ్ళలేదు భోజనాలు పూర్తయ్యాయి వంటిల్లు కడిగే శారు. అర్ధరాత్రయ్యింది కృష్ణుడు యుధిష్ఠిరుడి దగ్గరికి వెళ్ళి ఇలా రా అన్నాడు. కృష్ణుడితో ఒక పెద్ద తలనొప్పి ఎప్పుడు ఏంచేస్తాడో ఎందుకు చేస్తాడో తెలీదు. రాజసూయ యజ్ఞము అంతా చేయించిన తర్వాత ఈ సంఘటన జరగకుండా ఉంటే ఏమయ్యేదో నాకూ తెలీదు కృష్ణుడు అలసిపోయాడేమో అనీ, పిలిచాడు కదా అనీ బైటకు వచ్చాడు యుధిష్ఠిరుడు గబ గబా భోజనశాల దగ్గరికి తీసు కొచ్చాడతనని శ్రీకృష్ణుడు శ్రీకృష్ణునికి గల అనేక అలవాట్లలో గొప్పదైన, చిత్ర మైనది - ఆహారము లేకపోతే ఆహారం పెట్టమంటాడు ద్రౌపది కథ గుర్తుందికదా! దుర్వాసుడు వస్తే "అన్నా! రక్షించు" అంటూ పిలిస్తే, ద్వారకనుంచల్లా వచ్చి అన్నం పెట్టమన్నాడు నా సమస్య అదే కదా! నేను భోజనం ఎలా పెట్టాలో తెలిక బాధపడ్తుంటే, నీవు భోజనం పెట్టమంటావేంటి? ఆ కథ గుర్తుకొచ్చింది మరి. కృష్ణునికి ఆకలేసిందోకాబోలు రాజుకదా! యుధిష్ఠిరుడు, రాజు చెప్తేకాని ఎవ్వరూ భోజనం పెట్టరు అంచేత నన్ను పిలుచుకొని వచ్చాడేమో అనుకున్నాడు యుధి ష్ఠిరుడు. ఖాళీగా neat గా అద్దంలా అన్నీ కడిగేశారు వంటపాత్రలు మొ॥ అన్నీ. ఏమిటి అన్నాడు యుధిష్ఠిరుడు. చూడు అన్నాడు కృష్ణుడు. చూస్తే కొంతసేపటికి ముంగిస వచ్చి నేలమీద పొర్లుతోందిట ఒకవైపు తళుక్కుమని మెరుస్తోందిట.

కొంచెం జాగ్రత్తగా చూస్తే ఆ ముంగిస కొకవైపు బంగారంలా ఉందిట. ఒక వైపు మామూలుగా ఉందిట. ఇదేంటి కృష్ణా? అంటే నాకు తెలీదు పద ఆ ముంగిసనే అడుగుదాం అన్నాడు. పిల్చుకు వచ్చింది శ్రీకృష్ణుడు. ముంగిస వస్తోందని తెలిసి పిల్చుకు వచ్చిన కృష్ణుడు, నాకు తెలీదు అన్నాడు సరే ఆ ముంగిసనే అడుగుదాం అని దాని వద్దకు వెళ్ళి అడిగారు. స్వయంగా శ్రీకృష్ణుని ఆధ్వర్యంలో జరిగింది యజ్ఞం సప్తఋషులు ఋత్విక్కులుగా పనిచేసారు. వేదాలను క్రోడీకరించి, శాస్త్రబద్ధంగా 4 వేదాలుగా చేసిన వ్యాసుడు స్వయంగా తన శిష్యబృందంతో ఉండగా చేసినది ఈ రాజసూయ యజ్ఞం – కనుక ఈ యజ్ఞ ఫలితం వల్ల నా మిగతా సగభాగం బంగారం ఐపోతుందేమో అన్న ఆశతో వచ్చాను, అందిట ఆ ముంగిస అయిందా? అన్నాడు ధర్మరాజంతటివాడు కూడ. ఈ కథ చదువుతుంటే నాకొక విషయం గుర్తుకొస్తోంది. సినిమా హాలులో ఇద్దరు స్నేహితులు కల్సుకొని సినిమాకొచ్చావా అని అడుగుతాడు Intervel లో, అలాగుంది. ఈవేళ వాతావరణం ఎలా ఉంది? అని అడుగుతాడు. సంభాషణ మొదలవుతుంది. ఆ ఇద్దరికీ తెల్సు వాతావరణం ఎలా ఉందో. అలాగే ఆ ముంగిసను చూస్తున్నాడు యుధిష్ఠిరుడు. సగం భాగం బంగారంగా ఉంది, సగభాగం మామూలుగా ఉంది. అయినా అడిగాడు ఎందుకు? లోలోపలే అతనికి తెల్సింది అశ్వమేధం Fail అయ్యిందని సగభాగం బంగారం కాలేదు, కాని ఏమో కాస్త ఆశ ఏమో కొంచెం అయినా అయిందేమో! కాని అది ముంగిస కదా! స్పష్టంగా చెప్పింది. ఏమీ అవలేదయ్యా అని. నీ యజ్ఞం కూడా ఎందుకూ పనికి రాలేదు. అంటే కృష్ణుడన్నాడుట జరిగిందేదో జరిగిపోయింది, బాధపడకు. తప్పు ఎక్కడ జరిగిందో తెల్సుకుందాం. మనం ఈసారి అశ్వమేధం చేసుకున్నప్పుడైన correct గా చేసుకుందాము అని అడగమన్నాడుట ఎక్కడ తప్పో. అడిగాడు ధర్మరాజు. "నీవు రాజ్యానికి రాకముందు అంటే రాజయ్యే ముందు 12సం॥లు వనవాసం చేశారు. ఒక ఏడాది అజ్ఞాతవాసం చేశారు. ఈ 12 సం॥ల సమయంలో కురుక్షేత్రంలో వర్షం కురవలేదు. భీష్ముణ్ణి దుర్యోధనుడడుగుతాడు. పాండవు లెక్కడ ఉన్నారని? నీవు కనుక్కోనక్కరలేదు. ఎక్కడ వర్షాలు సకాలంలో కురుస్తాయో, ఎక్కడ పంటలన్నీసకాలంలో సవ్యంగా పండుతాయో ఆ దేశాన్ని పట్టుకో. అక్కడ పాండవులు ఉంటారు. అంటే అకాలం ఎక్కడ ఉంటే అక్కడ పాండవులు లేనట్లేకదా! అంటే

కురుక్షేత్రం దరిదాపుల్లో పాండవులు లేనట్టే కదా అలాంటి పరిస్థితులలో అక్కడ చాల రోజులుగా ఆహారం లేక అలమటిస్తున్న ఒక కుటుంబంలో నల్గురున్నారు. భార్య భర్త, కొడుకు, కోడలు 4, 5 రోజులుగా ఆహారం లేదు. ఆ నల్గురికి సరిపడ 4 రొట్టెలు తెచ్చాడట ఆయజమాని ఎక్కడనుంచో సంపాదించి. తలుపుపై చప్పుడైంది వీరు తినబోతుంటే. తీసాడు. ఓ ఋషి కనిపించాడు. ఆహారం కావాలి నాయనా. ఆపద్ధర్మం నాయనా మీ ప్రాణాలు మీరు రక్షించుకోడానికి ఆహారం కావాలి. ఈ వాక్యాలు, ధర్మాలు Important కాదని శాస్త్రాలు చెపుతున్నాయి. కనుక వెళ్ళను అన్నాడు. అయితే Seniority అన్నాడా ఋషి మీరు 4, 5 రోజులుగా ఆకలితో ఉంటే నేను 7 రోజులుగా ఆకలితో ఉన్నాను అన్నాడు Seniority prove అయ్యింది కదా ప్రమోషన్ ఇవ్వాలి అంటే seniority ముఖ్యం. మీకు వచ్చిన నాల్గు రొట్టెలలో ఒకటి నాకు ఇచ్చెయ్యమంటే యజమాని రొట్టె ఇచ్చేశాడు. కడుపు నిండలేదు. భార్య ఇచ్చింది. కొడుకు, కోడలు ఇచ్చేశారు. రొట్టెలన్నీ అయిపోయాయి. తర్వాత సర్లెండి నేను సరిపెట్టుకుంటాను, వెళ్తాను అన్నాడా ఋషి. ఇది అంతా ముంగిస చెపుతోంది యుధిష్ఠిరుడికి ఈమొత్తాన్ని పైనుంచి చూస్తోంది. ఈ కరువు కాటకం వలన నాకు ఆహారం లేదు. ఆ ఋషి తిన్నపుడు కొన్ని రొట్టె తుంపులు కింద పడ్డాయి ఆకలి బాధ తీవ్రతను తట్టుకోలేక నేను గబుక్కున దూకాను ఆ దూకడంలో కాలుజారి ఆ రొట్టె తుంపులు మీద పడ్డాను అది నా శరీరానికి అంటుకున్నది ఆ అంటుకున్న భాగం బంగారంగా మారింది త్యాగం అంటే అది అన్నది అప్పటి నుంచి బ్రహ్మాండమైన యజ్ఞాలు ఎక్కడెక్కడ జరుగుతుంటే అక్కడికల్లా వెళుతున్నాను కాని ఆ యజ్ఞానికి సమానమైన యజ్ఞం రాలేదు అని చెప్పింది, ఆ ముంగిస.

ఈ కథ మహాభారతంలోనే ఉంది కనుక అశ్వమేధ యజ్ఞం చాల గొప్పదై ఉండవచ్చుగాక. అశ్వమేధ యజ్ఞం భారతీయ ఋషి సంప్రదాయంలో యజ్ఞం యొక్క పరాకాష్ఠ అయినప్పటికీ కూడ – యజ్ఞమంటే మూడో అర్థం చెపుతున్నా కదా నేను. మొదటిది సగుణోపాసన సద్గుణాలను పెంచుకోవటం ఒక యజ్ఞమైతే, పరస్పరం సహకరించుకోవడం ఒక యజ్ఞం అయితే అద్భుతమైన మూడో యజ్ఞం త్యాగము నీకు అవసరమైతే కూడా నీ అవసరాన్ని కూడ పక్కకుపెట్టి ఇతరుల అవసరాన్ని తీర్చడమనే యజ్ఞమునకు సమానమైన యజ్ఞం అశ్వమేధం కూడ కాదు అంటోంది మహాభారతము. మనం అటువంటి త్యాగశీలమైన సంస్కృతికి

వారసులం. ధధీచి కథ మనం చెప్పుకుంటూ ఉంటాము. దేవతలు వృత్రాసురుణ్ణి చంపలేనపుడు ఇంద్రుడు ధధీచి నడుగుతాడు– నీ వెన్నెముక ఇచ్చేయి. నీవిస్తే నేను దానిని వజ్రాయుధంగా మార్చుకుంటాను అన్నాడు సరే తీసుకో అన్నాడు ధధీచి ఎప్పుడెప్పుడు దేవతలకు కష్టాలు వచ్చాయో అప్పుడప్పుడు మనుష్యులు వెళ్ళి దేవతలకి సహాయం చేసారు తప్ప మొత్తం వేదవాఙ్మయం తిరగేసి చూడండి. మనిషికి అవసరం వచ్చినపుడు మనుష్యుల యుద్ధాలలో దేవతలు పాలుపంచుకో లేదు. దానిని బట్టి మీరు నిర్ణయించుకోండి మనిషిగొప్ప, దేవతలు గొప్ప అనే విష యాన్ని. దేవాసుర సంగ్రామం అనేది భారతీయ సాంప్రదాయంలో ఒక అద్భుత మైన మలుపు ఆ దేవాసుర సంగ్రామంలో దేవతలకు మనుష్యులు సహాయం చేసారు తప్ప. దేవతలు మనుష్యులకు సహాయం చేయలేదు ఆ అవసరం రాదు. అటువంటి మనిషి ఈనాడు ఈ విధమైన పరిస్థితులలో వున్నాడు. అంటే త్యాగం అనేది మర్చిపోయాడు. త్యాగం చేయడం మర్చిపోయాడు త్యాగం చేస్తే ఎంతో పుణ్యం వస్తుందని చెపితే త్యాగం చేస్తాడు తప్ప, త్యాగం కోసం త్యాగం చేయడు. కాస్త జాగ్రత్తగా దీనిలోని అర్థాన్ని గ్రహించండి. ఈ త్యాగశీల ప్రవృత్తి యజ్ఞం అనిపించుకుంటుంది తప్ప మీరు ఎన్ని రత్నాలు వేసారు, ఎన్ని ఆభరణాలు వేసారు అన్నది యజ్ఞం కాదు. అంచేత ఈ మూడు గుణాలు పరాకాష్ఠ ఎక్కడ చెందుతాయో దానిని అశ్వమేధ యజ్ఞము అంటారు తప్ప, ఓ అశ్వాన్ని తెచ్చి దాన్ని కోసేస్తే అది అశ్వమేధ యజ్ఞం అవదు యజ్ఞ పరాకాష్ఠ అశ్వమేధం అంటే—సద్గుణాల ప్రవృత్తిని మనలో పూర్తిగా పెంచుకోగల్గితే, పరస్పర సహ కారాన్ని మనలో పూర్తిగా పెంచుకోగల్గితే, మనలో గల త్యాగమయ ప్రవృత్తిని పూర్తిగా పెంచుకోగల్గితే దానిని యజ్ఞం అంటారు. "సహయజ్ఞా ప్రజా సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః" సృష్టితోపాటు ఈ మూడు లక్షణాలను నేను సృష్టించాను. ఈ మూడు లక్షణాలను మీలో పెంపొందించుకోకుండ యజ్ఞము అనే పేరుతో ఎందుకు కర్మకాండ మాత్రమే చేసుకుని యజ్ఞం చేసుకున్నాము అనే భ్రాంతిలో మీరు జీవిస్తారు? అని వాపోతారు—దేవతలు, ఋషులు కూడ. శ్రీరామకృష్ణ పరమహంస జీవితంలో అనేక విచిత్రమైన సంఘటనలు జరిగాయి. మన ముందు తిరిగిన వ్యక్తి ఆయన. కేవలం మూడు రోజులివ్వండి నాకు చాలు. ఏ దేవతను మీరు సాక్షా త్కరించుకోదల్చుకుంటారో, ఆ దేవతా సాక్షాత్కారం చేయించగల విధానాన్ని

తెలుపుతాను అనే విషయాన్ని తన శరీరంలో ప్రయోగం చేసుకొని, కేవలం 8 రోజులు చాలు అంతకంటే ఎక్కువ అక్కరలేదు అని ఆయన చెపితే, మనం ఎప్పుడూ ఏ దేవతని సాక్షాత్కరించుకోవాలో ఆ దేవతా సాక్షాత్కారం కోసం ప్రయత్నించం. ఆ దేవతను మనం ఎందుకు పూజిస్తామంటే దేవతా సాక్షాత్కారం కోసం కాదు ఆ దేవత మనకు ఏమైనా ఇస్తుందేమో అని. అది ఇవ్వకపోతే ఆ దేవత అక్కరలేదు. ఒక రాక్షసుడు మన కోర్కెను తీరుస్తానంటే ఈ దేవతను వదిలివేసి ఆ రాక్షసుడి దగ్గఱకు వెళ్తామని ఒకసారి రామకృష్ణ పరమహంస, వివేకానందుడితో అన్నాడట. అది నిజమేమో అన్పిస్తుంది నాకు. అంచేత దేవతా సాక్షాత్కార విధానంలో ఎటువంటి ఆర్తి, ఎటువంటి మానసిక స్థితి మనలో వుండాలో, మనం తెల్సుకోకుండా మనం ఎన్ని పూజలు చేసినా లాభంలేదు. B. A. Pass అయిన ఒక యువకుడు చాలా బాగా పాడగలడు. అందమైనటువంటి గొంతు వుంది. తండ్రి చనిపోయాడు. జమీందారీ కుటుంబమే కానీ, జమీందారీ కుటుంబం అంటే ఈనాటి అర్థం ఏమిటంటే అప్పులపాలైన కుటుంబమని అంచేత జమీందారీ కుటుంబంలో పుట్టినటువంటి B. A Pass అయినటువంటి ఆ యువకుడు భోజనం లేక ఇంటికి వచ్చినపుడు, నేను మా స్నేహితుల ఇంట్లో భోజనం చేసాను. మీరు భోజనం చేసేయండి, అనేవాడట నలుగురు అక్కలున్నారు అతనికి. వారు కూడా ఏంచేసేవారంటే–వాళ్ళ అమ్మకు మేము కూడా స్నేహితుల ఇంట్లోనే, ఎక్కడో భోజనం చేసి వస్తున్నాం అమ్మా! నీవు భోజనం చేసేయి, అనే వారుట. ఎవ్వరూ భోజనం చేసే వారు కాదు. కానీ వాళ్ళ అమ్మకు ఆహారం ఎక్కడ వుండదో అని చెప్పి ప్రతివాళ్ళు ఇలా అబద్ధం చెప్పేవారు. మేము భోజనం చేసి వచ్చాము అని చెప్పేవారు.

అటువంటి B. A. Pass అయిన ఆ యువకుడికి భగవంతుడున్నాడు, ఆ భగవంతుని పట్టుకోగల్గితే నీకు ఈ సమస్యలు వుండవు. అని ఓ స్నేహితుడు చెబితే బైల్దేరాడుట ఎక్కడికి బైల్దేరాడు? "భగవంతుని చూసిన వ్యక్తి ఎవరైనా వున్నారా? ఆ వ్యక్తి దగ్గర నేను నేర్చుకుంటాను" అని. గురువు అని మనం ఎన్నుకొనేటపుడు, సాధనా విధానాన్ని మనం నేర్చుకొనేటపుడు, ఎవరిని పడితే వారిని చేర్చుకోకూడదు అని మనం గుర్తుంచుకుంటాం తప్ప, పాండిత్యము మాత్రమే ఈనాడు మనం చూస్తున్నాం తప్ప–ఎన్ని రకాల శ్లోకాలు ఎన్నిరకాల కొటేషన్లు

వాళ్ళు చెప్పగలరో చూస్తున్నాము తప్ప, అసలు ఆ అనుభూతి అతనిలో వున్నదా? అని ఎక్కడా మనం చూడటం రేదు. కానీ ఆ యువకుడున్నాడే Just B. A. అయినవాడు 18 ఏళ్ళవాడు బైల్దేరాడు. భగవంతుడు నా బాధలన్నీ తీరుస్తాడు అని నా స్నేహితుడు చెప్పాడు. నిజంగా భగవంతుని చూసిన వ్యక్తి ఎవరైనా వున్నారా?? ఆ వూళ్ళో వున్న యువకులు, సాధువులు అందరి దగ్గరకు వెళితే, అతని అదృష్టం బాగుండి ఎవ్వరూ అబద్ధం చెప్పలేదు. "మేము భగవంతుని చూసాము" అని. చూసే ప్రయత్నంలో వున్నాం అన్నారు. ఒక వ్యక్తి మాత్రం అతన్ని చూసి "Boy! you have the eyes of a yogi" అన్నాట్ట. భగవంతుడున్నాడో లేదో చెప్పలేను కానీ నీ కళ్లు మాత్రం యోగి కళ్ళు అన్నాట్ట.

నా కళ్ళు యోగి కళ్ళు అయితేనేం! ఎవరి కళ్ళు అయితేనేం! నాకెందుకు! నువ్వు భగవంతుని చూసావా? అని మళ్ళీ అడిగాట్ట. "ఒక వ్యక్తి వున్నాడు. అతను భగవంతుని చూసాడు అని అందరూ అంటున్నారు. కానీ నేను అనడం కాదు. నా నమ్మకం- ఆ వ్యక్తి భగవంతుని చూసాడు. ఆ వ్యక్తి దగ్గరకు వెళితే నీకు భగవంతుని చూపిస్తాడు" అని అన్నాడు. ఎక్కడ వుంటాడు? ఆ వ్యక్తి అన్నాడు ఊరికి 12 కి మీ. దూరంలో ఒక తోట వున్నది ఆ తోటలోనే వుంటాడు అతను" అన్నాడు. అయితే బైల్దేరాడు అడిగాడు. ఎప్పుడు ఎవరికి ఏది interest వుంటే దానిని గురించే తెలుస్తుంది తప్ప. మిగతావి తెలియనట్లే, ఈ కాలంలో ఎక్కడ ఏ సినిమా హాలులో ఏ సినిమా ఆడుతోంది అంటే రక్కున చెప్పేస్తారు అందరూను. కానీ ఏ గుడి ఎక్కడ వుందో అంటే, ఆ గుడి ఎక్కడ వున్నదో వెతుక్కొని చావాల్సి వస్తుంది చాలా మందికి. అదే విధంగా ఆ తోట యెక్కడ వున్నది? అని అందర్నీ అడుగుతుంటే కొంతమంది నవ్వారుట. ఆ పిచ్చివాని దగ్గరకు వెళతావా! అని. భగవంతుని యొక్క రహస్యము తెల్సు కొన్న వ్యక్తికి మొట్టమొదట సమాజం ఇచ్చే బిరుదు ఏమంటే "వెర్రివాడు" అని. అంచేత ఇది జాగ్రత్తగా గుర్తుంచుకోండి. మీరు ఎవరినైతే నమ్ముకుంటారో ఆయనకు 'వెర్రివాడు' అని బిరుదుంటే మీరు చాలా ఆనందించండి. ఎంచేతనంటే, అతను ఖచ్చితంగా Corrcet అయిన వాడై వుంటాడు. అంచేత ఈ 18 ఏళ్ళ యువకుడు, ఆ పిచ్చివాణ్ణి వెతుక్కుంటూ బయల్దేరాడు. ఎండాకాలం. కలకత్తాలో ఎండ బాగా వుంటుంది. ఎండాకాలం కనుక పరుగెడుతున్నాడు ఎవరికోసం పరుగెట్టాడు? భగవంతుని చూసిన వ్యక్తిని తన కష్టాలు తీర్చుకోవడం కోసం

పరుగెట్టాడు. ఇలాంటి పరిస్థితులలో, బీదకుటుంబంలో వున్నాను నేనని వెళ్ళాడు అక్కడికి అతను కూర్చుని వున్నాడు. మామూలుగా గెడ్డం పెరిగి వున్నది. తెల్లని దుప్పటి కప్పుకుని వున్నాడు. వెర్రిచూపులు చూస్తున్నాడుట "ఎక్కడున్నాడు? ఆ భగవంతుని భక్తుడు?" "అడుగో! ఆయనే!" అన్నారు ఈయనే అని అనుకోలేదు. Direct గా ఆయన వద్దకు వెళ్ళి "మీరు భగవంతుని చూసారా? అన్నాడు. "ఔను" "ఎలా? చూసారు?" అన్నాడు. "నిన్ను ఎలా చూస్తున్నానో, అలానే చూస్తున్నాను అన్నాడు. "నాకు చూపించగలరా!" అన్నాడు. "ఓ చూపిస్తా దానికేముంది. చూపిస్తాను, రా! కానీ, నీవు ఎందుకు వచ్చావో, ఎందుకు పరిగెత్తుకుని వచ్చావో, అది నువ్వు మరచిపోకు.ఇదిగో ఇక్కడ ఒక కాళికాదేవి ఆలయం వున్నది. నేను-వివేకానంద రామకృష్ణ పరమహంసల మధ్య జరిగిన సంఘటన చెబుతున్నాను. నిజంగా జరిగిన సంఘటన చెబుతున్నాను

"కాళీ ఆలయానికి వెళ్ళి నీ కోరికేదో కోరుకో తిండి లేదంటున్నావు కదా! వెళ్ళు అన్నాడు, వివేకానంద ఆలయంలోనికి వెళ్ళాడు. కోరుకోవాలి కదా! డబ్బు కావాలి, ఆరోగ్యం కావాలి, ఉద్యోగం కావాలి, పిల్లలకు పెళ్ళికావాలి. నాకు ఈ రోగం నయం కావాలి- అనేవి కోరుకోవాలి గదా! అవేం కోరలేదు 'నాకు జ్ఞానం కావాలి' అని కోరాడుట, వచ్చాడు రామకృష్ణ పరమహంస దగ్గరకు "ఏం కోరుకున్నావయ్యా!" అని అడిగాడట "నాకు జ్ఞానం కావాలి" అని అడిగాను అన్నాడు వివేకానందుడు. "నిన్ను వెర్రివాడంటారు. చూస్తుంటే నీవూ వెర్రివాడిలాగనే వున్నావు. వెళ్ళి వెళ్ళి జ్ఞానం అడిగావేమిటయ్యా! నీకు తిండి లేదంటున్నావు గదా! ఉద్యోగం అడుక్కో, లేకపోతే డబ్బు అడుక్కో. మీ అక్కలకు పెళ్ళి కాలేదంటున్నావు కదా! వాళ్ళకు పెళ్ళిళ్ళవ్వాలని అడుక్కో, వెళ్ళు, వెళ్ళు అన్నాడు. మళ్ళీ వెళ్ళి వచ్చాడు 'ఏం అడిగావు?' "ఏం అడగలేదండి.జ్ఞానమే అడిగాను." "నువ్వు ఖచ్చితంగా వెర్రివాడివే,వెర్రి వాడిలా వున్నాడు అన్నది తప్పు.మళ్ళీ వెళ్ళు!"అన్నాడు, మూడోసారి మూడు సార్లు అంటే ముమ్మారు ఆచమనం చేయడం అనేకర్మకాండ వెనుక అద్భుతమైన విజ్ఞానం వున్నది. సరే! ఈసారికూడ వెళ్ళాడు—— వివేకానంద మళ్ళా జ్ఞానమే అడిగాడు. "సరే నువ్వు అడగలేవులే నేనే అడుగుతాను అమ్మని ఈనాటి నుంచి నీ కుటుంబంలో ఎవ్వరికి ఆహార లోపం వుండదు" అని చెప్పాట్ట. మిగతాది గ్యారంటీ ఇవ్వను.లేను అన్నాడు సరే బాగానే వుంది. "భగ

ఎంతుని చూపిస్తానన్నావుకదా! మరి చూపించు" అన్నాడు. అక్కడే హుగ్లీనది ప్రవహిస్తుంటుంది దక్షిణేశ్వరంలో. రా చూపిస్తాని దానిలో ఒకసారి మునుగు అన్నాడు—రామకృష్ణ పరమహంస కూడ మునిగాడట సరే! స్నానం చేస్తేగాని, భగవద్దర్శనం చేయరాదనే నియమం వున్నది కదా! స్నానం చేయలేదు కనుక' మనం దేవుడి దగ్గరకు వెళ్ళం. స్నానం చేయలేదు కనుక మనం సినిమాకు వెళ్తాం' ఆహారం తీసుకుంటాం అన్నిటికీ వెళ్తాం. కానీ స్నానం చేయలేదు కనుక, పూజ' ఉపాసన చేయనట్లే ఓహో! ఇతను నన్ను స్నానం చేయమంటున్నాడు కాబోలు అనుకొని మునిగాడట. వెంటనే శ్రీ రామకృష్ణ పరమహంస అతని మెడమీద చేయి పెట్టి నొక్కేసాడట గాలికై కొట్టుకొంటున్నాడు మనసులో భయమేసింది.

"ఖచ్చితంగా అతను పిచ్చివాడే ముంచేస్తున్నాడు నా ప్రాణాలు పోతాయి తెలియక ఇతని దగ్గరకు వచ్చాను భగవంతుణ్ణి చూపిస్తాను అంటే ఇది నేను నమ్మటం ఏమిటి?అనుకున్నాను."అని వివేకానంద తన Memoriesలో వ్రాస్తాడు వారి మొట్టమొదటి పరిచయం గురించి. భయపడ్డాడట పరమహంస నొక్కాడు సరే! పైకొచ్చాడు ఎలాగో అష్టకష్టాలూపడి. రామకృష్ణ పరమహంస చాలా Weak గ' నీరసంగా వుంటాడు. వివేకానంద బొమ్మ చూసారు గదా! మీరు. 'సాండో'లాగ వుంటాడు. అయినా ఆయన మెడను నొక్కేస్తుంటే, దీన్నేకాబోలు పిచ్చి బలం అంటారు?! వెర్రివాడు నొక్కేస్తున్నాడు. అనుకున్నాను అని వ్రాశాడు. East and West Disciples కు Memories దొరికితే చదవండి. అక్షరాలా ఇలానే వ్రాసాడు బైటకు వచ్చిన తర్వాత పరమహంస ఏమన్నాడు? "ఏమయ్యా! నీకే మని అనిపించింది ?" ఒకసారి అని పించింది నిజం చెప్పేద్దామా? అని "నువ్వు వెర్రివాడివి" అని- కానీ చెబితే బాగుండదు "గాలి కావాలి" అనిపించింది నాకు. "నాయనా! గాలి కావాలి అని నీకు ఎంత తీవ్రంగా అనిపించిందో, అంత తీవ్రంగా భగవంతుణ్ణి చూడాలి అని, ఆయన కావాలి అని అనుకుంటేనే గాని ఆయన కన్పించడు". కనుక, భగవంతుణ్ణి చూడటానికి కావలసినది తీవ్ర భావసంవేదనలు తప్ప, కర్మకాండలు కావు, అన్నది మనం చాలా జాగ్రత్తగా మన ఋషుల, గురువుల, మహనీయుల జీవిత చరిత్రలు చదువుతుంటే— ఎలా? ఉచ్చారణ చేయాలి సార్! ఎర్రరంగు పూవులు వేయాలా? సార్? తెల్లరంగు పూవులు వేయాలా? అనీ; గంధం ముందు వేయాలా? అక్షంతలు ముందు వేయాలా? అని ఇలా అడగటం అర్థం లేదన్నమాట మన ఋషులు చెప్పింది భావ సంవేదనలు కావాలి.

దేవతలకు భావాలు కావాలి. అంతే తప్ప ఎటువంటి కర్మకాండ చేసారో, ఎప్పుడూ అక్కరలేదని రకరకాల కథల్లో చెప్పారు. అది మనం మర్చిపోయాం.

యజ్ఞము అంటే ఈ త్యాగము మనం ఏ భావన కావాలనుకుంటున్నామో, ఏ కోరిక కావాలనుకుంటున్నామో, ఆ కోరిక మీదనే లక్ష్యం వుంచుకొని, మిగతా వానిని వదలివేస్తే మీ లక్ష్యం చాలా సులభంగా వస్తుందిట. ఒక దేవాలయ ప్రాంగణంలో ఓ చిన్న సంఘటన జరిగింది ఏ రాతితో అయితే స్తంభం చేయబడిందో, అదే రాతితోనే మూర్తి కూడ చేయబడి వుంటుంది కదా! అయితే ఈ స్తంభానికి కోపం వచ్చిందిట "మన మందరమూ సమానమే కదా! Majority గదా!అందరూ వెళ్ళి ఆ మూర్తికే పూజ మొదలైన వుపచారాలు చేస్తారు నేను ఈ గుడి భారాన్నంతటినీ మోస్తున్నాను కదా! నేను ఒక్కసారి ప్రక్కకు వెళితే అసలు ఈ దేవుడే వుండడు. ఈ గుడే వుండదు. ఈ విగ్రహానికి నిలువ నీడ కూడా వుండదు. నన్నెవ్వరూ పూజచేయరు నా వద్ద చెప్పులూ మొదలైనవి పెడ్తారు. ఆ పూజారి గంట వాయిస్తాడ Nonsence సమానత్వం కాదు ఇది. కోర్టులో కేసు వేయాలి" అనుకున్నదట ఆ స్తంభం ప్రక్కనున్న స్తంభాన్ని అడిగింది నాకూ తెలీదు కానీ, నువ్వు చెబుతున్నావు కాబట్టి కరెక్టుగా వున్నట్లుంది ఇన్ని సంవత్సరాల నుండి మేం మోస్తున్నాం గానీ ఆ పూజలన్నీ ఆ మూర్తికే చేస్తున్నారు మాకు చేయటం లేదు. correct విషయం కనుక్కుందాం అను కున్నాయి. ఎవర్ని కనుక్కోవాలి? పూజారిని. మరుసటి రోజు పూజారి వచ్చి పూజ చేస్తున్నపుడు అడుగుదామనుకున్నాయి పూజారి వచ్చాడు. భవ్యమైన విగ్రహము పూజ చేస్తున్నపుడు మూర్తిలో గల తేజస్సుకు ఈ స్తంభాల నోట మాటరాలేదు. చివరకు హారతి అయిన తర్వాత భయంతో అడిగాయట పూజారిగారూ! మాకో చిన్న అనుమానం. మేము ఆ మూర్తి లాగానే రాళ్ళమే కదా! మరి మాకు, ఆ మూర్తికి ఎందుకింత తేడా? అంటే- ఏం లేదు. ఓ చిన్న ఇది వుంది నీవు రాయివే ఆ మూర్తీ రాయే కాని నీలో వున్న మూర్తి అనవసర పదార్థాలతో కప్పబడి వుంది. ఆ మూర్తిలో అనవసర పదార్థాలు తొలగించబడి వున్నాయి అంతే. అంత కంటే ఏం లేదు. అంచేత అనవసరమైన గుణాలను, అనవసరమైన కర్మ కాండలను తొలగించి, మనలో వున్న ఆ దేవత్వాన్ని ప్రకటింప చేసుకుంటే ఈ మూర్తి పూజ ఎలాగో, దేవత దేవాలయం అర్థం మనం తెల్సుకోవాలి అనేది మళ్ళా మనం మర్చిపోయాం. దేవతల్లా వస్తాం. మొక్కుతాం మళ్ళీ అంతా చేస్తాం తప్ప, ఒక విగ్రహం ఎలా తయారవుతోంది? ఆ విగ్రహానికి రాముడు అని పేరు ఎందుకు ఇస్తున్నారు?

ఈ రాయిలోను ఆ విగ్రహం ఉన్నది. కానీ ఏమిటి తేడా? ఇక్కడ దైవ స్వరూపాన్ని మిగతా పదార్థాలు కప్పి వున్నాయి. మాయ అనేటటువంటి ఆవరణ వున్నది దానిని మెల్లి మెల్లిగా correct గా తొలగించి వేసుకుంటే, ఆ స్వరూపాన్ని, ఆ శిల్పి తయారు చేయనక్కర్లేదు ఆ స్వరూపం అక్కడనే వుంది అన్న రహస్యాన్ని మనం తెల్సుకొని, మనలో వున్నటువంటి దుర్గుణాలను, ఆ దేవతా శక్తులను, ఆవరణలుగా వున్నటువంటి గుణాలను, తీసివేయడం కూడా యజ్ఞమే ఇది గుర్తుంచుకొని, యజ్ఞము అన్న పదాన్ని గుర్తుంచుకొన్న తర్వాత ఈ అశ్వమేధ యజ్ఞానికి ఇంకొక పేరున్నది. దేవ సంస్కృతి దిగ్విజయ యాత్ర అని. రెండూ ఒక్కటే. అశ్వమేథము అనినా, దేవ సంస్కృతి దిగ్విజయము అన్నా ఒక్కటే. ఈ దిగ్విజయ యాత్రలు అనగానే మనకున్నటువంటి ఆలోచనా విధానంలో గల లోపం ఏమిటి? అంటే గబుక్కున ఏం గుర్తుకొస్తుంది? అంటే—ఒక రాజు, రథం, సేనలు—ఆక్రమణ చేస్తాయి ఇంకోరాజు మీదకు. వాణ్ణి చంపేసాయి. వాణ్ణి చంపేసి, వాడి రాజ్యాన్ని కూడా తన రాజ్యంలో కల్పేసాడు అని. కానీ, శంకర దిగ్విజయ యాత్ర అని కూడా మనం చదువుకుంటూ వుంటాం. ఏం జరిగింది అక్కడ? తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికీ, తను నమ్మిన సత్యాన్ని ప్రతిపాదించడానికీ, ఇతరులతో వాగ్వాదం చేసి, మానసిక ఆలోచనా యుద్ధం చేసి, వాళ్ళ ఆలోచనలను కూడ తన సిద్ధాంతానికి అనుకూలంగా మార్చి, ఇంకొక సిద్ధాంతాన్ని నమ్మిన వాళ్ళను కూడ, ఈ సిద్ధాంతము సత్యమైనది, correct అయినది అని నిరూపించేటటువంటి యాత్రను— దిగ్విజయ యాత్ర— శంకర దిగ్విజయ యాత్ర అంటాం మనం అదీ నిజమైన దిగ్విజయ యాత్ర.

ప్రహ్లాదుడు తండ్రితో అంటాడు 3 లోకాలను గెలిచాను అంటావు నాన్నా! ఏం గెలిచావు నీవు? నీలో వున్న ఆరుగురి శత్రువులను గెలవలేక పోయావే. ఇక నీదేం గెలుపు? అని ఇది మన భారతీయ సంస్కృతి, సంస్కారం.అంచేత యుద్ధం చేసి పరాయి రాజ్యాన్ని ఆక్రమించడం మన సంస్కారం కాదు. అసలు మన యజ్ఞ విధానమే కాదు. దేవతా ప్రవృత్తులను పెంచుకోవడం, సంగతీకరణ చేసుకొని అందరూ కలసి మెలసి జీవించడము, ఇతరుల కోసం తన ఆహారాన్ని కూడ త్యాగం చేసుకోవాలి—అనేదే యజ్ఞము అని మనం చెప్పుకుంటున్నపుడు, ఇతరుల

యొక్క రాజ్యాన్ని, ఇతరుల వస్తువుల్ని అపహరించి గెలిచి, వాళ్ళని నానా హింసలు పెట్టి తెచ్చుకుంటున్నటువంటి విజయము అశ్వమేథ యజ్ఞం ఎలా అనిపించుకుంటుందో అనేటటువంటి ఆలోచన మనకు రావటం లేదు మన భారతీయ సంస్కృతి అంటే ఏమిటో తెలీక. అంచేత అశ్వమేధ యజ్ఞము అనే పదాన్ని మనం ఎప్పుడైతే వాడతామో, ఈ అశ్వమేధ యజ్ఞంతోపాటు మనం ఖచ్చితంగా గుర్తుంచుకోవలసినది ఏమిటంటే-మన సంస్కృతి, మన culture. సంస్కృతి అంటే ఏమిటి! చాలా విచిత్రమైనటువంటి ప్రశ్నలు— దీన్ని మించినటువంటి సంస్కృతి ఎక్కడా లేదు. ఈ భారతీయ సంస్కృతి కోసం గంగ వెర్రులెత్తిపోతున్నారు విదేశీయులు ఈనాడు. మీరు చెబితే నమ్మరేమో పారిస్ దగ్గర 14 కి॥మీ దూరంలో ఒక Village వుంది ఒక గ్రామం వున్నది. ఆ గ్రామంలో గత 14 సం॥లుగా నిరాటంకంగా, Break లేకుండా స్పష్టమైనటువంటి సంస్కృత ఉచ్చారణతో శివాభిషేకం జరుగుతోంది. నమకము, చమకములతో గత 14 ఏళ్ళుగా, ఎందుకు? అంటే అక్కడికి మన దేశం నుంచి ఒక మహానుభావుడు వెళ్ళి రుద్ర సూక్తము—నమకము, చమకము వల్ల వాతావరణంలోని కాలుష్యమంతా నివారణ అయిపోయి, మంచి పరిస్థితులు ఏర్పడతాయి అంటే దానిని నమ్మి, దానికి కావలసిన వైజ్ఞానిక ప్రయోగాలు చేసిన తర్వాతనే... ఏమిటి వాళ్ళు చేసినటువంటి అనేక ప్రయోగాలలో మీరు నమ్మలేనటువంటి ప్రయోగం ఒకటుంది రుద్ర సూక్తంలో, రుద్ర సాధనలో – కాలభైరవ సాధన ఒకటున్నది ఈ కాలభైరవ సాధన చేస్తున్నపుడు, 14 సం॥ల క్రిందటి News Paper లో కూడ ఈ సంఘటన పడింది కానీ ఇది మనకు గుర్తుండదు ఏం జరిగింది ఇప్పుడు. అక్కడ ఉన్న నమకం, చమకం Non–Stop గా జరుగుతోంది. అంటే ఏకాదశ రుద్రాభిషేకం అని Continious గా చేస్తుంటాము గదా! అలాగే వాళ్ళు 14 సం॥ల బట్టి రోజూ అలా చేస్తూ వుండాలి అనే సంకల్పం వాళ్ళది. ఆ ఊరు పేరు నాకు గుర్తు లేదు. Bonn City దగ్గర వున్నది. అక్కడి వాళ్ళు, ఈ వెళ్ళినటువంటి మహనీయుడు, కాలభైరవ స్తోత్రం అంటే ఏమీ కాదు-కాలుడు అంటే కుక్క కాదయ్యా కాలభైరవ స్తోత్రం అంటే ఒక కుక్కని ప్రతిష్ఠాపన చేసేసి, ఆ కుక్కకు పూజ చేయమని కాదు. కాలభైరవుడు అంటే కాలము 'Time' "కాలోస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో" కాలము.

కాలభైరవాష్టకం చదువుతున్నాడట Sudden గా T V. Screen మీద అన్ని T.V. Screens మీద, కుక్క బొమ్మ ఏర్పడిందట ఎటువంటి కుక్క బొమ్మ? మామూలు రేఖలతో గీసిన కుక్కబొమ్మకాదు. అగ్ని జ్వాలతో ఏర్పడినటువంటి కుక్కబొమ్మ ఏర్పడిందిట అది చూసినతర్వాత వాళ్ళు సంస్కృతం మీద అధ్యయనం చేసి, ఈనాడు జర్మనీలో, మన భారతదేశంలోకంటే ఎక్కువ మంది సంస్కృతం పూర్తిగా తెల్సినటువంటి వ్యక్తులు జర్మనీలో వున్నారు అని ఒక Survey చెప్పింది. ఈనాడు సంస్కృతంలో మనకు చాలా విషయాలు అర్థంకావు కానీ జర్మనీలో సంస్కృతంలో మాట్లాడ గలిగిన వ్యక్తులు 10, 15 మంది ప్రతి గ్రామంలోనూ కన్పిస్తారు.

వాళ్లు చేసిన ప్రయోగంలో ఏం తేలిందంటే, ఈ సంస్కృత అక్షరాలున్నాయిగదా! 'క' ఇలా వ్రాస్తాం దేవనాగరిక లిపిలో. ఆ దేవ నాగర లిపిలో కనుక ఒక విశిష్టమైన పరిమాణంలో ఒక Tube తో ఆ అక్షరాన్ని తయారుచేసి దానిలో నుంచి గాలిని ఊదితే 'క' ఎలా పలుకుతుందో అలాంటి శబ్దం వచ్చింది అంచేత ఆ కాలభైరవాష్టకం అంతా, ఆ అక్షరాల Tube లాగా వ్రాసి, గాలి పంపిస్తే వాళ్ళకు కాలభైరవాష్టకం విన్పించిందట. అక్షరము, అక్షర స్వరూపము, దాని దేవత గురించీ మనం చదువుతాంతప్ప ఈ అక్షరానికి అధి దేవత, ఈ అక్షరానికిదీ ఛందస్సు అంటాం తప్ప—వాళ్ళు అక్కడ Practical గా ప్రయోగం చేసి చూసి, ఆ అక్షర సముదాయంవల్ల ఆ కాలభైరవ స్వరూపం ఏర్పడటం చూసిన తర్వాత వాళ్ళు అనవరతము ఆ కార్యక్రమం చేసుకొస్తున్నారు. కానీ ఇదంతా నేను ఏ Angle తో చెప్పుకొస్తున్నానో గుర్తుంచుకోండి దేవ సంస్కృతి అంటే ఏమిటి? అశ్వమేధ యజ్ఞము అనే పేరుతో ఈ భారతీయ సంస్కృతిని ఏమని అంద చేయాలి? భారతీయ సంస్కృతి అంటే ఏ విధంగా చెప్పాలి అంటే 1960 లో ఒక మహావ్యక్తి ద్వారా గీతాజ్ఞాన్ యజ్ఞాలు జరిపించాలి అనే స్ఫూర్తి, ప్రేరణ నిచ్చే గొప్ప సంఘటన జరిగింది.

కాలిఫోర్నియాకు భారతదేశం నుంచి Cultural exchange లో ఇప్పటికే ఇవి జరుగుతూనే వున్నాయి Rotary, Lions వాళ్ళు నుంచి అక్కడ వున్నవాళ్ళు ఇక్కడకు, ఇక్కడివారు అక్కడికి వెళ్ళటం. ఈ Cultural exchangeలో కొంత మంది వ్యక్తులు వెళ్తుంటే,ఆనాటి భారతదేశ Cultural Ministrer సాంస్కృతికశాఖామాత్యులుకూడా వెళ్ళారట. ఇక్కడ నుంచి విదేశాలకు వెళ్ళే

టప్పుడు కొంత Training ఇవ్వబడుతుంది. ఎందుకు? అంటే ఏ మాట మాట్లాడ వచ్చు, యేది మాట్లాడకూడదు. అన్నది కొంచెం చెప్తారు.

విదేశాలు వెళుస్నప్పుడు మనవాళ్ళు వాక్కును జాగ్రత్తగా వుంచుకోకపోతే చాలా ప్రమాదాలు వస్తాయి, దేశానికీ దేశానికి మధ్య. అందుచేత ఇక్కడ యేం చెప్పారంటే మీరు విదేశాలకు వెళుతున్నారు, కాలిఫోర్నియాకు వెళుతున్నారు, బాగానే వుంది మానవజాతిలో ఒక విశిష్టమైన, అద్భుతమైన ఒక జాతి వుంది వాళ్ళను News Paper Reporters అంటారు. వాళ్ళతో కాస్త జాగ్రత్తగా వుండు. వాళ్ళతో జాగ్రత్తగా వుండకపోతే అనర్ధం జరిగిపోతుంది అన్నాట్ట Cultural Minister అన్నాట్ట. మీరు నాకు చెప్పేదేమిటి? నేను ఎన్నిరకాల ఎత్తులకు పై ఎత్తులు వేస్తే మినిష్టర్ నయ్యానో. అంచేత ఆ News paper reporters నన్నేమి చేస్తారు? నేను చూసుకుంటాలే అన్నాడు. News paper reporters వచ్చారు. రకరకాల ప్రశ్నలు వేశారు. రెండు రకాల ప్రశ్నలే మనకు ముఖ్యం. మొదటిది Will you see night clubs? అని అడిగారట ఎంచేతనంటే సాధారణంగా విదేశాల నుంచి వచ్చే-ముఖ్యంగా భారతదేశం నుంచి కనక వెళితే వాళ్ళకు విపరీతమైనటువంటి ఆకర్షణా కేంద్రం Night Club. అంచేత ప్రతివాళ్ళను అడుగుతారు ఈ ప్రశ్న. అది సాధారణమైన ప్రశ్నే, విచిత్రమైనది కాదు. మీరు Night clubs చూస్తారా? అని అంటే, వారు Minister, Politician మాటలు జాగ్రత్తగా ఉపయోగించడం వచ్చని అన్నాట్టా- Are there night clubs in America? అంటే అరె అమెరికాలో night clubs ఉన్నాయా ? అని ప్రశ్నించాడు. వాడేమనుకున్నాడు— అసలు night culbs ఉన్నదే నాకు తెలీదంటే ఈ reporter నన్నేం చేయగలడు అని అనుకున్నాట్ట రెండో రోజు పొద్దునే News Paper తీసాట్ట పేపర్లో the first Question cultural ministeter asked "are there night culbs in America" ? అని Question mark వేసారు. దానితో అర్ధమే మారిపోయింది. ఈయన ఏ ఉద్దేశంతో అన్నాడు అసలు night culbs America లో ఉంటాయా నాకు తెలీదే అంటే reporter ఏం చేసాడు అంటే ఈ Cultural minister America లో night clubs ఉంటాయా అని అడిగాడు, అంత తీవ్రంగా బాధపడుతున్నాడు. ఇది ఒక జోక్ కాని ఇది కాదు భారతీయ సంస్కృతికి చిహ్నం, దాని తర్వాత ప్రశ్న యేమిటంటే Do you know Geeta? అని అడిగాడట సరే are there night clubs

అన్నట్లే, what Geeta? అన్నాట్ట అంటే American reporter గాభరా పడ్డాట. కంగారుపడి ఆ reporter ఏమో ఎన్ని రకాల గీత లున్నాయో అనుకొని భగవద్గీత అన్నాట్ట Minsrter confuse అయిపోయాడు. confuse అయి ప్రక్కనున్న వాణ్ణి అడిగాడట. ఏంటి అడుగుతున్నాడు అని "ఏదో క్రొత్త Novel అయి వుంటుంది. ఇంకా నేను చూడలేదు అనేయండి సార్. గొడవ వదలిపోతుంది అన్నాట్ట I have not seen అన్నాట్ట. అది గూడా front page లో వేశారు. The cultural minister who has not seen Geeta భారతీయ సంస్కృతికి ఆధారమయిన భగవద్గీతకు మనం యిచ్చినట్టి విలువ ఇది.గీతయొక్క గొప్పతనాన్ని మా college లో ఒక student చెప్పాడు.' ఇంతవరకునాకు ఆ idea రాలేదు. ఏం చెప్పాడంటే 'మాస్టారూ భగవద్గీత చాల గొప్పదని నేను నమ్ముతున్నా'నన్నాడు అంటే Science lecturer ని కదా! Practical exams రెండు మూడు రోజులలో జరగబోతున్నాయి. నా కిందులో interest వుంది కదా, అందువల్ల కాస్త గీత అది మాట్లాడుతున్నాడని అనుకున్నాను. ఎందుకు? అని అన్నాను. ఎం లేదు మాస్టారూ, అటు courts లో జడ్జికి తెలుసు అబద్ధమని,ఇద్దరు లాయర్లకు తెలుసు చెపుతున్న దబద్ధమని. court లో కూర్చున్న ప్రతి వ్యక్తికీ తెలుసు చెపుతున్న దబద్ధమని. కాని వాడు భగవద్గీతమీద చేయి పెట్టి నిజం చెపుతున్నాను అంటే నమ్మేస్తున్నారు కదా! ప్రపంచంలో ప్రతి వ్యక్తికీ నిజము–అబద్ధం అని తెల్సినది

కూడా నిజమని ఒప్పించగల్గే గీత, అంత గొప్ప పుస్తకం మీద చెయ్యి పెడితే మరి అసలు ఆ పుస్తకాన్ని తెరిస్తే ఎంత గొప్ప జ్ఞానం వస్తుందో అన్నాడు. నిజంగా అదిరిపోయాను నేను కరక్టే కదా! అందరికీ అబద్ధమని తెల్సింది కూడా, ఆ పుస్తకం మీద చెయ్యి పెట్టేసరికి నిజమైపోతూ వుంటే, అసలు నిజమైనవి ఆ పుస్తకాన్ని చూసి మనం ఆచరణ చేసుకుంటే ఎంత గొప్ప సంస్కృతో, ఎంత గొప్ప ఇదో, కాని...సరే... అంచేత which Geeta? అన్నాడు. I have not yet studied అన్నాడు. బాగానే వుంది అది ఒక వ్యక్తికి ఒక అద్భుతమైన మిషన్‌గా నెలకొనడానికి ప్రేరణ నిచ్చింది. అదే Delhi లో మొట్టమొదటిసారి 1961 లో చిన్మయా గీత జ్ఞానయజ్ఞాన్ని start చేసాడు ఆయన ఈనాడు గీతా జ్ఞాన యజ్ఞానికి వెళ్ళటం అనేది ఒక status symbol అయిపోయింది. ఆఖరికి యద్దనపూడి సులోచనారాణి Novelలో కూడా I. A. S. Officers వాళ్ళు ఎక్కడికి వెళ్తున్నారు అంటే గీతా జ్ఞానయజ్ఞానికి వెళ్తున్నారు అని రాస్తుంది. ఇది అంతా

ఎందుకు చెప్తున్నాను అంటే గుర్తుంచుకోండి అశ్వమేధ యజ్ఞంలో యజ్ఞముఅనేది త్యాగమయ ప్రవృత్తికి, సద్గుణాల అభివృద్ధికి, సంగతీకరణకి symbol అయితే, త్యాగము యజ్ఞం యొక్క పరాకాష్ఠ అయితే, భారతీయ సంస్కృతి అంటే, ఏంటో మనం తెల్సుకోవాలి. ఈ భారతీయ సంస్కృతికి ఆధారం ఏంటి అంటే, ఇందాక నేను చెప్పినటువంటి గాయత్రీ మంత్రము. గాయత్రీమంత్రంతో పాటు జోడించబడినటువంటి యజ్ఞవిధానము.

భారతీయ సంస్కృతి మొత్తము 16 Centres మీద ఆధారపడి వుంది. దాన్నే షోడశ సంస్కారములంటాము. ఈ 16 సంస్కారముల మీద ఆధారపడి నటువంటి భారతీయ సంస్కృతి యొక్క జీవిత విధానాన్ని మన ఋషులు ఎంత గొప్పగా మన జీవితంలోకి ప్రవేశపెట్టారంటే, అమావాస్య నుంచి పౌర్ణమి అనే టటువంటి 16 తిథులు— 14 తిథులు, అమావాస్య ఒకటి, పౌర్ణమి ఒకటి. అందు చేత "పౌర్ణిమాస్యేష్టి" అని "అమావాస్యేష్టి" అనేటటువంటి రెండు యజ్ఞ విధా నాల ద్వారా, లలితా సహస్రనామంలో చెప్పినటువంటి "తిథిమండల పూజిత" అనే టటువంటి మాటల ద్వారా ప్రతి రోజుకు ఒక సంస్కారం చొప్పున అమావాస్య నుంచి మొదలు పెట్టి పౌర్ణిమ నాటికి పూర్ణత్వం పొందేటటువంటి ఈ షోడశ విద్యను, సంస్కార విద్యగా- షోడశ సంస్కార విద్యగా, మనకు గాయత్రీ మంత్రము, యజ్ఞ విధానంతో కలిపి అందచేశారు అందుచేత ఈ అశ్వమేధ యజ్ఞంలో మీకు నేను చెప్పినటువంటి 3 points గుర్తుంచుకోండి. గాయత్రీ మంత్రము ఉపయోగించుకోవడం మనం నేర్చుకోవాలి. గాయత్రీ మంత్రం అంటే ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి ధియో యోనః ప్రచో దయాత్ కాదు. గాయత్రీమంత్రం "లో" అనేక మంత్రాలలో అది కూడ ఒకటి. అనేక గాయత్రీ మంత్రాలున్నాయి. రామ గాయత్రి వుంది. సరస్వతీ గాయత్రి వుంది. అనేక గాయత్రీలు వున్నాయి ఏదైనాసరే గాయత్రీ మంత్రంలో 3 చర ణాలు వుంటాయి. విద్మహే ధీమహి, ప్రచోదయాత్. ఇదంటే ఏమిటంటే, ఏకా దశోధ్యాయంలో విశ్వరూపం మనం తెల్సుకోవాలి అంటే "జ్ఞాతుం ద్రష్టుంచ తత్వేన ప్రవేష్టుంచ పరంతప" జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం అనేవి గుర్తుంచుకోవాలి ఇవికాక పోతే ప్రజ్ఞ, నిష్ఠ, శ్రద్ధ అనే పదాలైనా గుర్తుంచుకోండి.

'ఇది' గాయత్రీ మంత్రము, శబ్దాలు గాయత్రీ మంత్రము కాదు. పాసీ అని

ఉచ్చారణ చేసినా, water అని ఉచ్చారణ చేసినా,విభిన్న అక్షర సముదాయాలతో విభిన్న శబ్దములైనప్పటికీ కూడ, ఒకే పదార్థాన్ని సూచించినట్టు, మన శరీరంలో వుండేటటువంటి ప్రజ్ఞ, నిష్ఠ, శ్రద్ధల స్థానము, జ్ఞానం, ద్రష్టం, ప్రవేష్టం జరిగే టటువంటి స్థానము, అనేక త్రిపదలు-వేదమాత, దేవమాత, విశ్వమాత అని గాయత్రిని అర్థం చేసుకునేటటువంటి స్థానము, మనలో వున్నటువంటి 5 ప్రాణ శక్తులు ఎక్కడైతే వున్నాయో, ఆ స్థానాన్ని గుర్తుంచుకొని, ఆ స్థానాలను సంస్కరింప చేసుకుని, దేని ద్వారా? యజ్ఞ విధానం ద్వారా మళ్ళా యజ్ఞ విధానం ద్వారా అంటే దయ వుంచి మీరు 'స్వాహా' ఒక అగ్నిని ప్రజ్వలింపచేసుకొని చేయడం అనుకోకండి. యజ్ఞము అంటే ఏంటో మళ్ళా జాగ్రత్తగా గుర్తుంచుకోండి. యజ్ఞము అంటే, సద్గుణముల అభివృద్ధి యజ్ఞము సంగతీకరణ యజ్ఞము, త్యాగమయ ప్రవృత్తి యజ్ఞము కాని ఈ సంగతీకరణ, ఈ త్యాగము, ఈ సద్గుణాల అభివృద్ధి మూడు రకాలైనటువంటి ప్రాకృతిక శక్తులద్వారా, ప్రకృతి అనుసరణ ద్వారా, మనం ఎలా తెల్సుకుంటాము అనేది యజ్ఞవిధానం Solar energy, Lunar energy and fire energy అగ్ని, సూర్య, చంద్ర, ఈ మూడు— సూర్యుడు కుడి కన్ను, చంద్రుడు ఎడమ కన్ను, వీటి రెండింటికి మధ్య వచ్చినటువంటి దివ్యమైనటువంటి తేజస్సు అగ్ని. ఈ మూడింటిని వుపయోగించుకోవడం ఎలాగ అనేది, మనకి Practicalగా, తక్షణం ఫలితమిచ్చేది యజ్ఞ విధానం అని గుర్తుంచుకోండి

వర్షం కురవాలి అని మీరు యజ్ఞం చేస్తే ఆ రోజే వర్షం కురవాలి.పిల్లలు పుట్టాలి అని పుత్ర కామేష్టి యజ్ఞం చేస్తే, అగ్నిదేవుడు ప్రత్యక్షమై ఆ రోజే మీకు హవిస్సు అందించాలి తప్ప, ఇంకో అప్పుడు చేయమని ఋషులు ఎక్కడా చెప్పలేదు అప్పటి కప్పుడే ఫలితాలు వస్తాయి "కామధుక్" అన్నాడు అక్కడ. కాని ఏ లోపం జరుగుతోంది? ఎక్కడ మనం చేస్తున్నటువంటి యజ్ఞ విధానాలలో ఫలితాలు మనకి రావటం లేదు అనేది తెల్సుకోవడానికి మన భారతీయ దేవ సంస్కృతి దిగ్విజయాన్ని, ఈ విధంగా వ్యక్తి—వ్యక్తికి అందించడానికి చేసే ప్రయత్నమే ఈ అశ్వమేధ యజ్ఞం యొక్క నాందిగా చేసేటటువంటి ఈ సమావేశం. రేపు సూర్యుడు, చంద్రుడు, అగ్ని ఈ షోడశ సంస్కారాలు, దేవ సంస్కృతి దిగ్విజయ యాత్రగా, అశ్వమేధ యజ్ఞంగా ఎలా రూపొందుతాయో తెలుసుకుందాం.

కాని నిన్న మీకు చెప్పాను నేను. ఎంత గొప్పగా దాని గురించి చెప్పిన,

ఆచరణ చేస్తే తప్పు లాభం లేదు కనుక చాలా గొప్పది గాయత్రీమంత్రము. "న గాయత్ర్యా పరో మంత్రః" అంటూ కూర్చుంటూఅలా, అనే బదులు ఒక్కసారి నోరు విప్పి, ఆ గాయత్రీ మంత్రాన్ని హాయిగా ఆనందంగా మనలో ఆ సద్భావన లను ప్రవృత్తి చేస్తుంది అనే భావంతో నడుం తిన్నగా ఉంచుకొని 5 సార్లు ఉచ్చారణ చేద్దాం ఉచ్చారణచేసినతర్వాతenergy follows thoughtఅని చెప్పాను నేను. మన ఆలోచనలు ఎలా ఉంటాయో అలాంటి ఫలితాలే వస్తాయి కనుక, అందరూ సుఖంగా వుండాలి. మన రాజులు మనల్ని సుఖంగా పాలించాలి. పిల్లలు లేని వాళ్ళకి పిల్లలు కలగాలి. డబ్బులేని వాళ్ళకి డబ్బు కలగాలి. డబ్బు వుండి, పిల్లలు వున్నా ఆయుష్షు లేకపోతే ఏంటి లాభం? అందుచేత అందరూ సుఖంగా ఆనందంగా100 ఏళ్ళు బ్రతకాలి అనే ప్రార్థన కూడా చేద్దాం అందుచేత 5 సార్లు గాయత్రీమంత్రము ఓం.......................స్వస్తిప్రజాభ్యః............ శాంతి శాంతి శాంతిః.

గురుర్ బ్రహ్మ...శ్రీ గురవే నమః. మంత్రం 8 సార్లు.

ఈ రెండు రోజులనుండి భారతదేశం యొక్క సంస్కృతి యొక్క గొప్ప తనాన్ని తెల్సుకుంటూ, భారతీయ సంస్కృతి మళ్ళీ తిరిగి జగద్గురు పీఠాన్ని అల రించబోతోంది అన్నది కాల పురుషుని ఇచ్ఛ కనుక, దాంట్లో మన వంతు పాత్ర మనం ఎంత చేయగలమో నిర్ణయించుకోవడానికి ఇక్కడ సమావేశమౌతూ, భారత దేశ సంస్కృతి యొక్క మొట్టమొదటి వైశిష్ట్యం ఏమిటంటే గాయత్రీమంత్రాన్ని అందివ్వటం. కానీ ఇక్కడ మనం ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. భారత దేశం గాయత్రి మంత్రాన్ని అందించినది కరెక్టే తప్ప, గాయత్రీ మంత్రము మీద Copy-right భారతదేశానికి లేదు Newton's Law అని చెప్తాము మనము సైన్సులో. లేకపోతే డాల్టన్స్ థియరీ అని చెప్తాము. మెండలీఫ్ పీరియాడిక్ టేబుల్ అని చెప్తాము ఇంగ్లీషువారు కొందరు, రష్యావారు కొందరు—సైంటిస్టులు. కానీ, వారు చెప్పినటువంటి ఆ సిద్ధాంతము కేవలం ఒక్క రష్యాకు, కేవలము ఒక ఇంగ్లండులో వున్నవాళ్ళకి మాత్రమే కాదు అది సర్వ జనీనమైనది. పేరు న్యూటన్స్ లా అని చెప్పినా గురుత్వాకర్షణ అందరికీ వర్తిస్తుంది మెండలీఫ్ కనిపెట్టినటువంటి పీరియాడిక్ టేబుల్ ప్రకృతిలో ఉన్నటువంటి ప్రతీ మూలకానికి వర్తిస్తుంది. అలాగే భారతదేశంలో మొట్టమొదటిసారి కనిపెట్టబడినటువంటి గాయత్రీమంత్రము సర్వజనీనమైనది. విశ్వానికి పనికి వచ్చేది. ఇక్కడ

విశ్వము అనే మాట మనం వాడినప్పుడు కేవలము భూమి అనేటటువంటి అర్థంలో కాకుండ, దృగ్గోచరమైనటువంటి సంపూర్ణ Universe కు వర్తిస్తూ వుంటుంది. అందుచేత ఏ విధంగా అయితే ఒక సూత్రము సర్వవ్యాప్తమో, గాయత్రీ మంత్రము అనేటటువంటి సూత్రం కూడ సర్వవ్యాప్తమైనది-అని మనం ముందుగా గుర్తుంచుకోవాలి. అందువల్ల నేను Repeated గా ప్రతిసారి "ఓం భూర్ భువః స్వః తత్సవితుర్వణ్యేం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్" మాత్రమే గాయత్రి కాదు, ఇది "కూడా" గాయత్రి అని చెప్తూ వస్తున్నాను ఈ తేడాను కాస్త అర్థం చేసుకోండి.

భారతీయ సంస్కృతిని అర్థం చేసుకోవాలి అంటే, మన ఋషులు అందించి నటువంటి ఈ అద్భుతమైనటువంటి ఫార్ములాను మనం అర్థం చేసుకోవాలి అంటే ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలి మనం. ఏమిటి? ఇందులో గాయత్రి మంత్రము అంటే మనం గుర్తుంచుకోవలసింది – గాయత్రిని 3 పాదాలుగా మనం చెప్పు కుంటాము త్రిపాదాత్మకమైనటువంటి గాయత్రీమంత్రము అని. దానికి మళ్ళీ మనం ఏం చెప్పుకుంటూ ఉంటాము? తత్సవితుర్ వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్—ఇవి గాయత్రి యొక్క 3 పాదాలు అని చెప్పు కుంటూ వుంటాము కరక్టే ఇది కూడ కానీ యూనివర్స్‌లో గాయత్రి, గాయత్రి ఛందస్సు ఛందస్సులలో నేను గాయత్రిని అని 10వ అధ్యాయంలో శ్రీ కృష్ణుడు స్వయంగా చెప్పుకుంటాడు. ఆ గాయత్రి ఛందస్సును అర్థం చేసుకోవాలంటే 3 పదముల యొక్క అర్థాన్ని మనం తెల్సుకోవాలి దీన్ని గత రెండు రోజులుగా నేను చెబుతూ వచ్చాను విద్మహే, ధీమహి, ప్రచోదయాత్. ఏ జ్ఞానాన్నైనా మీరు పొందదల్చుకొన్నా, ఏ ఆచరణైనా మీరు చేయదలచుకున్నా, మీకో దానిని గురించి తెలియాలి ఒకటో పాదం-విద్మహే. దాని తర్వాత చూడాలి ధీమహి. దాని తర్వాత ఇతరులు దానిని చేయడానికి పరిస్థితులు కల్పించాలి ప్రచోదయాత్ ఇది సామాజిక జీవితము. ఎలా చెయ్యాలో తెలుసుకోవాలి ఎలా చెయ్యాలో తెల్సుకున్న తర్వాత చేసిన వాళ్ళద్వారా అది ఎలా చెయ్యాలో చూసిం తర్వాత దానిని ఇతరులకు ప్రేరేపణ చేయడము అనేటటువంటిది ఒక సామాజిక విన్యాసము. దీనినే భగవద్గీతలో ఈ గాయత్రిని 'జ్ఞాతుం ద్రష్టుంచ తత్వేన ప్రవేష్టుంచ పరంతప' అని చెప్తూ వచ్చారు. ఇంతవరకు చెప్పుకున్న తర్వాత ఇది గాయత్రీ

మంత్రం గురించి Theoriatical aspect ఈ theoritical aspect చెప్పు కున్నాక, తెల్సుకున్న తర్వాత, ఈ గాయత్రీ మంత్రం నాకు ఎలాగ ఉపయోగ పడుతుంది? అన్నది వచ్చిన వాళ్ళందరికీ కాకుండ, ఋషులు అందచేయవలసిన ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఈ గాయత్రీ మంత్రము చాలా గొప్పది. నిజమే. నాకుపయోగ పడకపోతే ఎందుకు పనికిరాదు మనం ఉపయోగించుకో వాలి అంటే మన శరీరంలోని 3 పాదాలని అర్థం చేసుకుని బాహ్య జగత్తులోని మూడింటికి, మనలోని మూడింటికి మధ్య సమన్వయం కనుక పొందగల్గితే, అను గ్రహాన్ని కనుక పొందగల్గితే— అంటే Current flow ని మనం సంపాదించ గల్గితే, గాయత్రీమంత్రము మీకు కూడ ఉపయోగ పడుతుంది. అపుడు గాయత్రీ మంత్రము ఋషులు చెప్పిన విధంగా "నగాయత్ర్యా పరోమంత్రః" అనే మాట అర్థం అవుతుంది. కనుక ఈ విద్మహే, ధీమహి, ప్రచోదయాత్, జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం, ప్రజ్ఞ, నిష్ఠ, శ్రద్ధ అనే మూడు పదాలు మన శరీరంలో మూడు రకాలుగా అర్థం చేసుకోవాలి అనేది చెప్పుకుంటూ సూర్యుడు, అగ్ని, చంద్రుడు అనే ఈ మూడు పదాలను కూడ మనము కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకుంటూ ఉండాలి. ఎందుచేతనంటే, వ్యావహారికంగా వాడే పదాలకు అర్థం వేరు.

శాస్త్రీయ వాఙ్మయంలో వాడే పదాలకు అర్థం వేరు. నేను చాలాసార్లు మా Chemistry students కు చెప్తూ వుంటా No అనే రెండు ఇంగ్లీషు అక్షరాలు వ్రాసాననుకోండి. మామూలుగా అందరికి తెలిసే ఆంగ్లభాష ప్రకారం 'నో' అంటారు. అదే శాస్త్రీయ దృక్పథంతో వ్రాస్తే దాన్ని నో అని చదవడం Nitric oxide అని చదువుతాం Nitric oxide అని అనగానే అర్థం మారిపోతుంది. రకరకాల భావ పరంపర, దాని వెనుక నున్నది తెలుసుకుంటున్నట్లే అగ్ని, సూర్యుడు, చంద్రుడు ఈ 3 పదాల అర్థం తెలుసుకుంటే చాలా విచిత్రమైన గాయత్రీ మంత్రార్థాన్ని తెల్సుకోగలుతాం మనం. దీన్ని తెల్సుకునే ముందు ఇంకో పదాన్ని అర్థం చేసుకోవాలి—యజ్ఞం అనే పదాన్ని. గాయత్రి అంటే మనం తీసుకునే శ్వాస మనం తెలుసుకునే విజ్ఞానము మనం చూసినటువంటి విజ్ఞానం. మనం ఆచరణలో పెట్టేటటువంటి విజ్ఞానం ఇవి కాకుండ యజ్ఞం అనే పదానికి కూడ అర్థం తెలుసుకుని "సహయజ్ఞ ప్రజాసృష్ట్వా" అని ప్రజలతోపాటు యజ్ఞాన్ని కూడ సృష్టించి, యజ్ఞంతో మీ కోర్కెలను తీర్చుకోండి అని చెప్తూ

యజ్ఞం చేయకుండ కనుక మీరు ఆహారాన్ని వండుకుని తింటే 'స్తేన ఏవసః' అని అన్నారు భగవద్గీతలో. మీరు దొంగతనం చేస్తున్నట్టే మీరందరు దొంగలతో సమానమే యజ్ఞాజ్ఞ —యజ్ఞము యొక్క ఆజ్ఞ లేకుండ, యజ్ఞ కర్మ లేకుండ ఏమి చేసిన అది దొంగతనము చేసినట్లే అన్నారు. దీన్ని అర్థం చేసుకోవడానికి నిన్న యజ్ఞం గురించి మూడు Conditionsని చెప్పాను. యజ్ఞం అంటే అగ్ని ప్రదీపనం చేసి నెయ్యి, ఆహుతులు వెయ్యటమే కాదు. యజ్ఞం అంటే సత్ప్రవృత్తుల సంవర్ధనం. సంగతీకరణము, పరస్పరం ఒకరికొకరు సహకరించు కోవడం. ఇవి రెండూకాక అవసరమైనప్పుడు పరస్పరం సహకరించు కొంటున్నపుడు త్యాగం యొక్క పరాకాష్ఠకు వెళ్ళగల్గుతాం. ఈ మూడు కూడ యజ్ఞాలే. ఈ రకమైన యజ్ఞం అనే పదం అర్థం చేసుకున్న తర్వాత, భగవద్గీతలో మూడవ అధ్యాయంలో కర్మ యోగంలో రెండు విషయాలు చెప్తారు "అన్నాద్ భవంతి భూని పర్జన్యాద్ అన్న సంభవః" మనం వుపయోగించే పదార్థాలన్నీ కూడ భూతములు అని అంటాం

పంచభూతములు ఇవి ఎందువల్ల వస్తున్నాయంటే పర్జన్యాదివల్ల. అన్నం వల్ల వస్తున్నాయి. మనం ఆహారం తీసుకొంటున్నాం కనుక పనిచేయగల సామర్థ్యము గల శరీర నిర్మాణం అవుతుంది ఈ అన్నం పర్జన్యము వల్ల వస్తోంది. ఆ పర్జన్యం యజ్ఞంవల్ల వస్తోంది. యజ్ఞం కర్మవల్ల, కర్మబ్రహ్మవల్ల, బ్రహ్మ అక్షరంవల్ల వస్తోంది. కనుక ఈ Science of actionsని మీరు చాల జాగ్రత్తగా తెలుసుకుంటే తప్ప యజ్ఞమనే పదానికి అర్థం తెలీదు. యజ్ఞమనే పదానికి అర్థం జాగ్రత్తగా తెలుసుకుంటున్నపుడు మనం కాస్త జాగ్రత్తగా ఒక దృఢమైన అవగాహనకు రావాలి. అదేమిటంటే మొత్తం భారతీయ సంస్కృతి, మొత్తం భారతజాతి, విశ్వానికి అందించినటువంటి రహస్యమైనటువంటి అందరికి తెల్సినటువంటి రెండు విపరీత అర్థాలు కల పదాలు,అందరికీ తెల్సిన రహస్యమైన ఆ విషయము ఏమిటంటే అటు గాయత్రి ఇటు యజ్ఞం. ఈ రెండు వుపయోగించుకోవడమే భారతీయత. ప్రపంచానికందించిన గొప్పవరం ఈ నాణానికి బొమ్మా-బొరుసు రెండూ ఎలా అవసరమో అలాగనే గాయత్రి–యజ్ఞం ఈ రెండూ అవసరము. ఈ రెంటినీ వేరు చేయలేము గాయత్రిని వేరుగాచేసి, యజ్ఞాన్ని వేరుగా చేసి, ఈ రెంటిని వేరు చేసేటటువంటి విపరీత పోకడలు రావడంవల్ల భారతీయ సంస్కృతి నిర్వీర్యం అయిపోయింది ఈ భారతీయ సంస్కృతిని అర్థం చేసుకోవడానికి నిన్న

అగ్నినీ, సూర్యుణ్ణి, చంద్రుణ్ణి— ఎలా ఉపయోగించుకోవాలో- మనం చర్చించు కుంటున్నాము.

భారతీయ వైజ్ఞానికత- భారతీయ ఋషులు దర్శించినటువంటి అద్భుతమైనటువంటి జ్ఞానాన్ని — మూడు పదాలలో పొందుపరచి వదలివేశారు—అగ్ని, సూర్యుడు, చంద్రుడు ఈ మూడు పదాలయొక్క అంతరార్థాన్ని ఇప్పుడు Electricityలో మూడే వున్నాయి Positive negitive, nutral. ఈ Positive, Negitive, Nutral అనే పదాలనే ఉపయోగించుకొని T V అయినా Operate అవుతూ వుంటుంది, Frize అయినా Operate అవుతూ వుంటుంది. Heater అయినా Operate అవుతూ వుంటుంది, Fan అయినా operate అవుతూ వుంటుంది Computer అయినా operate అవుతూ వుంటుంది — ఏదయినా అంటే ఈ Positive, negitive nutral లను correctగా అవగాహన చేసుకుంటే - ఏ విధంగా Electricityని ఉపయోగించుకొనగలుగుచున్నామో —అదే విధంగా భారతీయ వేదవాఙ్మయాన్ని.-భారతీయ సంస్కృతిని భారతీయ సంస్కార పద్ధతిని ప్రపంచమంతటా వ్యాపింపచేయటానికి- ఈ ప్రపంచమంతటా వ్యాపింపచేయటానికి అనే పదాన్ని వాడునపుడు కూడా — మీరు ఒక విషయాన్ని అర్థం చేసుకోండి - ఇక్కడ మనము ఒక రాజ్యాన్ని సంపాదించుకోవడానికి— భారత దేశము మాత్రమే ప్రపంచానికంతటికి సర్వోత్కృష్టమైనది అనే భావన లేనే లేదు. Edison అనే అతను ఒక Bulb కనిపెడితే —ఆ Bulb మనము ఇక్కడ ఉపయోగించుకొంటూ వుంటే- 'Edison' అనే అతను Bulb కనిపెట్టాడు అని తెలియదు గురుత్వాకర్షణ శక్తిని ఉపయోగించుకొని 'Right Brothers, Airo-planeని కనిపెడితే- ఈనాడు Airoplaneలో ఎగిరేటటువంటి వారికి "Right Brothers" Aeroplane కనిపెట్టారు అని తెలియదు అలాగే వేద వాఙ్మయంలో ఉన్నటువంటి, జ్ఞానాన్ని విజ్ఞానాన్ని ప్రపంచమంతటా అందింప చేయటానికి ప్రయత్నం చేస్తున్నాము తప్ప భారతీయను ప్రపంచంలోకితీసుకు వెళ్ళడానికి మనం ప్రయత్నంచేయడం లేదు. ఈ దిగ్విజయ యాత్రలో ఇది యొక విశుద్ధమయినటువంటి విజ్ఞానము. ఏ విధంగా విజ్ఞానము ఎవరి సొత్తూ కాదో—ప్రపంచంలో ఎవరు దాన్ని వుపయోగించుకోవాలనుకుంటున్నారో-అందరూ-ప్రతి రాష్ట్రంలో—ప్రతి దేశంలో -వుపయోగించుకుంటున్నారో- అదే విధంగా—ఈ వైదిక విజ్ఞానాన్ని-సూర్య చంద్ర, అగ్నియాత్మకమైన ఈ త్రిపాద విజ్ఞానాన్ని-మనం అందచేసే ప్రయత్న

ములో—మొట్టమొదటి అగ్నిని గురించి తెలుసుకుందాం మనం. అగ్ని అనే పదాన్ని—మనం దేనికి వుపయోగించుకుంటున్నామో తెలుసు కదా! అగ్నియొక్క చాలా గొప్పదయిన ఒక్క మొదటి లక్షణం ఏమిటంటే—అది వేడిని కలుగ జేస్తుంది.

ఎక్కడ అగ్ని వున్నదో అక్కడ వేడి వుంటుంది. అలాగే మానవుని యొక్క జీవితంలో స్ఫూర్తి ఉత్సాహము అనేటటువంటి వేడిలేకపోతే—ఈనాడు ఉన్నటువంటి మానవజాతి కనుపిస్తుంది. దేనికీ వుత్సాహము లేదు—అలాగా అంటారు. నాకు చాలా బాగా గుర్తు—ఇదివరకు పండుగలు వస్తూ వుంటే—ఒక రెండు, మూడు నెలల ముందే నేను Plan వేసుకుంటూ వుండేవాడిని. అహా!దీపావళి వస్తుందా—దీపాలు అక్కడ పెట్టాలి ఇక్కడ పెట్టాలి అని. ఇప్పుడు పండుగలు వస్తున్నాయంటే భయమేస్తుంది—విసుగేస్తుంది-ఉత్సాహం పోయింది వుత్సాహము అనేటటువంటి అగ్నిలేదు—ఉత్సాహము అనేది అగ్నియొక్క ఒక లక్షణము. రెండవది అది ఏమిటీ అంటే అది ఎప్పుడూ ఊర్ధ్వముఖంగానే వుంటుంది. ఒక అగ్గి పుల్లను వెలిగించి— దానిని క్రింది వైపుకు పెట్టినా అగ్ని దిశమాత్రం పైముఖం గానే వుంటుంది. అంచేత మనం ఎటువంటి పరిస్థితుల్లో వున్నాకూడా —బాహ్య జగత్తులో ఎలాంటిపరిస్థితుల్లో వున్నా కూడా మన దిశ ఎప్పుడూ పైవైపుకే వుండాలి —ఆదర్శాలవైపుకే వుండాలి అనేటటువంటి సంస్కారము— అగ్నిమంటని చూచి నేర్చుకోవాలి అగ్నికి ఇంకో లక్షణం కూడా వుంది

అగ్నిని ఎందులో వేస్తామో—ఆ పదార్థం అగ్నిలాగే మారిపోతుంది. ఆఖరుకు యినుము లాంటి పదార్థం కూడా. Blastic Furnaceలో ఏమి అగ్ని సంపర్కంలోకి వస్తే—అది గూడా Ball of Fire క్రింద మారిపోతుంది. అంచేత అగ్ని యొక్క గొప్పతనము ఏమిటీ అంటే—ఆది తనలాగా యితరులను మార్చి వేయ గలదు. అగ్ని యొక్క ఈ లక్షణాలను ఉపయోగించుకోమని—మన వేద వాఙ్మయంలో వాళ్ళు అనేకమయినటువంటి సూక్తులు చెప్పుకొచ్చారు.—అగ్ని సూక్తులు ఈ అగ్ని సూక్తులు వుపయోగించుకుంటూ యజ్ఞ విజ్ఞానాన్ని develop చేశాము మనం. ఈ యజ్ఞ విధానాన్ని develop చేసినటువంటి విధానంలో—మానవ శరీరంలో వున్నటువంటి—విశిష్టమయిన అగ్నిని గురించి చెప్తూ—ఏది అయితే విష్ణువు నాభి నుండి వుత్పత్తి అయినదో—అదే యజ్ఞము, అదే బ్రహ్మ, విష్ణువే

యజ్ఞము—అని చెప్పారు వాళ్ళు. యజ్ఞో విష్ణుః విష్ణో భువన్యనాభిః అనేటటువంటి వేదసూక్తం వుంది ఈ నాభి అనే పదాన్ని liberal గానే తీసుకుంటే—మన శరీరంలో ఎక్కడయితే నాభిస్థానం వున్నదో—అక్కడ అగ్ని వున్నది. ఇప్పటికి కూడా కడుపు మండుతున్నది అంటూ వుంటాం. అనేక రకాల అర్థాలలో— Gastic trouble వల్ల కావచ్చు—మనకు యింకొకటి ఏదయినా పొందలేదు అనికావచ్చు ఈ అగ్నిని ఎలా ఉపయోగించుకోవాలి? మన నాభి వద్ద వున్నటు వంటి అగ్నిని ఎలా వుపయోగించుకోవాలి? అనే శాస్త్రం మొత్తం కూడా అగ్ని విద్య క్రింద వస్తుంది. దీనినే కుండలినీ విద్య అని కూడా అన్నారు. కాని ఈ కుండలినీ విద్య అగ్ని విద్యను గురించి తరువాత చదువుకుందాము. ఈ సూర్య విద్య, చంద్ర విద్యకి వద్దాము మనము అగ్ని అంటే తెలుసుకున్నాము గదా— మన శరీరంలో నాభివద్ద వున్నటువంటి విశిష్టమైన ప్రాణవాయువు సమాన వాయువు అనేటటువంటి అగ్ని—జఠరాగ్ని—ఏ విధంగా వుపయోగించుకోవాలో- దానివలన మన శరీరములో వచ్చేటటువంటి మార్పులు-దానివలన మన సమాజంలో వచ్చేటటువంటి మార్పులు తెలిసికొనుట అనేది—"అగ్ని సూక్తం" చెబుతుంది.

సూర్యుడు—కుడి కన్ను అన్నారు. సాధారణంగా మనందరికీ తెలిసిన విషయమేమిటంటే—కుడిభాగం ఎక్కువ active గా ఉంటుంది. ఎడమచేయి కన్నా కుడిచేయి కొంచెం ఎక్కువ strongగా వుంటుంది ఎడమకన్ను కన్నా కుడి కన్ను ఎక్కువ Powerfullగా వుంటుంది సర్వేంద్రియాణాం నయనం ప్రధానం అంటూ. అందులో కుడి కంటికి ప్రాధాన్యత యిచ్చి-ఆ కుడి కన్నును సూర్యుడు అన్నారు. వేదాలలో గూడా సూర్యుడే జగత్తు యొక్క చక్షువు— కన్ను అన్నారు. ఈ సూర్యుడు మన శరీరంలో ఎలా పనిచేస్తాడో అనేది తెలుసు కోవడానికి మన ఋషులు చెప్పింది ఏమిటీ అంటే—కుడి ముక్కు మీరు కాస్త జాగ్రత్తగా చూడండి—దానినే పింగళనాడి అంటాము. ఆ పింగళానాడిని కనుక మీరు వుపయోగించుకోవడం నేర్చుకుంటే — బాహ్యజగత్తులో వున్నటువంటి సూర్యుణ్ణి మీరు ఉపయోగించుకోగలుగుతారు అన్నారు.

ఇది ఎలా ఉపయోగించుకోవాలి, ఏమిటి అనేది మెల్ల మెల్లగా చర్చించు కుందాం ముందు మీరు Fundametals ఆధారం తెలుసుకోగలిగితే సగంమీరు తెలుసుకున్నట్లే-భారతీయ ఋషి సాంప్రదాయము, వేద వాఙ్మయము, వేద విజ్ఞా నాన్ని, ఇది ప్రపంచానికి ఈనాడు 1895 నుంచి 2000 సం॥లోపు ప్రపంచానికి

అందచేయాలి అనేటటువంటి సంకల్పంతోనే ఈ అశ్వమేధ యజ్ఞాలు జరుగు తున్నాయి. ఈ విజ్ఞానాన్ని అందించటానికి ఇది కేవలము Thiriticalగా lecture యిచ్చి వెళ్ళకుండా. వీటిని యెలా ఉపయోగించుకోవాలో చెప్పబడుతుంది ఈ సంవత్సర కాలంలో—అంచేత అగ్నిని మనం అర్థంచేసుకున్న తరువాత మన కుడి ముక్కుద్వారా శ్వాస యెలా లోపలికి వెళుతుంది, బయటకు యెలా వస్తూంది అని తెలుసుకొనే టటువంటి విజ్ఞానాన్ని 'సౌర విజ్ఞానము' — ఆధ్యాత్మిక విజ్ఞానంలో ఆదిత్య హృదయం అను పేరుతో-యుద్ధంచేసి రావణాశురుణ్ణి యెలా గెలవాలో తెలియని అయోమయ అవస్థలో యున్న రామునుకి - ఈ ఆదిత్య విజ్ఞానాన్ని— ఈ సూర్య విజ్ఞానాన్ని అందజేసి - ఎలా గెలవాలో చెప్పుకుంటూ - అక్కడ కూడా 'త్రిగుణితం జత్వా' మూడు సార్లు దీన్ని ఉపయోగించాలి. త్రిపాదంగా ఉపయోగించాలని అగస్త్యుడు చెప్తూ వుంటాడు. మొత్తం వేదవాఙ్మయంలో మూడు, మూడు అను పదం Repeated గా వస్తుంది — దాన్ని కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోండి. ఈసూర్య విజ్ఞానాన్ని అర్థం చేసుకున్న తర్వాత— అంటే మనం కుడివైపు వస్తున్న శ్వాసను - పింగళానాడిని అర్థం చేసుకున్న తర్వాత - మన నాభిలో వున్నటువంటి అగ్ని విద్యను అర్థంచేసుకున్న తర్వాత మన ఎడమవైపు వున్నటువంటి సోమనాడిని చంద్రనాడని అర్థం చేసుకుంటే— చంద్ర సూర్య అగ్ని విద్యాత్మక మయినటువంటి - ఈ త్రయీ విద్యను మీరు అర్థంచేసుకుంటే—దీనినే రాజవిద్యా, రాజగుహ్యమని, భగవద్గీత యొక్క 9వ అధ్యాయములో చెప్పబడి వుంది. అంచేత ఈ భగవద్గీత పారాయణం చేయడం మంచిదే—ఈ భగవద్గీత పారాయణం జరిగి వుండకపోతే-ఈ భగవద్గీత ఈనాడు మనకు లభించి వుండేది కాదు. కాని ఇప్పుడు మనము విజ్ఞానాత్మక దృష్టితో దీనిని అర్థం చేసుకుని- వీటిని యెలా వుపయోగించుకోవాలో తెలిపేటటువంటి సత్యాలను అర్థంచేసుకోవడానికి ప్రయత్నం చేస్తూ - సూర్యుడివల్ల మనము పొందగలిగే మొత్తము విజ్ఞానాన్ని - గాయత్రీ మంత్రము యొక్క మొదటి చరణముద్వారా అందజేశారు ఈ మొదటి చరణములో మన మందరము - మనము మన పిల్లలందరికి చెప్పవలసిన రహస్య మేమిటంటే- తత్ సవితుర్వరేణ్యం- ఆ సూర్యుడి వలె శ్రేష్ఠమయినటువంటి జీవితం మనది కావాలి సూర్యులలో వున్నటువంటి ముఖ్యమయిన మూడు లక్షణాలను గుర్తించుకొని — ఆ విధమయినటువంటి అల

వాట్లను మనము చేసుకుంటే—భౌతిక జగత్తులో మీరు కోరింది ఖచ్చితంగా జరిగి తీరుతుంది అనేటటువంటిది ఋషులు చెప్పినటువంటి ఒక Formula. చూడండి సూర్యుడు యొక్క ముఖ్య లక్షణము ఏమిటో. సూర్యుడి యొక్క చాలా గొప్ప లక్షణము ఏమిటంటే- చలికాలమయినా, ఎండాకాలమయినా ఏదయినాసరే—ఒక నియమ బద్ధమయినటువంటి క్రమంగా- చెప్పిన టైమ్‌కు ఉదయిస్తాడు. అలాగే మనమందరంగూడా మన జీవితంలో కాలాన్ని సవ్యంగా ఉపయోగించుకుంటూ- Regularity అనేటటువంటి దాన్ని కనుక మనము ఉపయోగించుకో గలిగితే— సూర్యుడియొక్క మొదటి లక్షణం మన జీవితంలోకి వచ్చినట్లే—2001వ సం॥ జనవరి 8వ తారీఖు సూర్యుడు ఎన్ని గంటలకు ఉదయిస్తాడో మనము చెప్ప గలము కాని 6 గం॥ మీటింగు జరిగితే — ఖచ్చితంగా ఆ మీటింగు 6 గంటలకు మొదలెట్టరు అని మనము ఖచ్చితంగా చెప్పగలుగుతున్నాం-దాన్ని గర్వంగా Indian Standard Time అని కూడా చెప్పుకుంటాము, మన మీటింగ్సులో వాటిలో. అంచేత సూర్యుడినుండి మనము మొట్టమొదట నేర్చుకోవలసిన విజ్ఞానము ఏమిటంటే- Punctuality కాలము గడచిపోతూ వుంటుంది. కాలముగడచిపోతూ వున్నప్పుడు చెప్పిన టైమ్‌కు మనము ఆచరణ చేయలేకపోతే — రెండు తప్పులు చేస్తున్నాము—అక్కడ-ఒకటి మన కాలానికి మనము విలువ కట్టుకోలేక పోయాము అని అర్థము—రెండవది యింకొకళ్ళ కాలానికి మనము విలువ ఇవ్వలేకపోయాము అని అర్థము. ఒక Meeting పెట్టుకున్న తర్వాత ఆ Meeting 8 1/2 గంటలు లేటుగా మొదలయితే — ఆ 8 1/2గంటలు అక్కడ ఆ వ్యక్తులు వెయిట్ చేస్తూ వున్నారు. అంటే- 8 1/2 గంటల కాలాన్ని వాళ్ళు ఎందుకూ పనికిరాకుండా వినియోగించుకున్నట్లేగదా! ఈ విశాలమయినటువంటి భూ ప్రపంచంలో మానవ జీవితంలో- సగం కాలం ఎట్లాగూ మనం నిద్రకు ఉపయోగిస్తున్నాము. మిగతా సగం మనం ఏదేదో పనులకు ఉపయోగిస్తూ వుంటే—మిగిలిన సగం కాలాన్ని కూడా అసలెందుకు ఉపయోగిస్తున్నామో తెలియకుండా, కాలాన్ని వ్యర్థం చేసుకోకుండా- కాలాన్ని నిరంతరము ఏదో ఒక పనికి సవ్యమయినటువంటి పనికి ఉపయోగించుకోండి — అనేటటువంటి First Principle మనము భౌతిక జగత్తులో నేర్చుకోవాలి- సూర్యుడి దగ్గర్నుంచి — నేను సూర్యోపాసకుణ్ణి అని చెప్పి-సూర్యుడు ఉదయించినా నిదురపోతూ — సూర్యుడు లేచిన తర్వాత—దాక మనము— ఎప్పుడో ఏదో చేసుకుంటూ ఏదో మనం— సంధ్యావందనం

ముగించుకున్నాం— అనేటటువంటి భావన చేసుకుంటే— సూర్యుడి యొక్క లక్షణము— సూర్యుణ్ణి మనము– ఉప– ఆసనము చేయడము లేదు— సూర్యుడు దగ్గఱ మనము కూర్చోవడము లేదు— సూర్యుడి యొక్క మొదటి లక్షణం ఇది— Punctuality ఏ పని చేసినా Correct time కు చేయండి. అనుకున్న time కు చేయండి రెండో లక్షణం ఏమిటంటే– Regularity. ఈవేళ ప్రొద్దున ఉదయించాడు గనుక— రేపు కూడా ఖచ్చితంగా సూర్యుడు ఉదయిస్తాడు— అన్న నమ్మకం వుంది మనకు ఈనాడు. కాని ఇవ్వాళ పాఠానికి వచ్చిన తరువాత రేపు పాఠానికి వెళ్ళుతాడా వెళ్ళడా చాలా doubt full చాలాసార్లు ద్వితీయ విఘ్నం రాకూడదు బాబోయ్ మాస్టారు అని చెప్పి– అనేక మంది Students రకరకాల పరిస్థితుల్లో– మొదటి రోజు వచ్చిన తరువాత—రెండవ రోజు చాలా కష్టపడి వస్తారు—మూడవ రోజు వచ్చిన వాళ్లను యింతవరకు చూడలేదు— అనేకసార్లు ద్వితీయ విఘ్నానికి యిచ్చిన ప్రాముఖ్యత– నిరంతర విఘ్నానికి ఎందుకు యివ్వడము లేదో తెలియడం లేదు. ఇది రెండవ లక్షణం Punctualityతో పాటు Regularity. సృష్టి ఆది నుంచి ఈ కల్పాంతము వరకు కూడా సూర్యుడు అదే ప్రకారం ఉదయిస్తూ ఉంటాడు— అస్తమిస్తూ వుంటాడు— ఎక్కడ ఒక్క క్షణం కూడా ఆలస్యం కనిపించదు అలాగే మనము నేర్చుకొనవలసినటువంటి విషయాలను— మన జీవితాన్ని కూడా Punctualగా కాకుండా నియమితంగా ఒక Regular flowలో చేసుకువెళ్ళేటటువంటి Plan జీవితంలో మనము వేసుకుంటే సూర్యోపాసకులం అవుతాం తప్ప సూర్య మంత్రాలను— ఓం ఘృణి సూర్యా ఆదిత్యోం– అనే అష్టాక్షరీని జపించానంటే– సూర్యోపాసన కాదు— అది· ఈ రెండూ అయిన తరువాత సూర్యుడికి ఇంకో లక్షణం వుంది. 'ద్వాదశ ఆదిత్యులు' అని మనం ఎప్పుడూ చెప్పుకుంటూనే ఉంటాం ఈ ద్వాదశాదిత్యులు అని చెప్పుకుంటామే తప్ప నెలకు ఒకసారి సూర్యుడు 30 రోజుల పాటు ఒకే రాశిలో వుంటాడు. ఆ రాశిలో వున్నప్పుడు— సూర్యుడికి ఒక విశిష్టమైనటువంటి లక్షణాలు వుంటాయి. సూర్యుడి యొక్క Punctualty, Regularity ఎలాగైతే వుపయోగించుకుంటున్నామో— ఒక్కొక్క రాశిలో ఉన్నటువంటి సూర్యుడి యొక్క లక్షణాలను వుపయోగించుకొని, తదనుగుణంగా మన జీవితాన్ని మార్చుకునేటువంటి విద్యను మనం మర్చిపోయాము. ద్వాదశాదిత్యులు అని మనం చెప్పుకుంటామే తప్ప. ఆ ద్వాదశాదిత్యులు యొక్క లక్షణాలేమిటి— అది Petre Whiter వ్రాసినటువంటి Indian

Express లోనో ఎక్కడో పడినటువంటి Monthly—forcasteలో మన రాశికి ఫలితం ఎలాగుందో చూచుకుంటామే తప్ప— సూర్యుడు ఆ రాశిలో వుంటాడు కాబట్టి అది మన రాశి అయింది- సూర్యుడు ఆ రాశిలో వున్నప్పుడు జగత్తు ప్రపంచం ఎలా జరుగుతుంది, ఎలా తిరుగుతుందో అన్నది మనం తెలుసుకుని ఈ ద్వాదశాదిత్యకమయినటువంటి ఈ ద్వాదశ జ్యోతిర్లింగాలు అని ఏదయితే మనం చదువుతూ వుంటామో దాని యొక్క లక్షణాలు తెలుసుకుంటే— గాయత్రీ మంత్రం యొక్క 'తత్ సవితుర్వరేణ్యం' అనేటటువంటి పదాన్ని అవగాహన చేసుకొని, జీవితంలో వుపయోగించుకొని గాయత్రీ మంత్ర సాధకులము అవుతామే తప్ప— తత్ సవితుర్వరేణ్యం- తత్ సవితుర్వరేణ్యం అనుకుంటూ వుంటే దానిలో వున్నటువంటి రహస్యాలను తెలుసుకోకుంటే గాయత్రీ యొక్క మొదటి పాదము అర్థము మనకు తెలియదు అంచేత సూర్యుడు— కుడి కన్ను— పింగళానాడి అనేటటువంటి పదాలకు మొత్తము మీద ఏ అర్థాలు చెప్పుకున్నా- యోగశాస్త్ర పరంగా కుండలినీ జాగరణపరంగా— అది కూడా మన ఋషులందించిన దాంట్లో వుంది— దాన్ని గూడా మనం వీలయితే చర్చించుకుందాం. కాని ఈనాడు మనకు ఇతరులకు అందించవలసిన విజ్ఞానము ఏమిటంటే- ఏ భారతీయుడు కూడా నియమితత, Punctuality ఖచ్చితమయిన time పాటించుట- ప్రతీసారి అదే పనిని సవ్యంగా చేయుట అని— దాని తరువాత ద్వాదశాదిత్యులు సూర్యుడు ఏ రాశితో వున్నప్పుడు— ఏ నెలలో ఎలా ప్రవర్తిస్తాడో తెలుసుకొనుట- అంటే ఏమిటి ఎండాకాలంలో ఒకలా ప్రవర్తిస్తాడు, శీతా కాలంలో ఒకలా ప్రవర్తిస్తాడు, వర్షా కాలంలో ఒకలా ప్రవర్తిస్తాడు- సూర్యుడు— ఇది మనము తెలుసుకోవాలి— ఇది కేవలము విత్తనాలు నాటే వాళ్ళు మాత్రమే కాస్త ఆలోచిస్తున్నారు. ఎండాకాలము వెళ్ళిపోయిన తరువాత వర్షపు తొలకరి చినుకులు పడిన తరువాత— భూమిని దున్ని- మనం విత్తనాలు వేస్తేనే పంట వస్తుంది తప్ప— నాకు చాలా Mood వచ్చేసింది Master ఇక అంతే మీరు చెప్పారు— కష్టపడమన్నారు కనుక— ఈ వేళ వెళ్ళి నాగలి తీసుకొని దున్నేసి విత్తనాలు నాటేస్తాను అని ఎవ్వడూ అనడు. కాని ఆధ్యాత్మిక జగత్తులో ఆ తప్పెందుకు చేస్తున్నామో మనకు తెలియదు. ఏ Common sense అయితే మనం నిత్య జీవితంలో వుపయోగించుకుంటున్నామో- ఆధ్యాత్మికత వచ్చేటప్పటికి Common sense ఎగిరిపోతుంది. దానికి కూడా ఒక పద్ధతి వుంది. దానికి కూడా ఒక సమయము వుంది. ఆ సమ

యాన్ని తెలుసుకునేటటువంటి విద్య సూర్యాత్మా జగతత్ ప్రకశ్యా– ఆ సూర్యుడు యొక్క ఆత్మను, జగత్తు యొక్క నేత్రాన్ని మనం అర్థం చేసుకుంటే– ఈ మూడు లక్షణాలు వున్నటువంటి విద్యార్థి కాని– ఈ మూడు లక్షణాలు వున్నటు వంటి ఆఫీసరు కాని— వాడు జీవితంలో ఎందుకు శశ్విస్తాడు— Regularity, Punctuality తరువాత ఏమిటి practicability ఏ ఋతువులో ఎలా ప్రవర్తిం చాలి ? ఆఫీసరొస్తే ఎలా ప్రవర్తించాలి ? అటెండరొస్తే ఎలా ప్రవర్తించాలి ? అది తెలుసుకోవడమే– ఋతువులు తెలిసికోవడమంటే అనుకూల పవనాన్ని తెలిసికోవడమంటే, ఈ మూడు లక్షణాలు ఖచ్చితంగా నేర్చుకోండి, అనేటటు వంటిది గాయత్రీ మంత్రం యొక్క మొదటి చరణము— సూర్యుడి యొక్క అర్ధము. కాని అగ్నిలో కూడా మూడు అర్థాలున్నాయి. అది మళ్లా మనం పట్టించుకోము.

అగ్నిని ఉపయోగించుకోండి—సమూహాగ్ని మన నాభిలో వుంది—దాన్ని వుపయోగించుకోండి అని చెబుతారే తప్ప—అగ్నిలో మూడు అర్థాలున్నాయి— పావక, పవమాన, శుచి—అనే మూడు అగ్నిలున్నాయి ఈ మూడు రకాల అగ్నులను ఉపయోగించుకోవాలి అనే దాంట్లో—ఈనాడు మనకు కనిపిస్తున్న Civilisation అంతా కూడా—పావక అగ్ని లక్షణాన్ని మాత్రమే ఉపయో గించుకుంటుంది పవమాన అగ్ని శుచి అనేటటువంటి అగ్ని వున్నాయని కూడా మనకు తెలియదు. శ్రీ సూక్తంలో ఒకటి వస్తుంది. "ఏ శుచిత్ ప్రేత్వా భూత్వా జ్విహమాద్యాత్వ మస్మహ. శుచి అనేటటువంటి అగ్నిలో నేతి అనేటటువంటి ఆహుతి వేయండి, అని వుంటే మనం ఏమని అర్థం చేసుకున్నామంటే—సమిధను కాస్త వెలిగించి అగ్గిపుల్ల గీచి వెలిగిస్తూ వచ్చేటటువంటి అగ్ని. అగ్గిపుల్ల గీచి వెలిగించేటటువంటి అగ్నిని—పావక అగ్ని అంటాము ఆ అగ్ని వుపయోగించు కోమని చెప్పలేదు శ్రీ సూక్తం ఫలించబోవటానికి శ్రీ సూక్తాన్ని చదివిన తరు వాత కూడా—శ్రీ సూక్తంలో చెప్పబడునటువంటి అద్భుతముయిన ఫలితాలు రాకపోవడానికి కారణమేమిటంటే— శ్రీ సూక్తాన్ని ఉపయోగించుకోదలచిన భార తీయ వేద వాఙ్మయ జ్యోత—పావక అగ్నిని ఉపయోగించుకోకూడదు అట్లా వ్రాశారు—'యస్సుచి ప్రేతో భూత్వా'—జుహో యాద్యాత్వ మస్వహం'. శుచి అనేటటువంటి అగ్నిని—నేతితో వుపయోగించుకుంటే—మళ్ళా మనమక్కడ— ఆవునెయ్యా, డాల్డాయా–అని doubt వస్తుంది–మనం–అసలు ఆ నెయ్యి గురించి

మాట్లాడలేదు. అక్కడ–నెయ్యి అనే పదానికి–స్నేహము అని కూడా అర్థం వుంది. స్నేహము ఒక మానసికమయినటువంటి భావన

అంచేత పావక అగ్ని—ఈనాడు మనము వుపయోగించుకొంటున్నటు వంటి అగ్ని–వంటశాలలో ఉపయోగించుకొంటున్నటువంటి అగ్నిని–పావక అగ్ని అంటాము దీనివల్ల ఆహారము మనము వుపయోగించుకుంటాం తినలేనటువంటి ఆహారాన్ని ఉడికించుకుని–తినటానికి వీలుగా—పచ్యముగా చేసుకుని–అరగటానికి వీలుగా చేసుకునే అగ్ని-పావకాగ్ని. ఈ పావకాగ్నిలో ఇంకొక లక్షణం కూడా ఉంది పదార్థాన్ని దేన్నయినా అందులో వేస్తే శుచిగా ఉన్నటువంటి పదార్థాన్ని బయటకు తీసి— అశుచిని దూరం చేస్తుంది Metting అంటాం గదా—ఈ మొత్తం Metalergy వుందే—లోహాలను తీసుకు వెళ్లే చలన ప్రక్రియలో కూడా ఈ అగ్ననే మనము వుపయోగించుకుంటాం. అంచేత అగ్నిద్వారా శుద్ధీకరణ ప్రక్రియ జరుగుతూ వుంటుంది—పదార్థాలది. దీని తరువాత పవమానాగ్ని అని ఉంది. ఈ పవమానాగ్నిని సూర్య శక్తి అని కూడా అంటాము ఈ సూర్యశక్తి యొక్క లక్షణము ఏమిటీ అంటే–కొన్ని పదార్థాల మీద పవమానాగ్ని—అంటే సూర్యశక్తి ఎప్పుడయితే పడుతుందో–ఆ పదార్థము-'ఏకోహంబహుశ్యామంగామారు తుంది.' వేద వాఙ్మయంలో ఉపనిషత్ Quatationsలో రకరకాలుగా ఈ పదం వింటాంగాని–ఈ ఏకోసాం బహుశ్యామం అనేది మన కళ్ళముందే నిత్యము జరుగు తుంది అనే రహస్యాన్ని మనం చూడటం లేదు Science అంటే Practical demonstration చేయగలిగేటటువంటి విద్య మనం చేసి కళ్ళముందు చేసేటటు వంటి విద్య.

ఈ పవమాన అగ్ని ఎక్కడ మనకు కన్పిస్తుంది అంటే ఒక విత్తనాన్ని నాటుతాం మనం. ఒకే ఒక విత్తనాన్ని నాటుతాం. ఉదాహరణకు ఒక మామిడి టెంకను నాటినామనుకోండి. విత్తనాన్ని నాటిన తరువాత నీళ్ళు పోస్తాం—మట్టిలో నాటి పెడతాం. నాటిపోసిన తరువాత–సూర్యకిరణాలు సంయోగం చెందినప్పుడు అది వృక్షంగా మారి—ఒకే విత్తనము అనేక విత్తనములుగా మారుతుంది. రూపొందిన తరువాత మళ్ళా ఆ విత్తనాన్ని నాటామనుకోండి—మళ్ళా ఆ విత్తనం నుంచి అనేక విత్తనాలు వస్తూ వుంటాయి ఈ అనేక మామిడి విత్తనాలు ఎన్ని పొందవచ్చు ఒక మామిడి టెంకతో–లెక్కలేదు. నాటుకుంటూ పోవడమే—ఆ చెట్టును కాపు కాయించడమే–కాపుకాయించిన తరువాత మళ్ళీ వస్తూ వుంటాయి—

ఏకోహం బహుశ్యామా అనేటటువంటి లక్షణము సూర్యుడులో వున్నది. సౌర శక్తిలో వున్నది. అంచేత పాండవ వనవాసంలో ఆహారం ఎలాగా మాకూ అంటే —శ్రీకృష్ణుడు గాబరాపడకు అన్నాడు. సూర్యుడి దగ్గరినుంచి తెప్పించాడు అక్షయపాత్ర. సూర్యుడు దగ్గర నిజంగా అక్షయపాత్ర వుంది ఈ అక్షయపాత్ర కాకుంటే ఏమిటి—మీరు ఒక టెంకెను నాటితే—అనంతంగా మామిడిచెట్లు వస్తూనే వున్నాయి——మీ కళ్ళముందు——దానికోసం ఎక్కడకో దర్శనం చేసుకోవాలి—— ఏదో సాధన చేయాలని లేదు చూచే కళ్ళు వుండాలి అంతే

ఈ అనంత మయినటువంటి సౌర విజ్ఞానాన్ని ఎలా ఉపయోగించుకోవాలి—అనేటటువంటి ప్రశ్న—1876-77లో ఇంగ్లండులో ఒక మారుమూల వున్నటు వంటి ఈషోటెల్ బుక్ షాపు-ఈషోటెల్ బుక్ షాపు అంటే యోగ పుస్తకాలు అవి అమ్మేటటువంటి—ఒక చిన్న బుక్ షాపు వుంది. Englandలో - London మారు మూలలో-అక్కడ ఒక వ్యక్తి—ఏదో పుస్తకము కొనుక్కోవడానికి వెళ్ళాడు వాడు. ఏదో పుస్తకాన్ని కొనుక్కోవడానికి వెళితే- The Secret Science of Solar-Race అనేటటువంటి పుస్తకము దొరికింది. ఇది చదివిన దగ్గఱ నుండి ఆ పుస్తకము ఎక్కడయినా దొరుకుతుందేమోనని ప్రయత్నము చేస్తూనే వున్నాను-నాకు దొరకలేదు వీలయితే మీరు Try చేయండి ఎక్కడయినా దొరు కుతుందేమో. కాని విజ్ఞానము అంటే—మీరు ఒకటి గుర్తుంచుకోండి—పుస్తకాలలో వుండదు—ప్రకృతితో ఉంటుంది అంచేత నేను చెప్పాను కదా అని పుస్తకాల షాపులకు వాటికి పరిగెత్తకండి. The Secret Science of Solar Energy మీకు తెలియాలి అంటే—ఎదురుగుండా చూచుకోండి. సూర్యుడు వున్నాడు—— ప్రకృతి ఉంది-మనమూ ఉన్నాము ఆ సూర్య విజ్ఞానాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నం చేయండి.

ఏకోహం బహుశ్యామా - ఈ విజ్ఞానాన్ని తెలుసుకున్న వ్యక్తి గురు పీఠాన్ని వహించడానికి అర్హత ఉన్నదీ అని-ఆధ్యాత్మికత చెపుతుంది. ఒక Christ అయినా, ఒక సత్యసాయిబాబా అయినా, ఒక షిర్డీ సాయిబాబా అయినా— వీళ్ళెవరయినా సరే—వీళ్ళందరి జీవితంలో మనం ఒక విచిత్రం చూస్తాం. Christ జీవితంలో మూడు చేపలు, ఏడు రొట్టెలు ఉంటే, దాన్ని అందరికి పంచి పెట్టాడట-కొన్ని వేలమందికి. అందరి ఆకలి తీరింది Multiplication— ఏకోహం బహుశ్యామా అనేది—ఎలా చేయాలో అనేటటువంటి విద్య-ఈ సౌర

విద్య-ఇది కూడా గాయత్రి విద్యయే. సౌర విద్యకు ఆధారము గాయత్రియే. ఈ సౌర విద్యను ఎక్కడ నుంచి నేర్చుకుంటారు, ఎలా నేర్చుకుంటారు మీ కళ్ళ ముందు చెట్లు చెప్తూనే ఉన్నాయి. అందువల్లే-బోధివృక్షం క్రింద-అవగాహన వస్తుంది. చెట్ల క్రింద సాధన చేయండి అని చెప్పటంలో అర్థం ఏమిటీ అంటే-విత్తనం ఏ విధంగా వృక్షంగా మారి-ఏకోహం బహుశ్యామగా అవుతుందో అది కళ్ళారా చూడండి మీరు-చూచిన తరువాత-భూమిలో నాటినటువంటి విత్తనంలో ఏఏ మార్పులు రావడం వల్ల-ఆ విత్తనం వృక్షంగా మారి-పత్రం, పుష్పం, ఫలం-మూడు చెప్తాడు రాజవిద్య రాజగుహ్యం-అంచేత దేవుడికి ఆకు లిచ్చయినా సరే-దేవుడు మీద ఆకులు పోసెయ్యండి-దేవుడు మీద నీళ్ళు పోసెయ్యండి-దేవుడు మీద ఫలం పోసెయ్యండి-అనే అవగాహన ఉంది తప్ప-విత్తనం నుంచి-పత్రం, పుష్పం, ఫలం — దాని తరువాత ఫలంలో ఉన్నటువంటి రసం — తోయం ఎలా వస్తోందో-తెలుసుకొనే అద్భుతమైనటువంటి విద్య. చెట్ల దగ్గఱకు వెళ్ళి నేర్చుకోండి అని వాళ్ళు చెప్తోంటే-ఆకులను తీసుకు వచ్చి ఒక విగ్రహం మీద పోసేసి మాకు ఏమీ ఫలితాలు రాలేదూ అంటే ఎలా వస్తాయి?

Science is a...Practical Technology-మీరు చేసి చూడండి దాన్ని-ఓ చెట్టు దగ్గఱ కూర్చోండి-మీరు-Vivekananda-Ludher Bur Brink అనే ఒక Scientist దగ్గఱకు వెళ్ళారు Scientist దగ్గఱకు వెళితే-అతను-ఒక గులాబి పువ్వును తీసుకువచ్చి యిచ్చారు. చాలా ప్రేమగా తీసుకున్నాడు. పుష్పాలు ఇవ్వడము అనేది భారతీయ సాంప్రదాయం. అతను తీసుకొచ్చి ఇచ్చాడు తీసుకొచ్చి యిస్తే-అతను అన్నాడు-రండి స్వామి ఒకసారి అన్నారట. మా గులాబీ చెట్టును చూడండీ అన్నారట, నవ్వుకున్నారట-వివేకానంద The Nomise of Vevekananda అనే పుస్తకం దొరికితే-నాకు తెలియదు Out of Print అనుకుంటాను. దొరికితే చదవండి-అందులో యిలాంటి సంఘటనలు చాలా ఉన్నాయి. వివేకానంద నవ్వుకున్నారట, గులాబీ చెట్టు నేను చూడటమేమిటీ-ఎన్ని గులాబీ చెట్లు నేను చూడలేదూ-సరే ఏదో ఆయన ప్రేమగా పిలుస్తున్నాడు కదా-పదండి-అని వచ్చారట-చూచారట. మామూలు పూలకన్నా కొద్దిగా పెద్దపూలు ఉన్నాయి. చాలా బాగుంది. అద్భుతం, అమృతం అన్నారట యింట్లో టీ మనవాళ్ళు ఎంత బాగా కలిపినా నచ్చలేదంటాము కాని-బయట ఆఫీసర్‌గారి భార్య యిచ్చిందంటే-అదీ ఎలా ఉన్నా బావుంటుంది అలాగే Ludhur Burbrink లాంటి శాస్త్రజ్ఞుడు

-గులాబీ చెట్టును చూపించాడు కాబట్టి-బాగుంది-బాగుంది అన్నాడేమో - అను కుంటే. అతను అన్నాట్ట-మీరు కాస్త జాగ్రత్తగా చూడండి స్వామీ అన్నాట్ట. అప్పుడు నేను చేసిన తప్పిదం గుర్తొచ్చింది-ప్రకృతిలో సర్వత్రా దివ్యత్వాన్ని దర్శించ వలసిన నా కళ్ళు-అప్పుడు మూసుకు పోయాయి-అని బాధపడతాడు వివేకానంద. ఏంటి అక్కడ చూడలేనిది. అతను చూపించింది-ఆ గులాబీ చెట్టుకు ముళ్లు లేవు.

ముళ్ళు లేనటువంటి గులాబీ చెట్టు అది. ఎలా సాధించారు మీరు అన్నారు. ఏమీ చేయలేదు- దానికి నీళ్ళు పోస్తున్నప్పుడు- ప్రతీ రోజూ- నేను దానికి ఒక ఆలోచన చెప్తూ వచ్చాను-నీకెందుక భయం-ఇక్కడ నిన్నెవ్వరూ కోయరు-నీవు ఒప్పుకుంటే తప్ప- నీ Permissin అడుగుతే తప్ప-ఇక్కడ పువ్వు లెవ్వరూ కొయ్యరు-అంచేత రక్షణకు ముళ్ళు అక్ఖరలేదూ-అని ప్రతి రోజూ నేను దానితో మాట్లాడుతూ వచ్చాను. యిది సహజంగా జరిగినటువంటి-Ludher Burbrink అనే Botonist వివేకానందునికి చెప్పినటువంటి వాక్కులివి అందువల్ల మెల్లమెల్లగా అదేం చేసింది-దాని ముళ్ళు చిన్నవవుతూ వచ్చి-చివరకు ముళ్ళు లేకుండా పోయి నవి అంచేత వృక్షాల దగ్గర మన ఆలోచనా ప్రభావాలు ఎలా వున్నాయో- పరి శీలించు కోవడానికి-అద్భుతమయినటువంటి వస్తువులుగా పనికి వస్తాయి. రష్యాలో sightic discoveries behind the Iron containers అనేటటువంటి Book ఒకటుంది రెండు volumesలో చాలా Railway Book stallsలో దొరుకుతుంది. Higgin Bothoneలో దొరుకుతుంది. ఖచ్చితంగా దాన్ని మీరు ఇంట్లో పెట్టు కోండి అందులో వాడు ఏమి చెప్పాడు అంటే-ముఖ్యంగా పేకాట ఆడేవాళ్ళకు- డబ్బు పెట్టి పేక ఆడే వాళ్ళకు ఇది రుచిస్తుంది అంటే పేక ఆడమన్నారు మాస్టారు అశ్వమేధ యజ్ఞం గురించి చెప్తూ అంచేత పేక ఆడుతున్నాం అని మాత్రం చెప్పకండి-పేక ఆడమని నేను చెప్పటం లేదు. ఇందులో కూడా తెలుసు కోవలసిన విషయము ఏమిటీ అంటే-పేక ఆడుతున్నప్పుడు- ఒక Money Plantను మీరు సవ్యమయిన ఆలోచనతో పెంచగలిగితే-Money Plant అంటే తెలుసుకదా- మట్టికూడా అక్కర లేదు- సీసాలో నీళ్ళు పోసేసి- ఆ Money Plantను పెంచ గలిగితే-పెరిగిపోతుంది మీరు ఆ Money Plant దగ్గర కూర్చోండి. అంటే మన తలపైన Money Plant వుంటే- ఎదుటి వాడికి ఏ

ముక్కలు పడ్డాయో ఆ Money Plant చెబుతుంది. అని Russion కని పెట్టాడు. A Soghtic giltor behind the Iron containe అనే పుస్త కంలో photosతో సహా వేశాడు-ఇది మీరు వృక్షాలతో మాట్లాడటం నేర్చుకోండి

వృక్షాలను పీకటం కాదు-వృక్షాలను చంపటం కాదు. వృక్షాలను ఉపయో గించుకోవడం ఎలా? అనేది-మన భారతీయులు నేర్పినటువంటి- అద్భుతమైనటు వంటి రహస్యము. పంచవటీ పూజ—అని-పంచవృక్షాలు నాటి-ఆ వృక్షాలు నాటిన స్థలంలో-చేయవలసినటువంటి విశిష్ట తపశ్చర్యలు వున్నాయి- అది రామకృష్ణ పరమహంస ఒక్కడే చేశాడు. నాకు తెలిసినంత వరకు. ఇలాగా ఈ వృక్షాలను వుపయోగించు కోవడం ఎలాగా అనేటటువంటి విజ్ఞానమే- ఏకోహం బహుశ్యామా అనేటటువంటి విజ్ఞానము. ఇదే అగ్ని యొక్క 'పవమాన అగ్ని' యొక్క రహ స్యము. హనుమంతుడికి పవమాన సుతుడు అన్న పేరు కూడా వున్నది. హను మంతుడు సూర్యుడి దగ్గఱ చక్కగా వేదములు శాస్త్రములు నేర్చుకున్నాడు అన్న కథ మీకు తెలుసు. ఆఖరుకు ఎంతవరకు వెళ్ళిపోయాడు అంటే- గురువును మించిన శిష్యుణ్ణి అవుదామని—సూర్యుణ్ణి మింగేశాడట ఇదంతా ఆలంకారికమైనటువంటి కథలు-పూర్తిగా digest సేసుకున్నాడన్న మాట సౌర విజ్ఞానాన్ని సౌర విజ్ఞా నాన్ని పూర్తిగా digest చేసుకున్న వ్యక్తి కనుక పవమానసుతుడు అంటాము. ఈ పవమానసుతత్వము-ఏకోహం బహుశ్యామా అనేటటువంటి విద్య-ఏవి గురువు నేర్చుకుంటాడో-అతనికి మాత్రమే—ఇతరులకు ఆధ్యాత్మిక విద్య తెల్పటానికి హక్కు వున్నదని-భారతీయులు పెట్టిన మొదటి condition multiply చేయండి. ఒకదాన్ని అనంతంగా మార్చ గలగండి. సృష్టి యొక్క రహస్యమంతా కూడా సూర్యుడి యొక్క ఆ పవమాన శక్తిలోనే వుంది అంటూ England లో ఆ పుస్తకాన్ని కొన్నటువంటి ఒక News writer ఆ పుస్తకాన్ని చదివి భారత దేశానికి వచ్చాడు—పెరుగెట్టికొని వదలిసేశాడు తన ఉద్యోగము. అది అంతా కూడా. భారతదేశానికి వచ్చిన తరువాత-నేను చాలా భ్రాంతిలో పడ్డానూ-ఎక్కడా నాకు ఆ Scientific Aptitude సౌరవిద్య—ఆదిత్య విద్యను నేర్పేటటువంటి గురువు నాకు లభించలేదు అని- A Search in secret India అనే పుస్తకంలో వ్రాస్తాడు. ఆ ఆథర్ పేరు పాల్ బ్రింటన్ చివరకు నేను నిరాశుడనైపోయి ఇక భారతదేశంలో ఈ విద్య నాకు నేర్పరు అనేటటువంటి నిర్ణయానికి వచ్చిన తరు వాత-'కాశీ' భారతీయ సంస్కృతికి ఆయువుపట్టు అంటారు గనుక-కాశీలో వున్నటు

వంటి-ఆ సన్నని సందులో నేను నడుస్తూ వుంటే- ఒక వ్యక్తి నా దగ్గరకువచ్చి- మీరు ఎక్కడ నుంచో వచ్చి భారతీయ సంస్కృతిని తెలుసుకుందామని వచ్చి నిరాశతో వెనుతిరిగి పోతున్నారని తెలిసింది నాకు. కాదు. భారతీయ సంస్కృతి చాలా గొప్పది. మీకు దాని Practical demonstration చూపిస్తాము. నాతో రండి, అంటే-ఇలాంటి మాటలు నేను చాలా విన్నాను చాలా మంది ఇలాగే నన్ను మోసపుచ్చి నా దగ్గర డబ్బు తీసుకున్నారు. నేను రానంటాడట. మీ దగ్గరకు ఎవరు పంపించారో తెలుసా-మా గురువు పంపించాడు. నీవు ఇలా వస్తానని చెప్పి- అంతేగాని నా అంతట నేను రాలేదు-అంటాడు- సరే-ఇంకొకసారి మోస పోదాములే అని వెళ్ళానంటాడు.

అక్కడ జరిగిన సంఘటనలు తెలుసుకోవడానికి మీరు ఎంతో దూరము వెళ్ళనక్కరలేదు. నాలుగైదు వారాల క్రిందట స్వాతి అనేటటువంటి- ఒక మాస పత్రిక వుంది తెలుగు మాస పత్రిక-అందులో వేశాడు ఇదంతా కూడా. అంచేత ఒక్కొక్కసారి మన తెలుగు మాస పత్రికలు వార్తాపత్రికలు- చదవడం కూడా చాలా మంచిదనిపిస్తుంది. ఏం చేశాడట ఇతను అక్కడకు వెళ్ళాక Paul Brinton ఆ గురువు దగ్గరకు వెళ్ళాడు ఆ శిష్యుడు తీసుకు వెళితే-కాశీలో తీసుకువెళితే- రాగానే మొట్ట మొదట- అతడు ఏమి అడిగాడు అంటే నీకు ఏదయినా సువాసన కావాలా అని అడిగాడట- ఆ గురువు కావాలన్నాట్ట సరే ఏదో చెబ్దామనుకొని గబుక్కున ...ఆ పువ్వు యొక్క సువాసన కావాలన్నాడు. అతను జేబు రుమాలను తీసి, తన జేబురుమాలను అంటే Paul Brinton జేబు రుమాలను అడిగి ఒకసారి ఎండలో పెట్టి చూడు అన్నాడు ఆ సెంటు వచ్చింది. ఆ సెంటు వాసన ఈ నాటికి వస్తూంది అని 1866లో వ్రాశాడతను. ఇది జరిగి 1848-1846లో. అంతే కాదు ఇంకొకటి కూడా చెప్పాడతను. రెండవసారి వస్తున్నపుడు ఒక పావురాన్ని తీసుకురా అన్నాడు రెండవ రోజు- నేను ఒక పావురాన్ని తీసుకువచ్చాను నేను- పావురాన్ని తీసుకువచ్చాక నా ముందే ఆ పావురం మెడ విరిచేసి క్రింద పడేశాడు అది గిల గిల కొట్టుకొని చచ్చిపోయింది. దాని తరువాత ఒక Magniting glass రెండు రూపాయలకు, మూడు రూపాయలకు దొరికేటటువంటి Magniting glass తీసుకు వచ్చి- సూర్య కిరణాలను దాని మీద ప్రవేశ పెట్టాడు. మెడ విరుగ కొట్టి చచ్చిపోయినటువంటి ఆ పావురం- తిరిగి బ్రతికి- నా ముందే ఎగిరి వెళ్ళిపోయింది. అని వ్రాస్తాడు—— సౌర విజ్ఞానము- సూర్యుడి యొక్క శక్తి

ఏకోహం బహుశ్యామా అనే శక్తిని మీరు అర్థం చేసుకొని, దానిని పొందటానికి వైజ్ఞానిక మయినటువంటి పంథాలో ప్రయత్నము చేస్తేనే- మన ఋషులు అంద చేసినటువంటి ఆ జ్ఞానాన్ని— ఆ గాయత్రీ మంత్రాన్ని మనం వుపయోగించు కున్న వాళ్ళము అవుతాము తప్ప— కొన్ని కోట్ల మంది కొన్నివేల సంవత్సరాలు నుంచి ఆ గాయత్రీ మంత్రాన్ని ఉపాసన చేస్తూ కూడా— ఈ రహస్యం వుంది అని తెలియకపోవడము వల్ల ఈనాడు భారత జాతికి ఈ దౌర్భాగ్యము పట్టింది. అని వాపోతాడు అతను. అంతటితో ఆపలేదు Paul Brinton అనే అతను. దాన్ని తరువాత మళ్ళా అతను నిరాశ చెందినటువంటి వ్యక్తి— మద్రాసుకు వచ్చి మద్రాసులో ఈనాడు 100 సం॥ పూర్తి చేసుకుంటున్నటువంటి ఆ పరమాచార్యులు శంకరాచార్యుల వద్దకు వచ్చి- మీరు శాస్త్ర చెప్పండీ అంటే- అతను ముందు చెప్పలేదట. నేను మానివేశాను- మ్లేచ్ఛులతో అని చెప్పి తరువాత నీలో చాలా మంచి ఆత్మ వున్నది, నీకు గురువు ఖచ్చితంగా దొరుకుతాడు- కాని నేను కాను నీ గురువును అని చెప్పిన తరువాత అతను రమణ మహర్షి దగ్గర వెళ్ళిన తరువాత నేర్చుకున్నటువంటి అద్భుతమైనటువంటి విజ్ఞానాన్నంతటిని వ్రాస్తాడు తన పుస్త కంలో- యిది 'పవమాన అగ్ని' అంటే అది గుర్తుంచుకోండి ABCDలు నేర్చు కొని ఆ 26 అక్షరాలు నేర్చుకొన్న తరువాత ఆ 26 అక్షరాలతో పదాల సంపూర్తితో మీరు ఎన్ని రకాల పదాలను ఉత్పత్తి చేయగలుగుచున్నారో మీరే చూచుకుంటు న్నారు గదా- అది మీ యొక్క పవమానశక్తి కొత్త కొత్త పదాలు, కొత్తకొత్త వాఙ్మయాలు, కొత్త, కొత్త literature వ్రాస్తున్నారు. అందువలన నాలో పవ మానాగ్ని లేదు అనుకోకండి- ఉంది ఏకోహం బహుశ్యామా మీరు చేయగలుగు తున్నారు. కాని దాని యొక్క వైజ్ఞానికతను, మనము తెలిసికోవడం లేదు. దాన్ని ఎలా వుపయోగించుకోవాలో తెలుసుకోవడం లేదు- దాన్ని తెలుసుకొనేటటువంటి ప్రక్రియ పవమానాగ్ని. ఈ పవమానాగ్ని తరువాత మూడవ రకమయినటు వంటి అగ్ని వుంది శుచి. శుచిగా వుండటమంటే ఏమిటంటే ఈనాడు మనము తీసుకుంటున్నటువంటి అర్థం ఏమిటంటే స్నానము చేసి మడి బట్టలు కట్టుకోవడ మని. శుచి అంటే ఆ అర్థం కూడా వుంది కాని అగ్ని విద్యలో- పావక అగ్ని అరగటానికి వీలు కాని పదార్థాలను సుపాక్యము చేసి స్వీకరించడానికి ఎలా వుప యోగపడుతుందో, పవమానాగ్ని ఒకే వస్తువును అనేక రెట్లు చేయడానికి ఎలా వుపయోగపడుతుందో— శుచి అనేటటువంటి అగ్ని మీ సంకల్పాన్ని అక్కడికి

అక్కడే రూపుతీసేటటువంటి శక్తినిస్తుంది. జాగ్రత్తగా అర్థం చేసుకోండి. ఈశ్వరీయ విభూతుల్లో అద్భుతమయినటువంటి ఒక విభూతి వుంది. దాన్ని సంకల్పసిద్ధి అంటాము ఇటు సంకల్పించడము అటు జరిగి పోవడమూ రెండూ ఒకేసారి జరిగిపోవాలి. మన సంకల్పము- పవమాన సంకల్పంలో విత్తనం నాటితే- సూర్యుడు... వల్ల అనేక విత్తనాలుగా మారుతుంది. అది Correct నే కాని మామిడి చెట్టు టెంకె మళ్ళా మళ్లా టెంకెలుగా మారడానికి ఐదేళ్ళో, మూడేళ్ళో కాలం పడుతుంది దానికి కొంచెం. కాని శుచి అనే time gap లేదు ఇక్కడ మీరు ఆలోచిస్తారు. అక్కడ అది జరిగిపోతుంది ఇది శుచి అంటే— యశ్శుచి ప్రేతో భూత్వా- శ్రీ సూక్తంలో చెబుతాడు మీకు. ఇదీ ఉపయోగించు కోండి సంకల్పసిద్ధి ఎలా అవుతుందో తెలుసుకోవడానికి- అక్కడకూడా చంద్రా హిరణ్మయిన్ వరణాన్- సూర్యాన్ హిరణ్మయిన్ లక్ష్మిన్ సూర్య, చంద్ర అనే పదాలే వాడుతాడు. కాని ఆ సూర్యుడు, ఆ చంద్రుడు అంటే ఏమిటో తెలియక పోవడమువలన వచ్చినటువంటి బాధ ఇది.

ఈ సూర్యుడు అంటే అర్థమయింది కదా మీకు- ఏకోహం బహుశ్యామా అనే టటువంటి శక్తి - మీలో ఉన్నటువంటి శక్తి ఉపయోగించుకోండి ఉపయోగించుకున్న తరువాత సంకల్పసిద్ధి ఎలా పొందుతారు- అనేదానికి మళ్ళా ప్రకృతి లోనేచూడండి-సంకల్పసిద్ధి ఎలా వస్తోందో. ఈ సంకల్పసిద్ధి అనేది- Electric Appliances లో చాలా సులభంగా తెలుసుకో గలుగుతాము గనుక - శుచి అనే పదానికి, పవమాన అనే పదానికి. Solar Energy అనే పేరు ఎలా పెట్టామో- శుచి అనే పదానికి - సంకల్ప మాత్రముచేత ఆ పని జరిగిపోవడము అనేదానికి- విద్యుత్ అనే పేరు పెట్టాము - Electrical Energy అని T V. వున్నవారికి- Remote Control అని వినే వుంటారు లేవనక్ఖరలేదు-ఖద్దకం లేవడానికికూడా. కాని ఆ Remote Control ఈ శుచి అనేది చాలా స్పష్టంగా అవగాహన వేస్తుంది. Channel మార్చాలి అంటారు - మీరు లేవాలి జ్ఞానేంద్రియంలో Channel మార్చాలి అనేటటువంటి ఆలోచన రావాలి కర్మేంద్రియం నడచి వెళ్ళాలి - కర్మేంద్రియం ఆ Switch నొక్కాలి. అప్పుడు Channel మారు తుంది. కాని Remote Control లో మీకు ఇవేం చేయనక్కరలేదు. ఉత్తినే ఇలా అంటారు. అంతే - కావలసిన తతంగం అంతా జరిగిపోతుంది జరిగిపోయిన తరువాత- Channel అక్కడ తక్షణం మారిపోతుంది ఇది శుచి అనే పదానికి

అర్థము. శ్రీ సూక్తాన్ని చదివినటువంటి వ్యక్తులు- శ్రీకృష్ణుడిచ్చి నటువంటి అక్షయ పాత్రను మనము కాస్త జాగ్రత్తగా చదివితే- పాండవ వనవాసంలో - ఈ పాండవ వనవాసం అనే పదాన్ని కావాలని చాలామార్లు వాడుతున్నాను- మీరు కాస్త జాగ్రత్తగా చూడండి ఈ ఐదు రోజుల కార్యక్రమంలో - భారతీయ ఆధ్యాత్మికత, దేవసంస్కృతి, అశ్వమేధం గురించి మీకు పూర్తిగా చెప్పలేక పోయినా, ఈ పావక, పవమాన, శుచి అనేటటువంటి అగ్నులను గురించి మొత్తము పాండవ వనవాసంలో వుంది. అది కాస్త మీరు జాగ్రత్తగా అర్థం చేసుకుంటే - అందులో Practical Chips కూడా ఉన్నాయి. అనేదాన్ని చెప్ప టానికి చూస్తున్నాను నేను ఏం చేస్తాడక్కడ - శ్రీకృష్ణుడు — సూర్యుడిచ్చినటు వంటి అక్షయ పాత్రను తీసుకుంటాడు. తీసుకున్న తరువాత - నాకు ఆకలేస్తుంది చెల్లి అంటాడు. ఏంటి ఆ చెల్లిగారు చేయవలసిన బాధ - అక్కడ దూర్వాస మహర్షి వచ్చి కూర్చున్నాడు ఒక్కడూ వచ్చాడా- శిష్యకోటితో వచ్చాడు. అంటే శిష్యులతో వచ్చాడో- కోటి శిష్యులతో వచ్చాడో నాకు తెలియదు. శిష్య కోటి అని ఉన్నదక్కడ వచ్చాడు. శిష్యులతో, చాలామంది శిష్యులతో. అడవిలో ఉన్నారు వీళ్ళు- అక్కడే సత్కారం చేయాలి- తిండి పెట్టాలి. ఎలా? ఆకలేస్తూంది- అంటే- ద్రౌపదికి అహంకారం వుండేదిట- నేను చాలా బాగా అంట్లు కడుగు తాను- అని- అంచేత పనిమనిషి రాకపోతే- మన మెపుడయినా అంట్లు కడుగుకో వలసివస్తే - మీరేమి బాధపడకండి— ద్రౌపదికి ఉంది ఆ గర్వం. నేను చాలా బాగా కడగగలనూ అంటే ఆవిడా అంట్లు కడిగేదనేగా అర్థం. అందుచేత ఆవిడిక ఆ గర్వం వుంటుంది గనుక- నేను అంట్లు తోమేశాను - కడిగి ఆ గిన్నె పెట్టే శాను నేను. ఆ గిన్నె నక్కడ పెట్టేశాను గనుక- ఇంక ఏమిస్తాను అంది. కాదు వెళ్ళి ఒకసారి చూడు— అన్నాడు. చూస్తే, మారుమూలన ఎక్కడో ఒక ఆకు ఉన్నదట అక్కడ. ఆకు వుండటములో కూడా చాలా ఆధ్యాత్మిక రహస్యం ఉంది. Scientific రహస్యం- పత్రం, పుష్పం, ఫలం, తోయం- Solar Energy ఉపయోగించుకో దలచుకుంటే- ఆకులతో మొదలుపెట్టండి అంటాడు. సృష్టి ఆదిలో- నారాయణ తత్వం మీరు అర్థం చేసుకుంటే- పత్రం మీద పడుకున్నట్లు చూపిస్తారు అది ఉత్తినే ఏమీ చూపించలేదూ- దానిలో చాలా వైజ్ఞానికరహస్యాలు ఉన్నాయి. అన్నదాన్ని మీకు చూపించడానికి ఈ కథలు చెప్తున్నాను నేను. అంచేత ఆకును తీసుకుంటాడు. ఆకును తీసుకున్న తరువాత నోట్లో వేసుకుని-

తృప్తోహం అంటాడు ఒక్క ఆకు ఆకును తీసుకొని- తృప్తోహం- అన్న మరు క్షణమే – తక్షణమే – అంటే – శుచి-సంకల్ప సిద్ధి – తక్షణమే – ఆ ఆకు అనేక ఆకులుగా మారిపోయి- యీయన ఆకలి తీరడమే కాకుండా- అందరి ఆకలి తీరిపోయి- పరిగెత్తి పారిపోతారు వాళ్ళకు తెలిసింది- ఇక్కడ శ్రీకృష్ణుడు వచ్చాడు- కొంప మునిగిపోతుందీ అని

సంకల్పసిద్ధి- విద్యుత్- Switch నొక్కాము Light వచ్చింది. వెలుగు కావాలీ అనుకుంటే మన మేం చేయాలి – నూనె పోసుకోవాలి – కిరసనాయిలు పోసుకోవాలి – వత్తి వేసుకోవాలి – వెలిగించుకుంటే - వెలుతురొస్తుంది. కాని విద్యుత్ ఉంటే – సంకల్ప సిద్ధే మీకు. Current కావాలి—— వెలుతురు కావాలి అన్నారు- విద్యుత్ వుంది Switch వేసుకున్నారు- వచ్చేసింది అంచేత ఈ సంకల్ప సిద్ధి మనలో ఎలా జరుగుతుందో అర్థం చేసుకుంటే- కొంచెం Medical Knowledge గనుక మనకు ఉంటే Nvrves అనేటటువంటి పదార్థాలు మన శరీరంలో ఉంటాయి. అవి మన Brainsలో కూడా తిరుగుతూ ఉంటాయి- ఒక Nerve నుండి ఇంకొక Nerve end కు వెళ్లేటటువంటిది- షుమారు 15 V Current శక్తితో ప్రవహిస్తూ ఉంటుంది అని ఈనాడు doctors తెలుసుకున్నారు కాని ఇది సంకల్ప సిద్ధికి కారణము అని తెలియదు వాళ్ళకి భారతీయ ఆధ్యాత్మిక వేత్తలకు తెలుసు యిది. దశాంగులం అనేటటువంటి ఒక మాట పురుష సూక్తములో వస్తుంది దశాంగులం అనే పదానికి అనేక అర్థాలు ఉన్నాయి కాని—— భౌతిక శరీరంలో—— ఆధ్యాత్మిక విద్యలో- మనిషి తన పది తను ప్రయోగం చేసి—— ఆ విషయంలో ఉన్నటువంటి శక్తి అంతా కూడా తనలో ఉందనే రహస్యాన్ని తెలుసుకుంటాడు కనుక—— ఈ పావక, పవమాన, శుచి అనేటటువంటి అగ్నులు మన శరీరంలో ఎలా ఉన్నాయి అంటే—— పావక అనేటటువంటి అగ్నిని 5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాలు—— ఈ పది ఉపయోగించుకుంటాయి. ఈ 5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాలు—— పావక అనేటటువంటి అగ్ని—— ఉత్తరము నుంచి దక్షిణము, దక్షిణము నుంచి ఉత్తరానికి ఎలాగా తిరిగింది చెప్పేది సుందరకాండ. సుందరకాండ మొత్తము ఈ జ్ఞానము యొక్క వివేచనే—— కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాల యొక్క వివేచనే అందుకే దానిని సుందరకాండ అని చెప్పి—— మానవ జాతిలో ఎవరికి ఎప్పుడు ఏ విధమైనటువంటి కష్టాలు వచ్చినా సరే, సుందరకాండను మీరు పారాయణం చేయండి—— ఏ

కష్టాలు పోతాయి అన్నారు ఇంద్రియాలను ఉపయోగించుకునే చేతవస్తే—కష్టాలు పోక ఏమవుతాయి? కాని యింద్రియాలను ఉపయోగించుకోకుండా— పారాయణము చేస్తాము— చేసినా దాని ఫలితాలు దానికి వుంటాయి. తరువాత ఆలోచిద్దాం మనం అంచేత పావక అగ్ని మన శరీరంలో ఎక్కడ వుంది మాస్టారూ అని అడిగితే— మన ఋషులు చెప్పింది ఏమిటీ అంటే— జ్ఞానేంద్రియాల్ని, కర్మేంద్రియాల్ని మీరు వుపయోగించుకోవడము నేర్చుకోండి ఇప్పుడు యింద్రియాల్ని మనం వుపయోగించుకోవడము లేదు ఇంద్రియాలు మనల్ని వుపయోగించుకుంటున్నాయి. కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోండి. సాధన అంటే ఏమిటి అంటే ఇంద్రియాలకు వశీభూతం కాకుండా ఇంద్రియాల్ని ఉపయోగించుకోవడం.

ఈనాడు మనం యింద్రియాల్ని ఎవరూ ఉపయోగించుకోవడం లేదు. అర్జునున్ని నా అంత గొప్పవాణ్ణి చేస్తానంటాడు ద్రోణాచార్యుడు— అందరికి కోపం వస్తుంది మేమందరం శిష్యులము కాదా— అతనే ఏదయినా దిగి వచ్చాడా అని. సరే— గురువుకు తెలిసిపోతాయి కదా— శిష్యుల మనస్సులో ఏముందో సరే ఒకసారి బయటకు తీసుకెళ్ళి— అదుగో ఆ చెట్టు కమ్మి మీద ఒక పిట్ట బొమ్మను పెట్టాను కదా— దాని కన్నును ఛేదించండి అని చెప్తాడు. ఒక్కొక్కళ్ళని తీసుకు వెళతాడు ఏమయ్యా పిట్ట కనిపిస్తుందా? పిట్ట కనిపిస్తోంది, చెట్టు కనిపిస్తోంది, మీరు కనిపిస్తున్నారు, వాళ్ళు కనిపిస్తున్నారు అంటూ వుంటే లాభం లేదులే అయ్యా నీవు పెట్టేయయ్యా— నీవు వేసిన బాణం ఎక్కడ తగలదంటాడు మెల్లమెల్లగా ఒకళ్ళ తరువాత ఒకళ్లు వస్తూ వుంటారు. మెల్లమెల్లగా దుర్యోధనుడు వీళ్లందరూ అయి పోయిన తరువాత— యుధిష్ఠరుడు వచ్చినప్పుడు మాత్రమే ఏమంటాడంటే— నాకు మెడ మొత్తం కనిపిస్తుందండీ— యింకేమీ కన్పించడం లేదు— అంటాడు. మవ్వు లాభం లేదు— పెట్టెయ్యి అంటాడు. అర్జునుణ్ణి ఏమి కనిపిస్తుందిరా అంటాడు. మీరు ఏ కన్నుని కొట్టమన్నారో— ఆ కన్ను తప్ప ఏమీ కనిపించడం లేదు— అంటాడు. వేసెయ్— అంటాడు బాణం ఏకాగ్రత సాధించుకోవడమే. పావక అగ్నిని మనం వుపయోగించుకోవడము. ఈ ఏకాగ్రత సాధించుకోవడానికే మనలో వున్నటువంటి పావక అగ్ని వుపయోగించుకొవడానికే— ఐదు కర్మేంద్రియాలు. వీటిని వుపయోగించుకోవడం అన్నదే రామాయణం. రామాయణం మొత్తం కూడా దశరధుడ — దశకంఠుడు మధ్య జరిగేటటువంటి దెబ్బలాటే. దశరధుడు అంటే— యింద్రియాలమీద—

స్వామిత్వము వున్న వాడికే రాముడు పుడతాడు. కొడుకుగా కాదు-ఒక ఆత్మ జ్ఞానిగా. అంచేత ఈ రామాయణాన్ని, సుందరకాండని – మళ్ళా వేద వాఙ్మయంలో Correct గా అర్ధం చేసుకోగలిగితే – సీతాదేవి అగ్ని ప్రవేశము యొక్క రహస్యము — చాకలాడు అంటే ఏమిటి? బట్టల్ని శుద్ధి చేసేవాడు అనేటటువంటి అర్థము. అంతే తప్ప– ఏదో కథ– ఏదో చెప్పారు అనేటటువంటిది కాదు. రామాయణంలో ఇన్ని సాధనా రహస్యాలు వున్నాయి కనుకే – ఈ నాటికి రామాయణం చిరస్థాయిగా వుండిపోయింది. లేకపోతే– కథ చూస్తే ఏముంది? మామూలు కథే.

ఒక రాజున్నాడు–భార్య వ్యామోహంలో పడి గెంటేశాడు. ఓ విలన్ వచ్చాడు– భార్య నెత్తుకుపోయాడు– విలన్‌తో డిష్యూం–డిష్యూం అని యుద్ధం చేశాడు–భార్యను తెచ్చుకున్నాడు– యిదేగా కథ! ప్రతి సినిమా కథే–కాని రామాయణం ఇప్పటికీ చిరస్థాయిగా ఉండటానికి కారణం ఏమిటీ అంటే కేవలము రామాయణమే కాదు – పావక అగ్ని అని ఇప్పుడు దేనిని గురించి మాట్లాడుకుంటూ వున్నామో–ఆ అగ్ని విద్య మొత్తం రామాయణంలో వుంది. ఇప్పుడు రామాయణం మళ్ళీ ఎప్పుడయినా చదివితే–చాలా జాగ్రత్తగా చూడండి. రామాయణంలో ఆరు కాండలు వున్నాయి. మన శరీరంలో కూడా ఈ యింద్రియాలన్నీ కూడా ఆరు చక్రాల ద్వారా control చేయబడి వుంటాయి కనుక– ఈ ఆరు చక్రాలకి ఈ ఆరు కాండలకీ –ఐదు జ్ఞానేంద్రియాలకీ–ఐదు కర్మేంద్రియాలకీ– యింద్రియాలు, ఆరు మనస్సు – మనస్సషష్ఠాన్ – యింద్రియాని–ఆరోది మనస్సు అనేటటువంటి రహస్యాన్ని మనస్సులో వుంచుకొని– మీరు రామాయణాన్ని అర్ధం చేసుకుంటే– భారతీయ సంస్కృతి చాలా బాగా అర్ధం అవుతుంది మీకు. ఈ భారతీయ సంస్కృతిలో పావక అనే పదాన్ని అర్ధం చేసుకున్న తరువాత—మీరు గుర్తుంచుకోండి. ఎక్కడ నుంచి ఎక్కడ కెళ్ళి పోతున్నానో–మీరు Confuse కాకుండా ఏకోహం బహుశ్యామా లక్షణం మీలో రావడమే. నేను కథ మొదలెట్టింది. ఎక్కడ అంటే - ఇంగ్లాండ్‌లో పుస్తకం తీసుకున్నాడు, Paul Brinton- అక్కడ నుంచి మొదలు పెట్టాను. అది మళ్లా మరిచిపోతే కష్టం మీరు. కాని ఇదంతా కూడా భారతీయ సంస్కృతే- భారతీయ వేద వాఙ్మయమే–మన శరీర శాస్త్రమే–మన శరీరాన్ని ఎలా వుపయోగించు కోవాలో–ఎలా వుపయోగించుకుంటే

మనం సుఖంగా బ్రతుక గలుగుతామో తెలుసుకుంటారు రమ యితి రామ ఆనం దంగా జీవించగలిగేవాడే రాముడు. ఆ రామా జ్ఞాన్ని-మనము పావక అగ్నిని వుపయోగించుకుంటే చాలా ఆనందంగా జీవించగలము అనే రహస్యాన్ని తెలుసు కున్న తరువాత- పవమాన అగ్ని అనేది- మూలాధార చక్రం నుంచి ఆజ్ఞా చక్రం వరకు వ్యాపించి వుంటుంది అది ఇంకా అక్కడికి ఇక్కడికి, పక్కకు వెళ్ళదు. Solar Energyని- ఏకోహం బహుశ్యామా అనేటటువంటి విద్యని- విశుద్ధానంద Paul Brintonకు చూపించిన సంజీవినీ విద్యను కనుక మీరు తెలుసు కోవాలంటే-షట్చక్రాలను ఎలా వుపయోగించుకోవాలో తెలుసుకోండి. కాని మళ్లా ఒకటి గుర్తుంచుకోండి. షట్చక్రాలు వెన్నుపూస మీద వున్నాయి అనేటటువంటి భ్రమతో-ఒక వ్యక్తి తన భార్య శరీరాన్ని కోసేశాడట. సినిమాలో కూడా చూపిం చాడు. గుర్తొస్తుందో ఏ సినిమానో? నాకు సినిమా పేరు గుర్తు రావడము లేదు కథ గుర్తొస్తుంది గాని. కాలజ్ఞానం రాశాడా-మన- వీరబ్రహ్మంగారు చరిత్రలో వస్తుంది- అంచేత శరీరాన్ని కోసేస్తే అక్కడేమీ కన్పించవు షట్చక్రాలు అని. ఆ షట్చక్రాలు- సూక్ష్మ జగత్తులో కనిపిస్తాయి మనకి ఆ సూక్ష్మ జగత్తులో వున్నటువంటి షట్చక్రాలను ఎలా ఛేదించాలో ఎలా వుపయోగించాలో అన్నది సూక్ష్మ జగత్తులో జరిగేది తప్ప, భౌతిక జగత్తులో నేను సమానంగా కూర్చు న్నాను మాస్టారు - Correct గా వుందా లేదా అని అడిగితే ఇక్కడ జరిగిదేమీ కాదు భావనాత్మక మయినటువంటి మార్పులు - ఈ షట్చక్ర జాగరణ మొత్తం మహాభారత కథ చెబుతుంది. పంచ యింద్రియాలు - పంచ పాండవులు - పంచప్రాణాలు - ఈ పంచప్రాణాలను Control చేసేటటువంటి చిత్తవృత్తి - ద్రౌపతి ద్రౌపతిని గెలుచుకోవడానికి చేసినటువంటి బాణాలు వేసి- క్రింద నున్న టువంటి- మీనాన్ని చూచి పైనున్నటువంటి లక్ష్యాన్ని ఛేదించడం.

క్రిందన మూలాధారంలో వున్నటువంటి మీనశక్తిని - మీనము అన్నది- కన్నుకు కూడా వుపయోగిస్తుంది. మీనాక్షి అనే పదాన్ని వాడుతుంటాము మనం. ఈ కన్నును వుపయోగించే సహస్రారాన్ని ఛేదించి అర్జునుడు ద్రౌపతిని గెలిచిన తరు వాత- ఐదు ప్రాణాలు ఆ శక్తిని ఎలా వుపయోగించుకుంటాయో కుండలినీ శక్తిని తెలిపేటటువంటి కథ మనకి మహాభారతం చెప్తుంది ఏ కథా- పవమాన కథని, Solar Energyని ఎలా వుపయోగించుకోవాలో తెలుపుతుంది. కాని తమాషా చూడండి- రామాయణ మహాభారతాలలో- రాముడు సూర్య వంశీయుడు-కౌరవులు

చంద్రవంశీయులు. అంచేత సూర్యుణ్ణి, చంద్రుణ్ణి వేరు చేయకండి. అగ్నినీ, సూర్యుణ్ణి, చంద్రుణ్ణి వేరుచేయకండి.

ఇది ఒకే అగ్ని యొక్క మూడు విభిన్న రూపాలు కనుక రామాయణ మంతా సూర్యవంశీయుల కథ అయితే కుండలినీ జాగరణ ప్రక్రియ అంతా చంద్రవంశీయుల కథ. ఒకటి కుడి ముక్కు అయితే ఒకటి ఎడమ ముక్కు. ఏ ముక్కు ముఖ్యమంటే ఏమి చెబుతాము మనం? రెండు ఉపయోగించుకోవడం నేర్చుకోవాలి. ఈ కుండలినీ జాగరణ ప్రక్రియలో - మూలాధారం నుండి పుష్పటు వంటి ఐదు చక్రాల ఛేదనాన్ని నేర్చుకునే విద్యను Solar Energy అది చెప్పాక - ఇదంతా ఎందుకు చెబుతున్నారు? మీకు గుర్తులేకపోతే నేను గుర్తు చేస్తున్నాను. అద్యతిష్ఠ దశాంగులం-అని పురుష సూక్తంలో ఒక మాట వుంది ఆ మాటను అర్థం చేసుకోవాలి అంటే - సంకల్పసిద్ధి మీకు కావాలి అంటే - దశాంగులం అనే మాటను మీరు చాలా జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. దశాంగులం అంటే 10 వేళ్ళు అని అర్థం. 10 వేళ్ళు అనే మాటకి ఏదో కారణము వల్ల 10 అంగుళాలు అనేటటువంటి మాట వచ్చింది. అంగుళాలు కాదు అంగుళములు. వేళ్ళు ఆజ్ఞా చక్రము నుంచి బ్రహ్మరంధ్రము వరకు ఉన్నటువంటి నిడువును మీరు correctగా కొలువగలిగితే- ఎవరి చేతి వేళ్ళతో వారికి correctగా 10అంగుళములు వస్తుంది. అద్యతిష్ఠ దశాంగులం అంచేత ఆజ్ఞాచక్రం నుంచి సహస్రారం చక్రము వరకు వెళ్ళగలిగితే-వెళ్ళగలిగేటటువంటి సాధన మీరు తెలుసుకోగలిగితే - సాధన తెలుసుకోగలిగితే — అనే పదం వింటే - వళ్ళా ఎక్కడో నేర్చుకోవాలి ఏదో గురువును వెతుక్కోవాలి అని భ్రమ నేను కల్పిస్తే — దయయుంచి నన్ను మన్నించండి - ఎక్కడికి మీరు వెళ్ళనక్కరలేదు. మీ శరీరంలోనే ఇది జరుగుతూ ఉంటుంది. మీ శరీరంలో ఏది ఎలా జరుగుతుందో కనిపెట్టండి అంతకంటే మీరు చేయవలసినది- ఏమీ లేదు. ఒక పది పంద్రెండేళ్ళ బాలకుడు, వాళ్ళమ్మ నీళ్ళు మరిగిపోయా ఏమో చూడరా అని చెబితే - మూత టప్, టప్ అని ఎగురుతూ వుంటే—ఆ మూత ఎగరటాన్ని చూచి Steam Engine కనిపెట్టాడు అంచేత Steam Engine కనిపెట్ట డానికి యింత వేద వాఙ్మయము తెలిసి వుండాలి అద్యతిష్ఠ దశాంగులం - తెలియాల్సిన పనిలేదు. సంకల్ప సిద్ధి — మీరు అనుకున్నది తక్షణం చేసేయడం — Postponement అనేటటువంటి లక్షణం మన భారతీయత నుండి తీసివేస్తే — ఆ ఒక్క లక్షణాన్ని మనం అలవాటు చేసుకోగలిగితే - సంకల్పసిద్ధి వచ్చినట్టే.

అగ్గిపెట్టె కావాలి అంటే రేపు చూద్దాంలే అంటాము. సిగిరెట్టు కావాలి అంటే– అది ఆగిపోతే—రాత్రి ఒంటి గంటకు లేచి Railway stationకు పరిగెడతాం. ఎంచేత? Railway stationలో దొరుకుతాయి. మిగతా కొట్లన్నీ మూసి వుంటాయి.

సంకల్పసిద్ధి సిగిరెట్ కాల్చడంలో వున్నది. ఇంటికి కావలసిన సామాగ్రిలో వుండదు. అంచేత మీరు నిత్యజీవితంలో మీరు ఏ ఏ సంకల్పాలు ఆచరిస్తున్నారో– ఆ ఆ సంకల్పాల్ని తక్షణం చేసేస్తూ ఉంటే – అర్థమేమిటని మాట – ఆ దశాంగు శము పనిచేస్తున్నది - అన్నమాట అంచేత మీ నిత్య జీవితంలో ఏవిధమయినటు వంటి అలవాట్లు మార్చుకోవాలో – ఏ విధమయినటువంటి అలవాట్లు చేసుకోవాలో చెప్పేటటువంటిదే – సంస్కార విద్య, షోడశ సంస్కారాలు. నిద్ర లేచిన దగ్గర నుంచి పడుకునేంత వరకు 16 విచిత్రమయినటువంటి మలుపులు మన జీవితంలో వస్తూ వుంటాయి ఆ మలుపుల్ని మనం జాగ్రత్తగా అర్థం చేసుకోగలిగితే – ఆ షోడశ సంస్కారాలు మనం వుపయోగించుకో గలిగితే – ఇప్పుడు నేను చెప్పిన పావక పవమాన శుచి అనేటటువంటి వన్నీ మీ ఒళ్ళో వాలుతాయి. అదే మన ఋషులు అందించినటువంటి విద్య. కాని తమాషా ఏమిటి అంటే - అన్నప్రాసన సంస్కారంనాడు – అన్నం తింటం నేర్చుకున్న మనం – ఈనాటికి అన్నం తినడం మానలేదు. ఇంకా రకరకాలయినటువంటి రుచులను కలుపుకుంటూ అన్నం తింటున్నాడు తప్ప – విద్యారంభ సంస్కారంనాడు – విద్య ఎలా నేర్చుకోవాలో చెప్పిన వేద మంత్రాలను మనం పూర్తిగా మరచి పోయాం. విద్యారంభ సంస్కారము — విద్య ఎలా నేర్చుకోవాలో అనే సంస్కారము మనకు ఎందుకు అన్నప్పుడు – అన్నప్రాసన సంస్కారంనాడు ఆహారం ఎలా స్వీకరించాలో నేర్చుకున్న విద్య మనమెందుకుపయోగించుకుంటున్నాము?

ఇది నేను చెప్పటంలో– యిది నేను చెప్పటంలో అంతరార్థము ఏమిటి అంటే– షోడశ సంస్కారాలు ప్రతిరోజూ జరుపుకోవాలి. నిద్ర లేచిన దగ్గఱ నుంచి పడుకునేటంత వరకూ– ప్రతీసారి ఈ సంస్కారాలు మీకు గుర్తు ఉండాలి. పుంసవన సంస్కారం దగ్గఱ నుంచి– అంటే ఒక ఆలోచన బీజ రూపంలో మన మనస్సులో పడిన దగ్గఱ నుంచి – ఆ ఆలోచన పరిసమాప్తి అయి పోయి ఆ ఆలోచన వదలేసేంత వరకు, ఆ ఆలోచనలకు మంగళగీతం పాడేటంత వరకూ ఆ ఆలోచన యొక్క అన్వేష్టి జరిగేంత వరకు ఆ సంస్కారాలు మన

నిత్య జీవితంలో ఎలా ఉంటున్నాయో మనం చూచుకోకపోతే- భారతీయ సాంప్రదాయం మనకు అర్థం కాదు. కాని భారతీయ సాంప్రదాయంలో రెండు మూడు సాంప్రదాయాలు చాలా ప్రముఖమయిన పాత్ర వహిస్తాయి. ఈ సంస్కారాలు అన్నీ కూడా భారతీయ సంస్కృతికి మేరుదండంలాంటివి అని చెప్పకుంటూ- ఈ భారతీయ సంస్కృతిని యింటింటికి తీసుకు వెళ్ళి- ఈ పావక, పవమాన, శుచి. అంటే ఏంటి- అరగని వస్తువులను అరిగేటట్లు చేసుకొనట అంటే ఆహార పదార్థాలేకాదు- అర్థం కాని Subjectను అర్థం అయ్యేటట్లు చేసుకొనుట కూడా పావకమే. అదే విధంగా ఏకోహం బహూశ్యామా ఒకే వస్తువును అనేక వస్తువులుగా చేసుకోవడం- Machinisation అని ఇప్పుడు చదువుకుంటున్నాము కదా! Machine ఏమి చేస్తుంది? మూసలో ఒక వస్తువును పెట్టేస్తే- ఏకోహం బహూశ్యామా- అనేక మూసలలో అది టప టప చేసేస్తుంది. Printing press ఏమిటి? ఒక pageని మీరు Compose చేశారనుకోండి- టక టక టక- కోట్లు కాపీలు కావాలంటే- అన్ని కోట్ల కాపీలు వస్తాయి ఇదంతా కూడా పవమాన అగ్ని యొక్క Practical civilisation. దీన్ని వుపయోగించుకుంటూ-సంకల్ప సిద్ధి ద్వారా శుచి అవేటటువంటి అగ్నిని ఎలా వుపయోగించుకోవాలో చెప్పడానికి- మొట్ట మొదటిసారి మీకు అర్హత నిచ్చేది- 5-8 సం॥ మధ్య జరిగేటటువంటి ఉపనయన సంస్కారము. జన్మనా జాయతే శూద్రః- సంస్కారాత్ ద్విజ ఉచ్యతే- ద్విజత్వమనేది సంస్కారము వలన వస్తుంది. జన్మ వలన రాదు. రాదు అని, వాళ్ళు మొత్తుకుంటున్నప్పటికీ కూడా- మనము సవ్యమయినటువంటి అవగాహన లేకపోవడము వలన బ్రాహ్మణులమనే భ్రమతో- శూద్రతాన్ని కూడా కోల్పోయామేమో- అనిపించేటటువంటి స్థాయికి దిగజారాము- కాని- వజ్రము- వజ్రమే. మట్టిలో కలసిపోయినా వజ్రమే- హారములో పొదగబడినా వజ్రమే- అలాగే మానవ జాతిలో పుట్టిన మనమందరము గూడా ఆ స్థాయికి చెందినటువంటి వ్యక్తులమే. ద్విజత్వాన్ని పొందగలిగే వ్యక్తులమే. ఎందుకంటే ప్రతీ వ్యక్తికి కర్మేంద్రియాలున్నాయి. ప్రతీ వ్యక్తికి వెన్నుపూస మీద షట్చక్రాలు ఉన్నాయి. ప్రతీ వ్యక్తికి ఆజ్ఞాచక్రము నుండి సహస్రారము వరకు దశాంగుళం వుంటుంది. ఇది లేని వ్యక్తి ఎవడూ లేడు మానవుడూ అంతే. ఇవి ఉన్నాయి కనుక- ప్రతీ వ్యక్తికి ఈ ద్విజత్వానికి అర్హత వుంది కానీ ఏ విధంగానయితే సంస్కరింపబడతాడో- ఏ విధంగానయితే ఒక్క schoolకో, ఎక్కడికో విద్య

నభ్యసిస్తాడో- ఈ సంస్కారాలను అభ్యసించటానికి మొట్టమొదటి సంస్కారము ఉపనయన సంస్కారము అని చెప్తూ- ఈ గాయత్రీ మంత్రదీక్ష ఇవ్వబడుతుంది అప్పుడు. ఈ గాయత్రీ మంత్రదీక్ష ఇస్తున్నప్పుడు ఎడమ ముక్కు, కుడి ముక్కు ఇక్కడ ఉన్నటువంటి అగ్ని-ఈ శ్వాస విధానాన్ని గాయంతంత్రాయతీతి-గాయత్రీ ఈ శ్వాసను ఎలా పీల్చుకోవాలి- ఉఛ్వాస నిశ్వాసలు ఎలా తీసుకోవాలో తెలిపే టటువంటి విద్య బహూనిమే వ్యతీతాని జన్మాని తవచార్జున- తాన్యహం వేద సర్వాని సక్తం వేథం పరంతపా- అని వాపోతాడు శ్రీకృష్ణుడు అర్జునునితో జన్మ అనేక రకాల జన్మ వుంది కొత్త జన్మ యిచ్చావురా అంటాం మనకు సాయం చేస్తే ఆ జన్మంటే మాతృ గర్భంలోంచి వచ్చి- చనిపోయి ఎక్కడికో వెళ్ళిపోవడమే జన్మకాదు- శ్వాసగత మయినటువంటి జన్మ వున్నది. ఒక శ్వాస లోపలకు వెళ్ళి యింకో శ్వాస బయటకు వచ్చే ఉఛ్వాసనిశ్వాలలో ఒక జన్మ వెళ్ళిపోతూ వుంటుంది. బహూనిమే వ్యతీతానీ- ఇటువంటి శ్వాసలు నువ్వూ నేను పీల్చుకున్నాము నాయనా- ఈ ప్రతీ శ్వాస నాకు తెలుసు- నీవు చూడటము లేదు. మనం కూడా అదే- అర్జునుడు లాంటి స్థితిలోనే వున్నాము శ్వాస పీల్చుకుంటు న్నాము అని గుర్తుంటుంది. తప్ప లేకపోతే శ్వాస పీల్చుకుంటున్నాము. అన్న జ్ఞానం కూడా వుండదు ఇదే మాయ అంటే- ఈ శ్వాసగతమయినటు వంటి జన్మ- కుడి ముక్కు, ఎడమ ముక్కు నుంచి వచ్చేటటువంటి జన్మ- చంద్రనాడు సూర్య నాడు నుంచి వచ్చేటటువంటి జన్మ- సూర్య చంద్రుల వంటి ఈవిజ్ఞానాన్ని అర్థం చేసుకుంటే - బహూనిమేవ్యతీతాని జన్మాని తవచా అర్జునా - ఈ శ్వాస గతమైనటువంటి జన్మలు చాలా జరిగిపోయాయి. తాన్యహం వేద సర్వాని - ఈ ప్రతీ శ్వాసను నేను గుర్తించాను.

ప్రతీ ఉఛ్వాస నిశ్వాసలను నేను గుర్తించాను నీవు గుర్తించలేదు. అదే నీకూ నాకూ తేడా అన్నాడు. ఈ శ్వాసను గుర్తించడము ఎలా అన్నది ఉప నయన సంస్కారములో గాయత్రీ మంత్ర దీక్ష ఇస్తున్నప్పుడు - మూడు రకాల దీక్షలు ఇవ్వబడతాయి. ఒకటి మామూలుగా మంత్రదీక్ష. మంత్రదీక్ష మీరు ఎక్కడయినా తీసుకోవచ్చు - మంత్రాన్ని చూడండి - చదివేయండి వచ్చే స్తుంది మంత్రదీక్ష ఈ మంత్రదీక్షతో బాటు - ప్రాణ దీక్ష అనేది యివ్వాలి. యీ ప్రాణదీక్ష అంటే - యిందాక నేను చెప్పానే - మహాభారతంలో వున్న టువంటి రహస్యమంతా ప్రాణదీక్షే. మనలో ఉన్నటువంటి ఐదు ప్రాణాలు

గురువులో ఉన్న టువంటి ఐదు ప్రాణాలు — అది High voltage లో వుంటుంది. ఇది Low Voltage లో వుంటుంది. ప్రకృతిలో ఉన్నటువంటి రహస్యమేమిటంటే అంటే శక్తి ప్రవాహము ఉచ్ఛస్థాయినుండి క్రిందస్థాయికి వెళుతుంది. దీన్ని మార్చలేము మనము అంచేత ఉచ్ఛస్థాయిలో ఉన్నటువంటి ఆ శక్తి ప్రవాహాన్ని — గురువు యొక్క ప్రాణ శక్తి ప్రవాహాన్ని మనం శిష్యుడిలోకి ప్రవహింప చేయ గలిగితే మళ్ళా మీరు కొంపముంచారు. మాస్టారు — ఇంతవరకు చాలా సులభం — ఏముందీ ఇది మీలోనే జరుగుతుంది. అని చెప్పారు.

ఇప్పుడు మళ్ళా మీరు ఏమంటున్నారు? ఒక గురువుండాలి అంటున్నారు. ఆ గురువు ఈ ప్రాణ విద్యలో నిష్ణాతుడయి ఉండాలంటున్నారు. అతను నా కంటే అధిక శక్తి గలిగి ఉండాలంటున్నారు. శక్తి కలిగి ఉన్నవాడు —నా మీద ప్రేమ ఉండాలిగదా — లేకుంటే — వాడు నా కెందుకిస్తాడు—. ఆ శక్తి అంటే — ఏమీ గాభరా పడనక్కర లేదు — వాయువు ఎప్పుడూ కూడా అల్పపీడనం నుంచి అధిక పీడనం వైపుకు — అధిక పీడనం నుంచి అల్పపీడనం వైపుకు — చక్రగమనంలో వెళుతుంది — అంటే ఏంటి — అల్పపీడనం ఏర్పడింది — అని T. V లో చూపిస్తూ ఉంటారు కదా. అంచేత అల్పపీడనము ఎక్కడ ఉందో — అటువైపున గాలి ప్రభావం సవ్యంగానే వెళుతుంది. ఉఛ్వాస నిశ్వాసలు అనేది — పీడనమే కదా — గాలి యొక్క పీడనమే కదా? అంచేత ఈ రహస్యాన్ని మీరు గుర్తించుకొని — మీరు ఏ స్థాయిలో ఉన్నారో — ఆ స్థాయిలో — సమత్వం యోగ ఉచ్యతే — ఆ స్థాయిలో స్థిరంగా ఉండి పోగలిగితే — ఉండిపోయిన తరువాత మీరున్నటువంటి అల్పపీడనం నుంచి — మీ కన్నా అధిక పీడనంలో ప్రకృతిలో ఎవరు ఎక్కడ ఉన్నాసరే-ఖచ్చితంగా—మీ వైపుకు ఆ Cycle ఏర్పడుతుంది-ప్రకృతి యొక్క నియమం — మీరేం చేయలేరు అవశః ప్రకృతేర్వశాత్ — అవశుడైపోయి— ప్రకృతి యొక్క వశమై అది జరిగి పోతుంది తప్ప — మీరేం చేయనక్కరలేదు. అని మన ఋషులిచ్చినటువంటి అద్భుతమైనటువంటి రహస్యము. అందుకే గురువు మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తాడు తప్ప — మీరు గురువు దగ్గరకు వెళ్ళనక్కర లేదు — మీరు చేయవలసి నటువంటిదేమిటంటే — మీరు అల్పపీడన స్థితిలో సమానంగా ఉండిపోతే — సమానంగా ఎలా వుండాలి మళ్లా?

నిద్రపోవటం కాదు నిద్రపోకుండా వుండకుండా సమత్వముగ ఉండటానికే. యోగః కర్మ సుకౌశలం — అన్నాడు. కర్మ — శ్వాస పీల్చుకునేటటు

వంటి కర్మతో కౌశలం వుండాలి. మీరు దాన్ని చూచుకుంటూ వుండాలి అనేది. కనుక మీరు చేసేస్తే ప్రకృతిలో మీకంటే ఎక్కువ స్థాయిలో ఎక్కడ ఎక్కడ ప్రాణశక్తి వున్నదో - అక్కడ అక్కడ నుంచి మీలోకి ప్రాణశక్తి వెళ్తుంది అనేటటువంటి రహస్యాన్ని — అశ్వమేధ దిగ్విజయ యాత్ర చెబుతుంది ఈ అశ్వమేధ దిగ్విజయ యాత్రలో మీరు చూడండి - ఎక్కడెక్కడయితే అశ్వం వదలి వేయబడుతుందో - అక్కడక్కడ ఆ అశ్వం ఫ్రీగా తిరుగుతూ — తిరిగి మళ్ళా ఎక్కడయితే Start అయిందో చివరికి అక్కడకే వస్తుంది.

ఈ అశ్వమేధయాగ ప్రక్రియలో - ఈ ఉచ్ఛ్వాస నిశ్వాస శ్వాస తీసుకునే ప్రక్రియలో — పావక, పవమాన, శుచి అనేటటువంటి - షోడశ సంస్కారాలలో ఉపనయన — సంస్కారం తరువాత - చాలా గొప్పదయినటువంటి సంస్కారం — పాణిగ్రహణ సంస్కారం ఈ నాడు పాణిగ్రహణ సంస్కారం అంటే పెళ్ళి అనేటటువంటి ఒక అర్థం ఉంది పాణిగ్రహణము అంటే - చెయ్యి చెయ్యి కలపటం. సంబంధ బాంధవ్యాలు పెంచుకోవడం Coming to a under-Standing ఒకళ్ళ నొకళ్ళు అర్థం చేసుకోవడం అన్నది పాణిగ్రహణం. షేక్ హాండ్ యిచ్చుకుంటాము గదా, షేక్ హాండ్ యిచ్చి మనవాళ్ళందరూ పెళ్ళిళ్ళు చేసుకోవడం లేదు. అంచేత ఈ పాణిగ్రహణం సంస్కారంలో — సప్తపది అనేటటువంటి ఒక విశిష్ట మయినటువంటి కర్మకాండ ఉన్నది ఆ కర్మకాండనే అర్థం చేసుకున్న తరువాత - జన్మదినము అనేది - Birth day Celebra-tionf అనేది ఈనాడు చాలా ఎక్కువ అవుతున్నాయి. ఇక్కడ జరుగుతున్నాయో లేదో నాకు తెలియదు కాని బాంబే, ఢిల్లీ అక్కడ కూడా ఉద్యోగం లేనటువంటి కుర్రవాళ్ళు - మేము మీ పిల్లలకు Birthday Celebration చేస్తాము అని చెప్పి — దానికి ఒక Contracl తీసుకొని చాలా అద్భుతంగా జరుపుతున్నారు. ఈ జన్మదిన సంస్కారము కూడా చాలా విశుద్ధమయినటువంటి సంస్కారము దానిని మర్చిపోయాము.

ఈ అశ్వమేధ ప్రక్రియలో- ఉపనయన సంస్కారము- పాణిగ్రహణ సంస్కారముతోపాటు— జన్మదిన సంస్కారము- అంటే ఏ రోజు మనము పుట్టాము-ఆ రోజు అని అర్థము- ఏ రోజు మనము పుట్టాము ఆ రోజు అంటే మాస్టారు—ఒక సం॥పాటు ఆగాలా? అక్కరలేదు- మీరు నిద్ర లేవడమే పుట్టడము- నిద్రపోవడమే మృత్యువు అన్న రహస్యాన్ని భారతీయులు తెలుసు

కున్నంతగా మరెవరూ తెలుసుకోలేదు తేడా ఏమీ లేదు - మృత్యువుకు - నిద్రకు. నిద్రలో ఇదే శరీరంతో లేస్తాము- మృత్యువు- తరువాత ఇంకో శరీరముతో లేస్తాము అనేటటువంటి రహస్యాన్ని తెలుపుకుంటూ- ఈ షోడశ సంస్కార విద్యను తెలుపుకుంటూ- ఈ యజ్ఞ విధానాన్ని తెలుపుకుంటూ- జాగ్రత్తగా గుర్తుంచుకోండి-ఇంతవరకు మనము గాయత్రీ అంటే శ్వాస అని తెలుసుకున్నాం. ఈ శ్వాసను ఉపయోగించుకోవడానికి- ఇడా, పింగళా, సూర్యుడు, చంద్రుడు, అగ్ని-ఈ మూడు అగ్నుల్ని తెలుసుకున్నాం - వాటికి ఇంకొకటటువంటి పేరు, పావక, పవమాన, శుచి అని ఉందని తెలుసుకున్నాం-

ఈ పావక, పవమాన, శుచి అనేటటువంటి విద్యను ఉపయోగించుకొను డానికి షోడశ విద్య అనేటటువంటి—— శిరి మండల పూజితా అనేటటువంటి పేరుతో జరిగేటటువంటి - లలితా సహస్రనామములో వివరించబడినటువంటి షోడశ సంస్కారాల విద్యను అర్థం చేసుకున్నాం మనం. ఈ షోడశ సంస్కారాల విద్యను అర్థం చేసుకున్న తర్వాత - యజ్ఞ ప్రక్రియలోని పరాకాష్టగా రక రకాల యజ్ఞాలు ఉన్నాయి. పౌర్ణమాస యష్టి అని, అమావాస్య యష్టి అని - ఏ యజ్ఞ విధానంలో పౌర్ణమినాడు మన శ్వాస ఎలా ఉండాలి - అమావాస్యనాడు శ్వాస ఎలా పీల్చుకోవాలి - వాటిని పీల్చుకోవడమువల్ల - బాహ్య జగత్తులో ఉన్నటువంటి పావక, పవమాన, శుచి అనేటటువంటి యజ్ఞము ఎలా మారుతుందో తెలుసుకున్నాక చేయాలి తప్ప - తెలుసుకోకుండా చేస్తే - సోమయాగం విఫల మయింది అనే Banner మనకు కన్పిస్తుంది. ఇక్కడ విఫలమయ్యింది అనేటటు వంటి దాంట్లో - నేను చెప్పదలుచుకున్నదేంటి అంటే - దాని అంతరార్థము తెలియకుండా, బాహ్య కర్మకాండను మాత్రమే పట్టుకొని చేస్తాము అని ఏ యజ్ఞము చేసినా వేస్ట్ అందుకే అంతర్యాగము - బహిర్యాగము అనేటటువంటి రెండు రకాల యాగాలు జరుగుతూ ఉంటాయి. ఎప్పుడూ కూడా భారతదేశ సంస్కృతి మనకు ఏమి చెప్పింది అంటే - బాహ్య జగత్తులో ఏదో జరుగుతోంది. దాన్ని జరగటానికి నేను కారణము అని అనుకోను. అని ఎవరితో చెబుతున్నాడు- ఈ మాటలు అర్జునుడిలాంటి వ్యక్తులతో చెబుతున్నాడు.

ఎటువంటి అర్జునుడు-మామూలు అర్జునుడు కాదు-12 సం॥పాటు వనవాసం

చేస్తూ వుంటే - మిగతా పాండవులు ఏదో ఏదో పని చేస్తూ ఉంటే - ఇతను పాశుపతాస్త్రాన్ని గెలిచి యింద్రుని అర్ధ సింహాసనంలో కూర్చుని - ఊర్వశిని తల్లిగా పిలవగలిగేటటువంటి స్థాయిలో ఉన్నటువంటి, పరమ తపస్వి అయినటువంటి అర్జునుడికి చెబుతున్నాడు నిమిత్తమాత్రం భవ సవ్యసాచి- నీవు చేసేదేమిటయ్యా- నీవు చేసేదేమీలేదు — అదెప్పుడో జరిగిపోయింది అన్నాడు. భయపడుతూ ఉంటే- యుద్ధం చేయటానికి నలుగురిని చూస్తే భయం అర్జునుడికి - మిగతావాళ్ళ నెవరిని చూసినా భయం లేదు ప్రతీ గొప్పవాడికీ గూడా ఆ భయ ముంటుంది మా తాత గారు ఓ సారి ఓ కథ చెప్పారు - నేను నమ్మలేదు - మీరూ నమ్మరేమో — Lord Quatchner అనేటటువంటి ఒక General ఉన్నాట్ట- Englandలో. అద్భుతమైనటువంటి General అతను యుద్ధ భూమిలోకి వచ్చాడూ అంటే - అతను సారధ్యము వహించాడూ అంటే — ఓటమి ఉండేది కాదుట యుద్ధంలో — కాని అతనికి పిల్లిని చూస్తే భయమట - అంచేత అతను పడుకున్నటువంటి టెంటులోకి పిల్లిని విడిచి పెట్టేస్తే - ఇక వాడు యుద్ధము చేయలేడు. అలాగే ప్రతీ వ్యక్తికీ బలహీనతలు ఉంటాయి అలాగే అర్జునుడికి ఉన్నటువంటి నాలుగు బలహీనతలు - భీష్మ, ద్రోణ సూతపుత్ర జయద్రథః-భీష్ముడు, ద్రోణుడు, సూత పుత్రుడు, జయద్రధుడు. ఈ నలుగురిని చూస్తే భయం అర్జునుడికి - ఎందుకు? భీష్ముణ్ణి ఎవరూ చంపలేరు - తను చచ్చిపోవాలి అనుకోవాలి - అంతే - తను చచ్చిపోవాలి అని ఎవరనుకుంటారు? - అది అర్జునుడుకి తెలుసు - భీష్ముణ్ణి ఓడించలేను - ద్రోణుడు - ద్రోణుడి దగ్గర ఉన్నటువంటి ఒక లక్షణం ఏమిటీ అంటే - నా అంతట నేను విల్లంబులను వదలివేస్తే తప్ప నన్నెవ్వరూ గెలువ లేరు యుద్ధభూమిలో ఓ వెర్రివాడు తప్ప ఎవరూ కూడా శస్త్రాన్ని వదలిపెట్టరు. అంచేత ద్రోణుణ్ని వదలమని ఎలా అంటాడు? గెలువలేడు. కర్ణుడికి వాళ్ళ నాన్నే ఒక అస్త్రం యిచ్చాడు — ఎవరి నాన్న? అర్జునుడి నాన్న. నా కొడుకుని చంపేయ్ అని. కథ తెలుసుకదా - అక్కడా మళ్ళీ సూర్యుడు వస్తాడు. ఈ సూర్యుడు, చంద్రుడు, అగ్ని — రకరకాలుగా వస్తూ వుంటారు కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోండి అందుకే ఈ కథ కూడా చెబుతున్నాను. కర్ణుడు సహజ కవచ కుండలాలతో పుట్టాడు — ఆ కవచ కుండలాలు ఉన్నంతవరకు ఎవరూ ఏమీ చేయలేరు గనుక - యింద్రుడు - అంటే — మనస్సు వస్తుంది. మనస్సు ఎప్పుడయితే — ఆ సహజ కవచ కుండలాలు· ..........................

......... కవచ కుండలాలు ఏ క్షణంలో ఇచ్చేస్తావో, ఆ క్షణంలో నీ Protection పోతుంది అని. అహంకారం వుంది లోపల. సూర్యుడు తన తండ్రే చెప్తున్నాడు కదా! ఎందుకు? అహంకారం? నేను చాల గొప్ప దాతనని ఒలిచేసి ఇచ్చేస్తాడు. ఇచ్చేసిన తరువాత ఇంద్రుడికే సిగ్గేస్తుందిట ఇటువంటి "దానినా" నేను అడిగాను అని. సరే, నా కొడుకుని చంపేయడానికి బాణం తీసుకో అని ఇస్తాడు. ఇది అర్జునిడికీ తెలుసు. తండ్రి ఇచ్చినటువంటి అమోఘమైన ఆ బాణం waste కాదు. అది దాచిపెట్టుకున్నాడు. అర్జునుడి మీద తప్ప ఇంకొకరి మీద ప్రయోగించను అన్నాడు కర్ణుణ్ణి ఎలాగైనా గెలవలేనని తెలిసిపోయింది. జయద్రథుడు ఒకడున్నాడు. వాడేంటి? శివుణ్ణి బాగా తపస్సుచేసి ఒక అర్జునుణ్ణి తప్ప మిగతా నలుగురు పాండవులని యుద్ధంలో ఓడించగల్గేటటువంటి శక్తి కల్గి వున్నాడు. వీరు నల్గురు చాలలా ఏంటి? అసలు మహాభారతానికి

అసలు దుర్యోధనుణ్ణి మనం పరమ మూర్ఖుడు అనుకొంటాం కాని చాలా తెలివైనవాడు. వాడికి తెలుసు – భీష్ముడున్నాడు ద్రోణుడున్నాడు, కర్ణుడున్నాడు, జయద్రథుడున్నాడు ఖచ్చితంగా మనమే గెలుస్తామని ఈ శ్రీకృష్ణుడు వున్నాడు కాబట్టి వీళ్ళు గెలిచారు కాని, లేకపోతే గెలిచే scope లేదు అందువల్ల ఈ సూర్య శక్తి, ఈ సౌర శక్తి... (దగ్గు) ఈ కర్ణుడు, జయద్రథుడు వీళ్ళని ఓడించలేను అని ఎప్పుడైతే చెప్పాడో శ్రీకృష్ణుడు తన సూక్ష్మ శరీరంలో వీళ్ళని ఎప్పుడో చంపేసాను నేను. "నిమిత్త మాత్రం భవ సవ్యసాచి" నువ్వు చెయ్యాల్సిందేమీ లేదయ్యా నువ్వు బాణం పట్టుకు నుంచో చాలన్నాడు మన ఆధ్యాత్మిక సాధనలన్నీ గూడ ఇంతే. గుర్తుంచుకోండి. మీరు నిమిత్త మాత్రులుగా సాధన చేయండి. నిమిత్త మాత్రంగా ఫలితాలు వచ్చేస్తాయి అని చెప్పబడుతోంది ఈ అశ్వమేధ యజ్ఞంలో. అంచేత ఏదేదో చెప్పేశారు మాష్టారు. మేము ఇదంతా ఎక్కడ చేస్తాము అని గాభరా పడనక్కరలేదు ఏ విధంగా అర్జునుడికి నిమిత్త మాత్రంగా సాధన చేసుకుంటే మహాభారతంలో గెలుపు వచ్చిందో అదే విధంగా నిమిత్త మాత్రంగా ఈ అద్భుతమైనటువంటి భారతదేశ సంస్కృతిని ప్రపంచం యొక్క మూరు మూలలకు తీసుకు వెళ్ళడానికి మనం సహం పట్టుకో గల్గితే, మనకి లాభం అవడమే కాకుండా, భావితరాల వాళ్ళకి కూడ ఎంతో మేలు చేసిన వాళ్ళము అవుతాం. ఈ శ్వాస నిశ్వాసలు ఉపయోగించుకుంటూ, ఈ గాయత్రీ మంత్రము ఉపయోగించుకుంటూ.

అగ్ని విద్యలో యజ్ఞము అనేటువంటి పదాలలో చాల గొప్పస్థాయి

యజ్ఞాలకి మేధాయజ్ఞాలని పేరు. ఈ మేధా యజ్ఞాలు నాలుగు రకాలుగా అయి నటువంటి యజ్ఞాలు వున్నాయి. పరాకాష్టన్న మాట "న గాయత్ర్యాః పరో మంత్రః" మంత్రాలలో గాయత్రిని మించిన మంత్రం లేదని మనం ఎలా చెప్పు కుంటామో, యజ్ఞాలలో మేధాయజ్ఞాన్ని మించిన యజ్ఞం మనకి లేదు. పుత్ర కామేష్టి యజ్ఞం అనీ, వాజపేయ యజ్ఞంఅనీ-రకరకాల యజ్ఞాలు మనకి వున్నాయి. రకరకాల కోర్కెలని తీర్చుకోవడానికి రకరకాల యజ్ఞాలు వున్నాయి. కాని ఈ యజ్ఞ పరంపరలన్నిటిలోకి కూడ అద్భుతమైనటువంటి యజ్ఞ పరంపరలో ప్రాశస్త్య మైన యజ్ఞాలని మేధాయజ్ఞాలు అని పిలుస్తూ వుంటాము ఆ మేధా యజ్ఞాలు నాలుగు ఉన్నాయి. అవి సర్వమేధము, నరమేధము, గోమేధము, అశ్వమేధము ఈ సర్వ, నర, గోమేధాల కంటే ప్రాశస్త్యం వహించిన మేధాయజ్ఞం అశ్వమేధ యజ్ఞం, అంచేత ఈ సర్వమేధము, నరమేధము, గోమేధము అనే యజ్ఞప్రక్రియ లను అర్థం చేసుకుంటూ, అశ్వమేధ యజ్ఞముని అర్థం చేసుకునే ముందు అశ్వం అనే పదానికి మూడు అర్థాలు చెప్పుకుని ఇప్పుడు ఆగుదాం రేపు అశ్వమేధము అంటే ఏమిటి? ఈ అశ్వమేధాన్ని సామూహికంగా ఎలా చేయాలి? చర్చించు కుందాము.

అందుచేత ప్రస్తుతం అశ్వం అనే పదానికి అర్థం తెలుసుకుందాము మనం చాలా పదాలను తప్పుగా అర్థం చేసేసుకుంటూ వుంటాము. ఒకసారి ఒక రాజు గారు సభకి వచ్చారట-చాలాసార్లు సభకి రావడం కొంచెం ఆలస్యం అయిందిట. ఈ కాలంలో Politicians వాళ్ళు లేటుగా రావడం అనేది సహజం. అసలు రాకపోతే మనం ఆశ్చర్య పడతాం. ఒకసారి వివేకానంద పారిస్ నుంచి వస్తున్నాడట. వస్తూ వుంటే Train correct గా Timeకి వచ్చేసిందిట Paris కూడ మన India లాగే Trains lateగా రావడానికి ప్రసిద్ధి అయితే వివేకానంద అనుకున్నాడుట, నా లాంటి యోగి వచ్చాడు. యోగి ఎక్కడకు వస్తే అన్నీ సవ్యంగా జరిగిపోతాయి కనుక Train Timeకి వచ్చింది అనుకున్నాడుట అంటే ప్రక్కనున్న attender చెప్పాడుట నిన్న రావలసిన Train ఇది, 24 గం॥లు మాత్రమే లేటు అన్నాడట. అలాగ... రాజుగారు కొద్దిగా late అయ్యారు. కాని పూర్వకాలంలో రాజులకి late అయ్యేది కాదు. Correct గా Time కి వచ్చేసేవారు ఎందుకు late అయ్యింది అంటే రాజమహిషిని కలుసుకుని వస్తున్నాను అన్నాడుట. రాజ మహిషిని కలుసుకుని వస్తున్నాను అంటే సంస్కృతం తెలిసినవాడు ఒకడు ఏమను

కున్నాడుట–రాజుగారు ఒక గేదెను పెంచుకుంటున్నారు కాబోలు,ఆ గేదెను కలుసుకుని వస్తున్నారు కాబోలు అనుకున్నాడు అనుకోండి ఏ మంటాము మనము?

మహిషి అంటే గేదె అని అర్థం ఉంది. కాని మనం ఎవ్వరూ అలా అర్థం చేసుకోము. రాజుగారు రాజమహిషిని కలుసుకుని వస్తున్నాడు అంటే భార్యని కలుసుకుని వస్తున్నాడు అని, అంచేత సందర్భశుద్ధి ఉండాలి. మనం ఏదైనా ఒక మాటని కాని, ఒక దానిని కాని అర్థం చేసుకోవడానికి. భారతీయ సంస్కృతిలో అశ్వము, గాయత్రీ యజ్ఞము రెండు పర్యాయ పదాలు- బొమ్మ, బొరుసు ఒక దానిని ఒకటి ఎలా వేరు చేయలేమో గాయత్రి మంత్రం యొక్క శక్తిని, యజ్ఞం యొక్క శక్తిని రెండింటిని మనము వేరు చెయ్యలేము అని చెప్పుకుంటూ వస్తున్నప్పుడు, ఈ యజ్ఞము ఈ గాయత్రీ మంత్రాన్ని కలిపి ఉపయోగించుకొనేటువంటి, పరమోత్కృష్టమైనటువంటి యజ్ఞ విధానానికి అశ్వమేధము అని పేరు వుంటే. అక్కడ అశ్వము అంటే గుఱ్ఱము అనే అర్థం మాత్రమే మనం తీసుకుంటే, రాజమహిషి అంటే గేదె అనే అర్థం తీసుకున్నట్టే వుంటుంది సంపూర్ణ భారతీయ శాస్త్ర వైజ్ఞానిక పరాకాష్టకి Basis అయినటువంటి అశ్వమేధము ఒక గుఱ్ఱంమీద ఆధారపడి ఉండి వుంటే, మనకు సవ్యమైన అవగాహన లేదు అని అర్థము అంచేత అశ్వము అనే పదానికి చాలా అర్థాలు వున్నాయి. అందులో ఒక సాధారణమైనటువంటి అర్థము ఏమిటి అంటే 'శ్వ' అంటే, నిన్న అనే అర్థం కూడా వుంది. అశ్వ అంటే నిన్న లేదు, రేపు లేదు ఈ...మాత్రమే వుంది **Present tence** మాత్రమే ఉంది. **Past tence** లేదు **Future tence** లేదు. అటువంటి యజ్ఞం "తస్మాత్ సర్వేషు కాలేషు మాం అను స్మర యుద్యచ" నిరంతరం నన్ను గుర్తుంచుకుంటూ ఈ యజ్ఞ విధానాన్ని గుర్తుంచుకుంటూ "అయనే జిహ్వాది ప్రాణం ప్రాణో పానం తథా పరే" ఈ వాయువుని-లోపలికి వెళ్లేటటువంటి వాయువుని, బైటకి వచ్చేటటువంటి వాయువుని - దర్శించుకుంటూ చూడాలి దాన్ని బుహూనిమే వ్యతీతాన్ని జన్మాని తవచార్జున. తేన్యహం వేద సర్వాణి – శ్వాసని చూడండి. లోపలికి వెళ్ళి ఎక్కడికి వెళుతుందో బైటకి ఎలా వస్తుందో చూడండి నిద్రపోవడం అందరికీ తెలుసు కాని నిద్రపోతున్నపుడు మీ శ్వాసలో వచ్చే మార్పుని మీరు గమనించుకున్నారా? "యానిశా సర్వభూతేష తస్యాం జాగర్తి సంయమి." రాత్రి మీరు నిద్రపోతున్నప్పుడు పడుకుని వుంటారు. నేను **M. Sc** చేస్తున్నప్పుడు ఒకసారి **Bhu**లో **Hostel**కి వెళ్ళాన

మా Friendని ఎపహానికి.సినిమాలో intervelలో friendsని కలిసినపుడు 'సినిమాకి వచ్చావా' అని అడగడం ఎలా సహజమో అలాగే నిద్రపోతున్నాడు ముసుగు వేసు కొని. పడుకుంటే నేను ఊరుకోక నిద్రపోతున్నావా? అని అడిగాను. నిద్రపోతున్న వాడిని అడగడం ఎందుకు? తెలుస్తూనే వుంది కదా? కాని వాడు జవాబు ఇచ్చాడు అవునని. నిద్రపోతున్నావా? అని అడిగాను నిద్రపోతున్నానన్నాడు. అంటే నిద్ర పోతున్నట్టా – పోనట్టా? ఇలాంటి గందరగోళాలు జరుగుతాయి. ఆధ్యాత్మిక జగత్తులో కూడా, మీరు నిద్రపోవడం అంటే మంచం వేసుకుని, పడక వేసుకుని పడుకున్నాననుకుంటారు- అది నిద్రపోవడం కాదు. ఒకానొక స్థితిలో బాహ్య స్మృతి మీరు కోల్పోయి, సర్వ ప్రపంచ స్మృతిని కోల్పోతారు మీరు. ఈ కోల్పోవ డానికి కారణం ఏమిటో ఇప్పుడు మనకి అవగాహన లేదు కాని, మీరు మీ శ్వాస ను గమనించడం మొదలు పెడితే సోహం అనేటటువంటి శ్వాస హంసగా మారు తుంది సోహంని తలక్రిందులు చేస్తే హంస అవుతుంది. అంచేత ఈ లోపలికి, బైటగా వెళ్ళేటటువంటి గాయత్రి ఎప్పుడైతే హంస మీద ఆరోహణమవుతుందో అంటే శ్వాస తలక్రిందులవుతుందో, హంసారూఢ అయినట్టి గాయత్రిని తెలుసుకోవాలి అని వాళ్ళు చెప్తూ ఉంటే బొమ్మ వేసేసి, దానికి ఒక పూలదండ వేసేసి, ఇదే గాయత్రి మంత్రం అనుకుంటే కష్టం

కాని ఈ గాయత్రిని ఉపాసించ వద్దు అంటంలే. ఇందులో వున్నటువంటి రహస్యాన్ని తెలుసుకోమంటున్నాను హంసవాహిని గాయత్రి అంటే ఏంటి? అని అంచేత "అశ్వో". రేపు–నిన్న అనే భావన ఈ ప్రశ్వాస, నిశ్వాసలవల్లే కల్గు తుంది కాలజ్ఞానం. ఏ క్షణంలో అయితే మీ ఊపిరి ఆగిపోతుందో, కాలజ్ఞానం ఉండదు. ఒక మహాత్ముడు అష్టావక్రగీతని వ్రాస్తూ చాలా విచిత్రమయిన పదాన్ని వాడాడు. కాస్త జాగ్రత్తగా ఆలోచించండి. చావు అన్నది ఇతరులకి వస్తుంది తప్ప నీకు రాదు అన్నాడు ఏదో గూఢమైన అర్థం చెప్పేశాడు అనుకుందాం. గూఢమైన అర్థం ఏమీ లేదు ఫలానా మనిషి చచ్చిపోయాడు అని ఇతరుల అందరికీ తెలుస్తుంది తప్ప వాడికి తెలీదు. చావు అనేది నీకు రాదు. ఇతరులకు వస్తుంది అంటే నిద్ర అనేది నీకు వస్తుంది తప్ప, నీవు నిద్రపోయావు అని నీకు తెలియదు. నీకు తెలిసింది అంటే నిద్రపోలేదు అని అర్థం. అష్టావక్రుగీత అద్భుత మైన జనకుడికి అష్టావక్రడు చెప్తాడు. ఇది శ్వాస, ప్రశ్వాసలలో ఆ స్థితిని పొంద గలగడం అశ్వస్థితి. ఈ స్థితి యజ్ఞమయం చేసుకోవడం అశ్వమేధము. ఇది ఒక

అర్థం. కాస్త జాగ్రత్తగా గుర్తుంచుకోండి. ఇది నిజమయినటువంటి అశ్వమేధము. నిరంతరం మనం చేయవలసిన అశ్వమేధము మన శ్వాస ప్రశ్వాసలని ఆపేసి అంచే మెరేమి అనవక్కరలేదు దానంతట అది ఏదో ఒక స్థితిలో Balance అవుతుంది Chemistry చెప్తున్నప్పుడు Dynamic Chemical equilibrium అనే పదం వాడతాము. కొంచెం Chemistry జ్ఞానం వున్న వాళ్ళకి సులభంగా అర్థమైన, పెద్ద కష్టమైనటువంటిది ఏమి కాదు ఇది. కొన్ని పదార్థాలు కలసి కొన్ని పదార్థాలుగా మారుతూ వుంటాయి. ఈ మారిన పదార్థాలు తిరిగి కొత్త పదార్థాలుగా మారుతూ వుంటాయి. ఇటువైపు నుంచి అటువైపుకి, అటువైపు నుంచి ఇటువైపుకి మారుతూ వుంటాయి. ఈ మారేటటువంటి వేగం సమానంగా ఉంటే అంటే అటువైపు నుంచి ఇలా మారె పదార్థాలు ఇంకోవైపు నుంచి తిరిగి మారే పదార్థాలు రెండు ఒకే వేగంతో జరిగాయి అనుకోండి- అప్పుడు యేమౌతుంది? ఇక్కడ వున్న పదార్థాలు ఇక్కడే వుంటాయి. అక్కడున్న పదార్థాలు అక్కడే వుంటాయి. అంటే నిత్య నూతనత్వము—నిన్న, రేపు లేని స్థితి ఏర్పడింది ఆ పదార్థాలు అలానే ఉంటాయి. Chemistry యేం చెప్తోంది అంటే అటువంటి సమతా స్థితి యేర్పడితే కొన్ని యుగాల వరకు దాన్ని ఎవరు ముట్టుకోకుండా వుంటే ఆ స్థితి అలానే వుంటుంది అంటారు నిన్న వుండదు. రేపు వుండదు. సహజంగా అశ్వస్థితి వస్తుంది నిన్న, రేపు లేని స్థితి వస్తుంది ఈ స్థితిని పొంద డానికే ఈ స్థితిలో ప్రవృత్తి కలగజేయడం నిజ్ఞ యజ్ఞం అంటే - మూడు చెప్పాను. సద్గుణాల ప్రవృత్తి, సంగతీ కరణము, త్యాగము. ఈ స్థితిలో నిరంతరము వుండే టటువంటి ప్రవృత్తిని కలగజేయడమే అశ్వమేధము మొదట అశ్వమేధము— ఇది మన అందరము ఎవరి ఇళ్ళల్లో వాళ్ళు చేసుకోవలసినది. "తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్యచ" యే కాలంలో భూత, భవిష్యత్ వర్తమాన కాలములో నిరంతరము Present, Past Future అనేటటువంటి అర్థం అక్కడ వుంటే దాన్ని వదిలేసి యేదో గుర్రాన్ని తెచ్చి, దాన్ని చంపేస్తామంటే యేమంటాము? యజ్ఞం అంటే వాళ్ళకి అర్థం కాలేదు అంటాము అశ్వమంటే మనకి అర్థం కాలేదు అని అంటాము అంచేత అశ్వము అనే పదము జాతి వాచకంగా వాడకుండా గుణాల ప్రవృత్తిని బట్టి వాడారు. అశ్వం అనే పదానికి ఇంకో అర్థం వుంది. సర్వత్రా వ్యాపించి వున్నది అని అటువంటి అర్థం ధాతువు అర్థము సర్వత్రా వ్యాపించి యే వస్తువు ఉందో అదే అశ్వము "చంద్రమావై అశ్వః సూర్యోవై అశ్వః'

ఈశ్వరుడు కూడ అశ్వమే అని పురుష సూక్తంలో చెప్పబడుతుంది. అంచేత ఈ అశ్వ స్థితి-సర్వత్రా వ్యాపించి వున్న స్థితిని, ఆ ప్రవృత్తిని-ఆ స్థితిని పొందడమే అశ్వమేధము ఇంకొక లక్షణము ఉంది. "సర్వం ఆ శ్నోతి అశ్వః" అన్నీ తినేసేది. అన్నిటిని తినేసేది కాలం కాలం దేన్నీ మిగల్చదు రాముడు కృష్ణుడు మొదలగు గొప్ప - గొప్ప వాళ్ళందరు కూడా అలా వెళ్ళిపోతూనే ఉన్నారు. ఈ కాల ప్రవాహం ఆగదు "కాలోహ లోక క్షయ కృత్ ప్రవృద్ధో" ఈ లోకం యొక్క కాలాన్ని, ఈ అన్నిటిని తీసివేసే ఈ అశ్వాన్ని, ఈ కాల ప్రవాహాన్ని సరిగ్గా అర్థం చేసుకుని, సవ్యంగా వినియోగించుకునే వ్యక్తి నిర్మాణమే అశ్వమేథము. అంచేత ఈ అశ్వమేధాన్ని మనము మర్చిపోయి, ఈ అశ్వాన్ని మర్చిపోయి మనం మళ్ళా ఒక గుర్రాన్ని పట్టుకుంటే చాలా కష్టం. చాలామంది నన్ను అడిగారు మాష్టారు, అశ్వమేధ యజ్ఞం అంటే గుఱ్ఱాన్ని ఎక్కడ్నించి తెప్పిస్తున్నారు అని అడిగారు. ఏమయ్యా నీ Motor Cycle 8 H P. కదా ఎన్ని గుఱ్ఱాలున్నాయి. నీ మోటారు సైకిలుకి" అని అడగాల్సి వచ్చింది ఏముంది ఏ H P. నో అని అంటాము ఇప్పటికి కూడా. అది ఒప్పుకుంటాము తప్ప అశ్వమేధ యజ్ఞం అనేసరికి మళ్ళీ గుఱ్ఱాలు కావాలి అంటే ఆధునికతతో ముందుకి వెళ్ళిపోయినా, యజ్ఞ విధానము వచ్చేసరికి అక్కడ Modernity అక్కరలేదు అక్కడ. మళ్ళీ పాత గుఱ్ఱాలే కావాలి. ఈ విచార భ్రష్టత్వం ఉంది ఆలోచనా రహిత స్థితిని తీసివేయడానికి అశ్వమేధ పరంపరను మళ్ళా స్పష్టంగా అర్థం చేసుకోవడానికి మళ్ళీ రేపు మనం అశ్వమేధం అంటే ఏమిటో తెలుసుకుందాము. ఈ నాడు మనం చదువుకున్నది భారతీయ సంస్కృతి అంటే శ్వాస నిశ్వాసలని అర్థం చేసుకోవడము. ఈ శ్వాస నిశ్వాసలే మనం జీవించి ఉండడానికి కారణం అని తెలుసుకుని, మూడు రకాల అగ్నులలో మన జీవించి వున్నాము. పావక, పవమాన, శుచి అనేటటువంటి అగ్నులు. ఈ అగ్నుల నుపయోగించు కోవడానికి సూర్య చంద్ర అగ్ని విద్య మనం తెలుసుకోవాలి. ఇవి తెలుసుకోవడానికి రామాయణ, మహాభారతాలు చాలా వుపయోగపడతాయి. అంతేకాకుండా మన నిత్య జీవితంలో నిద్ర లేచినప్పటి నుండి పడుకునే వరకు 16 Sensetive Points ఉన్నాయి ఈ షోడశ సంస్కార విద్య ఏమిటో, ఆ షోడసీ విద్య ఏమిటో లలితా సహస్ర నామంలో చెప్పి ఉన్నది. "చరమే జన్మనియతా శ్రీ విద్యోపాసకో భవేత్" అంటే లలితా సహస్ర నామం చదువుకున్నాము కనుక ఇదే చివరిజన్మ

అనుకోకండి. ఈ షోడసీ విద్య కనుక మనం నేర్చుకోగలిగితే—అంటే నిద్ర లేచిన దగ్గర నుండి పడుకునే లోపల ఆ 16 సంస్కారాలు ఏమిటో అవి అశ్వమేధములో ఎలా వుపయోగించుకుంటామో రేపు తెలుసుకుందాము కాని వీటన్నిటికి ఆధారం గాయత్రీ మంత్రము కనుక అందరం కలిసి ఆ గాయత్రీ మంత్రాన్ని ఉచ్చరిస్తూ అందరూ సుఖంగా ఉండాలి అని ప్రార్థిద్దాము

దేవ సంస్కృతి, దిగ్విజయయాత్ర, అశ్వమేధయజ్ఞం-పృష్ఠభూమిలో మనము మహాభారతంలో జరిగినటువంటి ఒక కథను జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఎందుకంటే యుగాలు అనే పదంలో సత్య, త్రేతా ద్వాపర కలియుగ చక్రీయ గమనంలో శ్రీకృష్ణుని నిర్యాణం తర్వాత ఆ రోజు నుంచి కలిప్రవేశం జరిగింది. అని చెప్పుకుంటూ వుంటాము కలి ప్రవేశం జరిగిన తర్వాత యజ్ఞవిధానాలు ఒక విధంగా అంతరించి పోయాయి. భారతదేశంలో యజ్ఞ విధానం అనేది అసలు పూర్తిగా మర్చిపోయాము మనము. సుమారు 5000సం॥ల క్రిందట జరిగిన కృష్ణ నిర్యాణం తర్వాత మళ్ళా ఈనాడు sudden గా యజ్ఞములలో రాజుగా గుర్తించబడేటటువంటి అశ్వమేధయజ్ఞము ఏదో ఒకసారి రెండుసార్లు చేయడం కాకుండా 108 సార్లు చేయవలసినటువంటి, చేయగల్గేటటువంటి పరిస్థితులు ఏర్పడ్డాయి. ఈ కలియుగంలో. ఇది ఎంతవరకు సంభవం అనే ప్రశ్న చాలామందికి వస్తూ వుంటుంది అసలు. దీనికి ముఖ్య కారణం ఏమిటి అంటే కలియుగం యొక్క గొప్పదనాన్ని మనం ఎప్పుడూ అర్థం చేసుకోలేదు. కలియుగం అనగానే మనకి ఎప్పుడు కూడా Negetive aspects మాత్రమే గుర్తుకొస్తాయి తప్ప కలియుగంలో ఉన్నటువంటి, విధేయాత్మకమైనటువంటి positive aspects ఏవైతే మహాభారతంలో చెప్పబడి వున్నాయో అవి మర్చిపోయాం మనం. దానిని ఒకసారి గుర్తు చేసుకుని ఈ అశ్వమేధ పరంపర ఏ విధంగా దానికి దీనికి సంబంధం కల్గి ఉందో తెలుసుకుందాం మనం. పరీక్షిత్తు మహారాజు- శ్రీ కృష్ణుని ద్వారా ఆయుర్దాయం పొందినటువంటి పరీక్షిత్తు మహారాజు ఒకనాడు వేటకు వెళ్ళిన తరువాత తన పరివారంతో వేరయిపోయి ఆకలి దప్పులతో ఒక ఋషి ఆశ్రమంకి వెళతాడు. ఆ ఋషి ఆశ్రమానికి వెళ్ళినటువంటి అతను ఋషి తనకు తగిన మర్యాద ఇవ్వలేదు అనే భావన వచ్చి ఆ ఋషి మెడలో చచ్చిపోయిన పాముని వేస్తాడు. చచ్చిపోయిన పాముని వేసినప్పటికీ కూడా ఆ ఋషి ఏమీ కదలడు. ఋషి అలాగే కూర్చుని వుంటాడు,

ఋషి అలా కూర్చుని వుండటాన్ని చూసి రాజు తిరిగి వెనక్కి వెళ్ళిపోతాడు. కాని అక్కడ నది ఒడ్డున మిగతా ఋషి కుమారులతో ఆడుకుంటున్నటువంటి ఒక బాలకుడు-ఋషి కుమారుడు, 7-8 ఏళ్ళ వయసులో వున్నటువంటి వాడికి మిగతా ఋషి కుమారులు వచ్చి చెపుతారు మీ నాన్నగారి మెడలో పాముని వేసేసాడు అని-అది కూడా చచ్చిపోయిన పాముని. వీడికి కోపం వచ్చి-ఇంకా అసలు తండ్రి వద్దకు రాడు- అక్కడే ఆ నది ఒడ్డునే నీళ్ళు తీసుకుని ఎవరైతే నా తండ్రి మెడలో పాముని వేసారో వాళ్లు 7 రోజులలో 7 వ రోజు పాము కాటుకు గురై మరణిస్తాడు ఇది నా వాక్కు అమోఘం. ఇది వజ్ర వాక్కు అన్నాడు. అన్న తర్వాత సరే అయిపోయింది ఇంటికి తిరిగి వస్తాడు తండ్రి అప్పుడే మెల్లిగా కళ్ళు విప్పుతాడు తండ్రి దగ్గరకి వచ్చేసరికల్లా అతనికి అర్థం అవుతుంది, తను చేసింది ఎంత తప్పో. కళ్ళమ్మట నీళ్లు కారుస్తాడు కాని ఒకసారి మాట బహిర్గత మయిన తరువాత దానిని వెనక్కి తీసుకునే సామర్థ్యం లేదు కనుక, ఆ తండ్రి ఏం చేస్తాడు అంటే పరీక్షిత్తు మహారాజుకు కబురు పంపిస్తాడు. నీ ఆయుర్దాయము కేవలము యేడు రోజులే వున్నదని. 7 రోజులే ఎప్పుడైతే ఆయుర్దాయం వున్నదని తెలుస్తుందో సరే తన రాజ్యాన్ని పూర్తిగా వదిలేసి మహాభాగవతాన్ని 7 రోజులు పూర్తిగా తెలుసుకున్న తరువాత మిగతా సాధనలు జరుగుతూ వుంటాయి.

కాని నేను ఇక్కడ ఈ కథను గుర్తు చేసినటువంటి సందర్భం యేమిటి అంటే, ఈ పరీక్షిత్తు మహారాజు 36 సం॥లు రాజ్యం చేస్తాడు. రాజ్యాన్ని చేపట్టిన కొత్తలో, శ్రీకృష్ణ నిర్యాణం అయిపోయిన తర్వాత అతను దేశ సంచా రము చేస్తున్నప్పుడు పరీక్షిత్తు మహారాజు ఒకసారి ఒక ఎద్దు, ఒక ఆవు- ధర్మము భూదేవి సంభాషించుకోవటం చూస్తాడు. సంభాషించుకోవడం చూసినపుడు ధర్మం భూదేవిని, భూదేవి ధర్మాన్ని ఓదారుస్తూ వుండటం చూసిన తర్వాత, కలి ప్రభా వము వలన ఇలాంటి పరిస్థితులు ఏర్పడ్డాయి అని చెప్పి అక్కడికక్కడ కలిని చంపేయడానిని ప్రయత్నం చేస్తాడు కలి శరణు కోరతాడు. సరే-right—నేను నిన్ను చంపను. కాని నిన్ను కొన్నిచోట్ల ఉండడానికి స్థానాన్ని చూపిస్తున్నాను. ఆ చోట్లుతో పాటు మరి కొన్ని చోట్ల వుండనివ్వమని అంటాడు కలి. మహాభార తంలో వ్యాసులవారు—అంటే-శుక మహర్షి చెప్పాడు. కాని శుక మహర్షికి ఆ కథ తెల్పింది వ్యాస మహర్షి అందువలన వ్యాస మహర్షి యేం రాస్తాడు అంటే కలిని చంపకలిగి ఉండి కూడా అవసరం దొరికినప్పుడు, క్షత్రియుడై వుండి ఒక కుత్సిత

మైనటువంటి వ్యక్తి ధర్మాన్ని నాశనం చేస్తాడు, రాబోయే యుగం పూర్తిగా నాశనము అయిపోతుంది అని తెలిసి వుండి కూడా కలిని ఎందుకు వధించలేదు? కలికి కొన్నిచోట్ల స్థలాన్ని చూపించి, సరే నీవు జీవించి వుండులే. కాని జాగాలు వదిలేసి ఇంకో చోటికి రాకు అని అభయ దానం ఎందుకు చేసాడు? క్షత్రియుడు-అందులో మామూలు వాడా? శ్రీ కృష్ణుని ద్వారా ప్రతికించబడ్డవాడు, ధర్మాలు అన్నీ తెల్సినవాడు, వీరుడు, క్షత్రియుడు అంచేత వధింప చేయడానికి అర్హత వున్నవాడిని, చంపడానికి పూర్తి అధికారం కల్గినటువంటి చక్రవర్తి ఎందుకు చంపలేదు కలిని? అంటే దానికి భాగవతంలో కారణం చెప్తారు వాళ్ళు కలి యొక్క గొప్పదనం యేమిటి అంటే మిగతా మూడు యుగాలలో కూడా చెడుని మనస్సులో అనుకుంటే-అంటే చెడు జరిగిన ఫలితం వచ్చేస్తుంది. మిగతా యుగాలలో, సత్యయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగాలలో చెడుని మనస్సులో అనుకుంటే ఆ చెడు యొక్క ఫలితం మీకు వచ్చేస్తుంది. కాని మంచి అనుకుంటే ఆ మంచిని ఆచరణలో పెట్టాలి. ఆచరణలో పెట్టి చాలా ఘోరమైన తపస్సు చేస్తే తప్ప ఫలితాలు రావు. కాని కలికాలంలో దానికి reverse అవుతుంది. మంచి మనస్సుతో అనుకుంటే దాని ఫలితాలు వచ్చేస్తాయి.

చెడుని పూర్తిగా ఆచరిస్తే తప్ప దాని ఫలితాలు రావు. ఇంత అద్భుతమైన ఫలితం వుంది కనుక ఈ మంచి గుణం కలిలో వుంది కనుక రాబోయే యుగాల వాళ్ళ యొక్క బలహీనతలకి 3 adjectives వాడతారు వాళ్లు. "తమ, తమ, తమ" అని ఇంత ఘోరమైనటువంటి-దుర్గుణాలను కల్గినటువంటి- బలహీనతలు కల్గినటువంటి కలియుగంలో కూడ మంచి చేద్దాం అని ఊహ వస్తే వారికి మంచి ఫలితాలు వచ్చేస్తాయి కదా! అందువల్ల కలిని వదిలి పెట్టాడు అని చెప్తూ వుంటారు. అంచేత ఈ కలియుగంలో మంచి చేద్దాము అనే ప్రేరణ కల్గి మంచి చేద్దాం అనే సంఘటనని మనం చెయ్యలేకపోయిన కూడ మంచి ఫలితాలు రావడానికి వాతావరణము చాల అనుకూలంగా వుంటుంది అని చెప్తున్నారు. ఈ అనుకూలమైన వాతావరణాన్ని సాధకులైనటువంటి మనము పూర్తిగా వుపయోగించుకోవాలి. ఎంచేత అంటే అగస్త్య మహర్షి అశ్వమేధపర్వం మహా భారతంలో ఈ సంఘటన చెప్తాడు అగస్త్య మహర్షి ఒక యజ్ఞం తలపెట్టాడుట. 12 సం॥లు చేసేటటువంటి మహాయజ్ఞం. ఈ 12 సం॥ల యజ్ఞం ఎప్పుడైతే తల పెట్టాడో అప్పుడు ఇంద్రుడికి బెంగవచ్చింది ఇంద్రుడికి ఎప్పుడూ బాధలే పాపం! ఎప్పుడు

సుఖంగా వుండడు ఎవరు ఎక్కడ యజ్ఞం చేసినా బాధపడుతూనే ఉంటాడు. ఈనాడు మనం అందరం ఇక్కడ కూర్చుని వున్నాము అంటే ఇంద్రుడి గుండెల్లో ఎన్ని రైళ్ళు పరుగెడుతున్నాయో భగవంతునికే తెలియాలి. (దగ్గు) అంచేత అతడు ఏమి నిర్ణయించాడు అంటే అగస్త్య మహర్షి ఎంత గొప్ప వాడు అయినా సరే ఈ 12 సం॥లు వర్షం కురిపించను అని నిర్ణయించు కున్నాడుట. పూర్వకాలంలో అగస్త్య మహర్షి వంటి వారి ఆశ్రమంలో అందరు ఋషులు కలసి చేసేటటువంటి 12 సం॥లు జరిగేటటువంటి ఆ యజ్ఞంలో ఇంద్రుని యొక్క ఈ నిర్ణయాన్ని తెలుసుకోగల్గేటటువంటి ఋషులు చాల మందే వున్నారు. వాళ్ళకి తెలిపోయింది. ఇంద్రుడు ఇలా అనుకున్నాడు అని మరి ఏం చేద్దాం అని ఒకపూట యజ్ఞం అయినతర్వాత సాయంత్రం చర్చించుకున్నారట చర్చించుకుంటే అగస్త్యముని అన్నాడుట యజ్ఞం అనేక రకాలుగా చెయ్యవచ్చు- స్పర్శ మాత్రంతో కూడ యజ్ఞం చెయ్యవచ్చు అన్నాడుట. ఈ 12 సం॥లు నేను హవన సామగ్రి వెయ్యను, సమిధలు వెయ్యను, ఏమీ వెయ్యను. మనందరం కేవలం ఆ సమిధలను ముట్టుకుని వది లేద్దాం. ఈ విధంగా యజ్ఞం చేద్దాం. ఒకవేళ ఆ వస్తువులు మనకి దొరకకపోతే ధ్యాన యోగంతో మనస్సులోనే ఆ మొత్తం యజ్ఞ కర్మకాండని ఊహించుకుని దానిని చేద్దాం అన్నాడుట అంటే ఋషులందరు సమిధలు ముట్టుకోవడం, సమిధలు వేసాననుకోవడం, నెయ్యి ముట్టుకోవడం, నెయ్యి వేశాననుకోవడం. ఈ విధంగా యజ్ఞం చేస్తే పోనీ, వస్తువులైనా కనిపిస్తున్నాయి అన్నారు- ధ్యానం ద్వారా యజ్ఞం చేస్తే 12 సం॥ల పాటు కళ్ళు మూసుకుని అలా యజ్ఞం జరుగుతూ ఉంది అనే ఊహాచిత్రాన్ని మనసులోనికి తెచ్చుకొని, మనం యజ్ఞం చేస్తే చాలు అని అంటు న్నారు కదా- ఇది ఎలా సంభవం ? అసలు మీరు ఏం చెప్తున్నారు అంటే గాయత్రిని మీరు సమంగా చెయ్యలేదు అన్నాడట. ఇది కూడ అశ్వమేధ పర్వంలో మహాభారతంలో వస్తుంది ఈ కథ కూడ గాయత్రిని నిత్యము అనుష్టించేటటు వంటి గాయత్రే కదా! ఋషులము కదా అందులోను, మేము గాయత్రిని సమంగా చేయలేకపోవడం ఏమిటి అన్నారుట- అంటే గాయత్రి అంటే శ్వాస. శ్వాస అంటే కాలము కదా. అసలు కాలమెక్కడ వుంది అన్నాడుట ? కాలం ఎక్కడ వుంది అని మనకు అనుమానం వస్తుంది. కాలం లేకపోవడమేమిటి ? ఇప్పుడు

మనం మాట్లాడుకుంటున్నాం కదా. ఇది అంతా మాట్లాడుకుంటున్నామని తెలుస్తోంది కదా! ఇదంనమమ అని తెలుసు. భూత, భవిష్యత్, వర్తమానాలు.

కాస్త జాగ్రత్తగా ఆలోచించండి గాయత్రి మంత్రము అంటేనే ప్రజ్ఞ. మీరు కాస్త జాగ్రత్తగా ఆలోచిస్తే, ఏ కాలం గురించి అయితే మీరుఇంత గొప్పగా చెప్పుకుంటున్నారో అసలు ఆ కాలము లేనేలేదు అన్నట్టు ఒప్పుకో అన్నారట సరే 'నిన్న' అనేది ఇప్పుడు లేదు కదా అన్నాట్ట సరే లేదు అన్నారుట. రేపు అనేది ఇపుడు లేదు కదా! అన్నాట్ట- సరే లేదు అంటే ఉన్నదేంటి ? ఇవాళ. ఒప్పేసుకున్నాం అన్నారట ఇపుడు సాయంత్రం 5 గంటలైంది కదా! అంటే సాయంత్రం 5 గం॥లు Past tenseలో కదా- జరిగిపోయింది కదా! 7 గం॥లు రాబోయే కాలం. ఇంకా రాలేదు కదా అన్నాట్ట correct. అయితే నిముషాల కొద్దాం. నిముషం నుంచి సెకను కొద్దాం ఒక సెకండు వెనుక past ఒకసెకను ముందర Future కదా! మరి Fraction of second వుండేది కదా! వర్తమాన కాలం. కాని మరి ఆ వర్తమాన కాలాన్ని మీరు ఉచ్చరించే లోపల అది భూతంగా మారిపోతుంది pastగా వుచ్చరించకపోతే Futureలో వుండిపోతుంది కదా! మరి వర్తమానం ఎక్కడ ఉంది ? అన్నాట్ట. భూత భవిష్యత్‌లు లేవు. వర్తమానాన్ని మీరు పట్టుకోలేరు అంచేత మొత్తం భూత భవిష్యత్ వర్తమాన కాలాలు ఎక్కడ వున్నట్టు ? అసలు ఎక్కడా వున్నట్లు లేవే అన్నాట్ట. అర్ధం అయి అవనట్లు వుంది అన్నార్ట శిష్యులు నేను అదే అనుకున్నాను. మీరుఅదే అనుకున్నారేమో కాని అశ్వము అనే పదానికి అర్థం నిత్యనూతనమైనటువంటి- కాలతీతమైనటువంటి ఒకస్థితి గురించి మనం ఇప్పుడు మాట్లాడుకున్నాము. సెకనులో ఒక సెకను ముందు- అది భూతము (కాలము) ఒక సెకను రాబోయేది భవిష్యత్ ఈ క్షణము వర్తమానము నిజమే కాని ఈ 'క్షణం' అనే లోపల ఏమౌతుంది? అది pastకి వెళ్ళిపోతోంది. ఈ 'క్షణం అనే ముందు అది భవిష్యత్‌లో వుంది. కనుక మనము పట్టుకోగల్గేది భూత, భవుష్యత్‌లనే, వర్తమాన కాలాన్ని పట్టుకొలేము పట్టుకోలేని వర్తమానం లేదు. అది కేవలము ఒక బిందువు మాత్రమే ఆ బిందువుని 'అశ్వము' అంటాము. ఆధ్యాత్మిక సాధనలలో మన భారతదేశములో, బొట్టు పెట్టుకొనే స్థానాన్ని బిందువు- అక్కడ ఈ నిత్య శాశ్వత, సనాతన నూతనమైనటువంటి బిందువు ఉన్నది అక్కడ మీ ధ్యానము పెట్టుకోండి మీ'మేధ' మీ యొక్క ధారణాశక్తిని అక్కడ పెట్టుకోండి- ఆ

'అశ్వము' అనే బిందువు మీద ఇది అశ్వమేధము యొక్క నిరంతరము మీరు చేసుకోవలసిన సాధన. ఈ అశ్వమేధ సాధన చేస్తున్న వ్యక్తులకు తర్వాత ఏ విధంగా అశ్వమేధ యజ్ఞము భౌతిక జగత్తులో చేయాలో అనే విధానం చెప్ప డానికి, అశ్వము అనే పదానికి మూడు అర్థాలు మనము తెలుసుకున్నాము. సంస్కృతంలో అశ్వము అనే పదానికి వ్యుత్పత్తి అర్థాన్ని కనుక మనం తెలుసు కోవడానికి ప్రయత్నం చేస్తే, యోగార్థాన్ని మనం తెలుసుకోవడానికి ప్రయత్నిస్తే దాని అర్థం ఏమి వస్తుంది అంటే-

1) తీవ్రమైన వేగం కలది. ఇప్పుడు కూడ అదే అంటాం కదా! Horse power అంటాం ఒక వస్తువు యొక్క గతి తీవ్రత తెల్పాలి అంటే 1 H P, 2 H P అంటాం. కనుక అశ్వము అంటే చాలా వేగం కలది

2) అన్ని మార్గాలలో ప్రయాణించ గలిగేది.

3) చాలా ఎక్కువగా ఆహారం స్వీకరించేది.

ఈ చాల ఎక్కువగా ఆహారాన్ని స్వీకరించేది, చాలా ఎక్కువ వేగం కలది, అన్ని మార్గాలలో తిరగగల్గేది మనకు తెల్సినంత వరకు- "మనస్సు" అంచేత మనస్సును కూడ అశ్వము అంటారు అంచేత ఈ అశ్వాన్ని 'మే''ధ' ధారణ చేయగలిగితే మనం ఇది అశ్వమేధము ఇది ఒక రకం. అశ్వమేధాలలో చాలా రకాలు వున్నాయి సర్వత్రా వ్యాపించి వుండి అన్ని చోట్ల ఉన్నటువంటి శక్తిని ఈశ్వరుడు అంటారు. సర్వవ్యాప్తుడైన ఈశ్వరుడు కూడ అన్నిచోట్ల వ్యాపించి అన్నిటిని స్వీకరిస్తున్నాడు కనుక ఈశ్వరుడిని కూడ అశ్వము అంటాం మనము సూర్యుని యొక్క కిరణాలు సర్వత్రా వ్యాపించి ఉన్నాయి సర్వత్రా వ్యాపించి ఉన్నపుడు-చాలామంది నన్ను ఏమడుగుతూ ఉంటారు అంటే మాష్టారు గాయత్రిని సూర్యుడున్నపుడే చెయ్యాలి కదా? అని అవును ఖచ్చితంగా సూర్యు డున్నపుడే చెయ్యాలి. correctలి కాని సూర్యుడు లేని క్షణం ఎక్కడ ఉంది. అని. రాత్రి మనకు అయ్యింది కాని, మనకు రాత్రి అయినపుడు సూర్యుడు లేడా? సూర్యుడే ఉండి ఉండకపోతే అసలు పృథ్వి ఉండదు. అది ఎక్కడో క్రింద పడిపోతుంది మన కంటికి దృగ్గోచరము కాదు, కాని సూర్యుడు లేని క్షణంలేదు ఎక్కడా ప్రపంచంలో. సర్వ వ్యాపకుడు సూర్యుని యొక్క బింబము మనకు ఒకచోట కనిపించవచ్చు.కాని సూర్యుని కిరణాలు, ఆకర్షణ శక్తి నిరంతరము ఉంద

బట్టే మనం జీవించి ఉన్నాం. కాని, ఒక క్షణంలో వెయ్యోవంతు సూర్యుని ఆకర్షణ శక్తి తగ్గిపోతే ఈ సంపూర్ణ సౌరమండలము క్రింద పడిపోతుంది.

కనుక సర్వత్రా వ్యాపించి ఉన్న ఈ సూర్యుడ్ని కూడ అశ్వం అంటాం. అశ్వం అంటే సర్వత్రా వ్యాపించి ఉన్నది అని అర్థము కనుక "సూర్యోవ అశ్వః" ఈ సూర్య శక్తియే అశ్వము. ఈ సూర్య శక్తిని ధారణ చేయగల్గటం, ఇదొక అశ్వమేధము ఇది సూర్యుడికి సంబంధించిన అశ్వమేధము. కాని సూర్యుడు ఒకడేనా? చంద్రుడు లేడా? చంద్రుడు కూడా సూర్యుడున్నంత వరకు మనకు అనేక రకములయిన మానసిక ప్రవృత్తులని కలగచేస్తూ ఉంటాడు. అమావాస్య నుంచి పౌర్ణమి వరకు జరిగేటటువంటి సూర్యచంద్రుల మధ్య కోణాలను బట్టి – ఈ సూర్య చంద్ర కోణాలను బట్టి అనే పదం వాడితే మళ్ళీ మనం కోణం అంటే ఏమనుకుంటాం? రెండు గీతల మధ్య ఉన్నటువంటి angle అనుకుంటాం. కాని దృష్టి కోణం పదం మనం వాడుతూనే వుంటాం. దృష్టి కోణం అంటే చూ సే ట టు వ ం టి విధానము అంచేత చంద్రుడు మనం చూసేటటువంటి విధానం నిరంతరం ఉంటుంది. ప్రతి వ్యక్తి తన మనస్సుకు సంబంధించినంత వరకు ప్రపంచాన్ని తన దృష్టితోనే చూస్తూ ఉంటాడు. కనుక చంద్రమా అశ్వః చంద్రుడు కూడా అశ్వమే ఈ విధంగా చాంద్రాయణ యజ్ఞాలని, సౌర యజ్ఞాలని, మనో యజ్ఞాలని, రకరకాల యజ్ఞాలన్ని అశ్వమేధ పరంపరలోకి వస్తాయి. కాని ఇవి అన్నీ అశ్వమేధ పరంపరలోకే వచ్చినప్పటికి కూడ– పంకజం అంటే మట్టిలోంచి పుట్టినవని మనం చెప్పుకున్నాము. పంకజం అంటే గబుక్కుని మనం అర్థం పద్మము అని చెప్తాము ఇంకొక అర్థానికి వెళ్ళం మనము దాని అంతరార్థం అడిగితే తప్ప అదేవిధంగా అశ్వమేధము అనే పదానికి అర్థం ఏంటి అంటే శక్తి— సర్వత్రా వ్యాపించి వున్న శక్తి. ఈనాడు Science కూడ ఏమని చెపుతున్నది అంటే energy శక్తి నిత్యత్వ నియమం ప్రపంచాని కంతటికీ ఆధారం. ప్రపంచం అంతా కూడా శక్తిమీదే ఆధారపడి ఉన్నది

కనుక సర్వత్రా వ్యాపించి ఉండేటటువంటి శక్తి, దానిని ధారణ చేసేటటువంటి శ్రేష్ఠమైనటువంటి బుద్ధి—ఈ రెంటి సంయోగమే అశ్వమేధము. అంటే ఏమిటన్నమాట? అశ్వమేధము అంటే ఏ విధంగా అర్థం చేసుకోవాలి? మానవ సమాజంలో శ్రేష్ఠమైనటువంటి, పురుషార్థం చేయగల్గినటువంటి వ్యక్తుల సము

దాయము, అద్భుతమైనటువంటి, మహత్తరమైనటువంటి, శ్రేష్ఠమైనటువంటి ఆలోచనలను, కార్యరూపం దాల్చడానికి అవసరమైనటువంటి, సామూహిక ప్రయత్నాన్ని అశ్వమేధము అనే పేరుతో పిలుస్తారు. అంచేత అశ్వమేధము మనం చేయబోతున్నాము అంటే రెండు పనులు మనం చేయబోతున్నాము అని అర్థం. Simpleగా మనం చెప్పాలి అంటే వశిష్ఠ, విశ్వామిత్రుల సంయోగం జరుగుతోంది అని అర్థం. వశిష్ఠ, విశ్వామిత్రుల సంయోగం అంటే ఏమిటి? విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కాకముందు, క్షత్రియుడిగా ఉన్నప్పుడు వశిష్ఠ ఆశ్రమం లోనికి వెళితే, వశిష్ఠుడు అన్నాడట, ఉండిపోండి భోజనానికి. నవ్వుకున్నాడు విశ్వామిత్రుడు. నీకు తెలియదేమో నేను రాజుని, ఉండిపోండి అంటున్నావు నన్ను. రాజ పరివారం అంటే ఒక్కళ్ళు రారు. కొన్ని వేలమంది వస్తారు నాతోపాటు ఏదో నేనొక్కడిని వచ్చాననుకొని నువ్వు ఉండిపొమ్మంటున్నావు. నా సేనలను నేను ఆశ్రమం అవతల ఎక్కడో ఆపాను, మీ ఆశ్రమం శాంతి భంగం అవుతుందని. మిమ్మల్ని దర్శనం చేసుకొని వెళ్ళిపోదామని వచ్చాను అంటే తీసుకురండి అందరిని అన్నాడుట వశిష్ఠుడు సరే అందరికీ భోజనం పెట్టాడు. మీ అందరికీ ఆ కథ తెలిసిందే.

విశ్వామిత్రుడు ఆ ఆవుని నాకు ఇచ్చేయ్యమన్నాడు. తీసుకోగల్గితే తీసుకు వెళ్ళిపో అన్నాడు ఎంచేత? అంటే మానసికమైనటువంటి శక్తిని, శ్రేష్ఠమైనటువంటి ఆలోచనలని మీరు ఎలా తీసుకువెళ్ళగలరు? ఎవరయినా బలంతో తీసుకు వెళ్ళాలి అంటే తీసుకు వెళ్ళలేరు దానిని అప్పుడు విశ్వామిత్రుడు అర్థం చేసుకుని నాకు ఈ క్షత్రియ బలం అక్కరలేదు ఈ బ్రహ్మబలం కావాలి ఈ ఆలోచనా బలం కావాలి అంటాడు. అశ్వమేధం కూడ ఇదే. క్షత్రియబలం, పురుషార్ధము, సామూహిక శక్తి - ఉత్కృష్ఠమైనటువంటి చింతనతో కలిపితే ఇవి రెండూ కనుక సంయోగం చెందగలిగితే ఆ సమాజం మొత్తం మారిపోతుంది. "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః స్వయత్ ప్రమాణం కురుతే"— గొప్పవాళ్ళు, శ్రేష్ఠులు ఏ విధమైనటటువంటి ఆచరణ చేస్తూ ఉంటారో అదే ఆలోచన అందరూ చేస్తారు అని కోరుకుంటారు కనుక, అశ్వమేధ యజ్ఞము భారతదేశంలో జరిగినప్పుడల్లా కూడ, భారతదేశంలో జరిగే అశ్వమేధ ప్రక్రియలంతా కూడ రెండు రకాల సమన్వయీ కరణ చేయడానికి చేసే ప్రయత్నాలు. ఏమిటి ఆ రెండు రకాల శక్తులు? ఒకళ్ళకి చాలా ఎక్కువ పురుషార్థం ఉంటుంది. చేయగల్గే సామర్థ్యం ఉంటుంది.

కాని ఏం చెయ్యాలో తెలీదు వాళ్ళకి. ఏమి చెయ్యాలో తెల్సిన వాళ్ళకి ఎలా చెయ్యాలో తెలీదు. దానికి కావలసినటువంటి పురుషార్ధం ఉండదు కనుక, పనులు చేయగల్గే శక్తి ఉత్కృష్టమైనటువంటి ఆలోచనల సమూహము, ఈ రెండూ కలపటానికి చేసే ప్రయత్నమే అశ్వమేధము

ఈ అశ్వమేధ పరంపరలో—ఈ మేధా యజ్ఞ పరంపరలో 4 యజ్ఞాలు చాల ప్రముఖపాత్ర వహిస్తాయి. అవి సర్వమేథము, నరమేధము, గోమేధము ఈ మూడు మేధాయజ్ఞాలు అయిన తర్వాత మాత్రమే అశ్వమేధ యజ్ఞము చేయాలి తప్ప ఇంతకు ముందు అశ్వమేధ యజ్ఞము చెయ్యడానికి ఎవరికి అర్హత లేదు అన్నాడు. మరి ఈనాడు ఇక్కడ కూర్చొని మీ అందరికి కూడా అశ్వమేధ యజ్ఞాలలో పాలుపంచుకోండి అనే ఆహ్వానాన్ని అందచేస్తున్నాను అంటే, మన ఋషులు అశ్వమేధ యజ్ఞానికి చెప్పినటువంటి మొట్టమొదటి Conditionsలో సర్వమేధము, నరమేధము, గోమేధము ఈ మూడు రకాలైనటువంటి యజ్ఞాలు పూర్తి చేసుకున్నటువంటి వాళ్ళకి మాత్రమే అశ్వమేధం చేసేటటువంటి అర్హత వస్తుంది తప్ప అంతకంటే ముందు మీకు ఇది చేసేటటువంటి అర్హత లేదు. అని చెప్పినపుడు, ఈ ఆహ్వానాన్ని మీకు అందిస్తున్నపుడు, ఏ గురు సత్తాతో, ఏ దేవీ శక్తితో, ఈ దైవీశక్తితో, ఈ ఆహ్వానాన్ని మీకు అంద చేస్తున్నానో ఆ దైవీశక్తి ఎక్కడో అక్కడ ఎలాగో అలాగ ఈ మూడు రకాల మేధాయజ్ఞాల సంపన్నం చేసి వుంటేనే కదా అది జరిగేది కాని ఏ విధంగా అర్జునుడు నీరసించిపోయి నేను ఏమీ చేయలేను అనుకుంటే, అదంతా ఎప్పుడో జరిగిపోయింది. గుర్తు చేసుకో దానిని అన్నాడు. అలాగే మనందరం కూడ ఈ సర్వమేధ, నరమేధ, గోమేధ యజ్ఞాలను చేయవలసిన అవసరం లేదు అది ఎప్పుడో జరిగిపోయింది. కాని వాటిని ఎలా చేసుకున్నాము? ఎలా చేసుకుందాము గుర్తు చేసుకుంటే భగవద్గీతలో అర్జునుడు చెప్పినట్లే "స్మృతిర్లబ్ధ్వా" నాకు గుర్తొచ్చింది ఇంక పరవాలేదు. మేము చేసేస్తాము. అనగలుగుతాము. ఎలా చేసామో చూద్దాము మనము. సర్వమేధం యజ్ఞాలలో సర్వమేధ ప్రక్రియ చాలా ప్రముఖ పాత్ర వహిస్తుంది. అని చెప్పకుంటూవచ్చాను నేను. ఒకసారి ఆ 3 Points గుర్తుంచుకోండి. యజ్ఞము అంటే ఉపాసన, మంచి గుణాల అలవాటు చేసుకొనుట అనేది గుర్తుంచుకోండి. భారతీయ సంస్కృతిని మనం ఎంత మర్చిపోయాము అంటే యజ్ఞము అనగానే అన్ని

పుల్లలు గుర్తొస్తాయి, తప్ప ఈ 3 అర్థాలు గుర్తురావు కనుక యజ్ఞము అనే పదాన్ని మళ్ళీ మళ్ళీ నెమరు వేసుకుందాం యజ్ఞమంటే ఉత్కృష్టమైన ఆలోచనలు పెంపొందించుకోవడానికి చేసేప్రయత్నము రెండవది యేమని చెప్పకున్నాం మనం. యజ్ఞమంటే "సంగతీ కరణము" సమన్వయము చేసుకోవడం. ఒకదానితో నొక దాన్ని Collaberate చేసుకోవడం కలసి పనిచేయడం- Co-operation మూడ వది యేం చెప్పాం మనం-యజ్ఞమంటే త్యాగము. త్యాగము చేయగల్గినటువంటి Capacity చివరకు యెంతవరకు త్యాగము యొక్క గొప్పతనం మనము చెప్ప కున్నామంటే శ్రీకృష్ణుడు మిగతా ఋషులు చేసిన అశ్వమేధ యజ్ఞము కంటే గొప్పదయినది-ఆహారాన్ని త్యాగం చేసినటువంటిది ముంగిస కథలో చెప్పుకున్నాం కదా! ఇదీ త్యాగమంటే.

సద్గుణములను పెంపొందించు కొనుట . సంగతీ కరణము, కలిసి జీవించ గలుగుట, త్యాగము-ఇవన్నీ మనకు తెలియకుండానే కుటుంబ వ్యవస్థలో జరిగి పోతున్నాయి. గార్హస్థ జీవితంలో "సర్వమేధము" అనే ఈ ప్రక్రియ మనకున్న దంతా యింకొకరికి యిచ్చేసే ప్రక్రియ. మనకు తెలియకుండానే జరిగిపోతూ వుంటుంది. దీనిని గురించి నేను పెద్ద Planation చెప్పనక్కరలేదు. ప్రతి తల్లీ, తండ్రీ చేస్తూనే వుంటారు అందరూ ఎవరో ఒకరికి తల్లీ, తండ్రి కనుక ఈ సర్వ మేధము దానంతట అదే మనకు జరిగి పోతుంది ఆలోచించటం లేదు. ఎంతెంత త్యాగాలు చేస్తామో! ఎవరో ఒకరు ఒక్క చిన్న మాట అంటే జీవితాంతం పట్టించు కుంటాం. మన పిల్లలు మనల్ని ఎన్ని మాటలు అనేసినా, మనం పిల్లల్ని ఎన్ని మాటలు అన్నా ఎవ్వరూ ఏమీ పట్టించుకోవడంలేదు గదా! ఇంతకన్నా సర్వమేధ యజ్ఞానికి Proof ఏం కావాలి?కాని మేధాయజ్ఞం అనేసరికి అక్కడ యేదో అగ్ని, పుల్లలు పెట్టుకొని, నిప్పంటించుకుని "స్వాహా" అంటేనే యజ్ఞము అనేటటువంటి తప్పుడు భావన రావడంవల్ల ఈ సర్వమేధ యజ్ఞము మనలోనే జరుగుతోందని గుర్తులేదు. అంచేత ఈ సర్వమేధ యజ్ఞము తర్వాత ఏం చెప్పాను? 'నరమేధం' ఈ నరమేధం అనేటటువంటిది మన జీవిత విధానంలో కనుక మనం జాగ్రత్తగా ఆలోచిస్తే అనేకమంది వ్యక్తులు వాళ్ళ వాళ్ళ శారీరక, భౌతిక సుఖాలన్నీ టిని వదిలేసుకుని, ప్రయోగ శాలలో అహర్నిశం కృషిచేసి సంపాదించిన అద్భుత మయిన జ్ఞానాన్ని ఈనాడు మనమందరం వుపయోగించుకుంటున్నాం. ఒక వ్యక్తి చేసాడు. ఆ వ్యక్తి చేసిన ఫలితం మనకందరికీ లభిసుంది. కొంతమంది సైనికులు

యుద్ధం చేస్తారు. దానివల్ల లభించిన స్వాంతంత్ర్యము మనకందరికీ వస్తుంది నర మేధం అంటే వ్యక్తి తన సర్వస్వాన్ని, వ్యక్తిత్వాన్ని సమాజానికి వుపయోగ పడటానికి కావలసినట్లుగా జీవించ గల్గడం—నరమేధం ప్రతీ వ్యక్తి తన తన స్థాయిలో నరమేధం చేస్తూ వుంటే శాస్త్రజ్ఞుడు, వైజ్ఞానికుడు గురువులు మిగతావాళ్ళ వాళ్ల వాళ్ళ స్థాయిని బట్టి నరమేధం జరుగుతూనే వున్నది. ఒకటి, ఒకటి దేశంలో ఆవిష్కరించబడితే రెండో రోజు అది ఆవిష్కరించబడే సరికి అందరూ దాన్ని వుపయోగించుకుంటారే తప్ప దాన్ని మనం ఎందుకు వుపయోగించుకోవాలి? ఎందుకు వుపయోగించకూడదు అనే మీమాంస, చర్చ రావడం లేదు. ఇది నర మేధము. తర్వాత గోమేధము ఈ గోమేధము అశ్వమేథ పరంపర అంత సామాన్యంగా మనకు కన్పించదు కాని భారతదేశములో ఇది చాలా ఎక్కువ కన్పిస్తుంది గోమేధము అనేది యజ్ఞము.

'గో' అనే పదానికి 'వాణి' 'మాట' అనే అర్థం వుంది 'శాపానుగ్రహ కారిణి' (లలితా సహస్ర నామాలలో) భారతీయ ఋషి పరంపర యొక్క అన్ని రకాల ఆలోచనల యొక్క సమగ్ర వికాసం లలితా సహస్ర నామాలలో మనకు కన్పిస్తుంది అందులో 'శాపానుగ్రహకారిణి' అంటే వాక్కు ద్వారా అనుగ్రహం —కావలసినటువంటి ఆనందాన్ని సంపదను ఇవ్వటమే కాక శపించగలగడం కూడా. అంటే దుష్ప్రవృత్తులను అణచి వేయడము గోమేధము—"వాచామే విశ్వ భేషజం" నా మాట విశ్వానికి ఔషధంగా పనిచేయాలి. మీరు కాస్త జాగ్రత్తగా ఆలోచిస్తే మొత్తం మహాభారతం ఇద్దరు సారథుల మీద ఆధారపడి వుంది ఒక ప్రక్క శ్రీకృష్ణుడు సారథి వేరే ప్రక్క శల్యుడు-శల్యసారథ్యము-కర్ణునికి సారథిగా పని చేస్తాడు. ఆ ఇద్దరు సారథులలో మాట యొక్క ఔషధ గుణము మనకు కన్పిస్తూ వుంటుంది. ఔషధి రెండు రకాలుగా పని చేస్తుంది. ఔషధి ఒకసారి ప్రాణాలను ఇచ్చేటట్టుగా పనిచేస్తుంది అదే వికటిస్తే విషంలా కూడా పనిచేస్తుంది. గోమేధ యజ్ఞంలో వాక్కు యొక్క శక్తిని ఎలా వుపయోగించుకోవాలో చెప్పేదే ఇటు కృష్ణ సారథ్యము-అటు శల్య సారథ్యము "నేను యుద్ధము చేయను. నేను నెత్తురు కూడు తినలేను" అని పలికి యుద్ధవిముఖుడైన వ్యక్తిచేత యుద్ధం చేయించడం అనేది ఈ వాక్కు యొక్క గొప్ప శక్తి అన్ని రకాల శక్తులు వుండీ ఒకే ఒక్క బాణంతో అర్జునుని నేను చంపేయగలను అని తెలుసునా, సారథి యొక్క వాక్కువిని, తన సాహసాన్ని కోల్పోయి ప్రాణాల్ని కోల్పోయినవాడు కర్ణుడు. ఈ

గోమేధయజ్ఞాన్ని మనం ఈనాడు చేస్తున్నాం- కాని మీరు కొంచెం జాగ్రత్తగా గుర్తుంచుకోండి. మనం కూడ ఈ గోమేధము చేస్తూనే వున్నాము. కాని ఈ గోమేథము శల్య సారధ్యంలాగ అవుతున్నదే తప్ప, ఇతరులను ఉత్సాహ పరచడానికి మాత్రము మనం వాక్కుని వుపయోగించుకోవడం లేదు. అధర్వణ వేదంలో గోమేధం యొక్క వివరణ చెప్తూ ఎలా వుండాలి? అని చెప్తే "మధు మన్మే విక్రమణం మధు మన్మే పరాయణం వాచావదామి మధువతే, భూయాసం మధు సంస్థితే "మధు మన్మే విక్రమణం—ఏదైనా ఒక మాట నోటి నుండి వస్తే అది తియ్యగానే వుండాలి. ఇతరులను బాధ పెట్టేదిగా వుండకూడదు. అటువంటి వాక్కును నాకు ప్రసాదించమంటాడు మధు మన్మే విక్రమణం, మధు మన్మే పరాయణం-నేను అందమైనటువంటి మాటలలోనే తేవాలి. ఎక్కడ కూడ నా మనస్సులో వచ్చే ఆలోచనలు కూడా తియ్యగానే వుండాలి తప్ప యితరులను బాధ పెట్టే ఆలోచనలు రాకూడదు వాచావదామి మధువత్-నాలోంచి మాట కూడ తియ్యగా వుండాలి ఇంతవరకు బాగానే వున్నది ఇంతసేపు యేం చెప్పేది నేను చెప్పలేను నీకు. భూయాసం మధు సంస్థితే-నేనే తియ్యగా అయిపోవాలి అన్నాడు అటువంటి వాక్కు కావాలి.

తేనె లాంటి వాక్కు కావాలి. మహా పురుషుల యొక్క జీవితాన్ని మనం చూస్తూ వుంటే ఎప్పుడూ కూడా వాక్కు బంగారు అనేటటువంటి మాట ఒక మహా పురుషుడి యొక్క ఊత పదం అయితే, నీవు ఏం చేసినా సరే, ఎప్పుడూ నేను నీ వెంటనే వుంటాను అని ఇంకో మహా పురుషుడు ఉపయోగిస్తూ వుంటే, ఈ మహా పురుషుడి యొక్క వాక్కుని మనం ఆలోచిస్తూ కూడా, మన వాక్కును మనం ఎలా వుపయోగిస్తామో చూస్తూ వుంటే, ఇంకా గోమేధము మనకు వంట పట్టలేదు అని అర్థం. అంటే గోమేధము అంటే ఏమిటి? అంటే మన వాక్కు ఎప్పుడూ ఇతరులను వుత్సాహ పరిచేటట్టు వుండాలి తప్ప ఇతరులను నిరాశ పరిచే టట్లు వుండకుండా వుండేటటువంటి వాక్కు. అంటే మన వాక్కు యజ్ఞ రూపంలో వుండాలి. అంటే మన వాక్కు ద్వారా దేవ పూజనం జరగాలి. అంటే మన వాక్కు ద్వారా సత్ప్రవృత్తుల ఉత్పత్తి జరగాలి. లేకపోతే మన వాక్కు వలన సంగతీకరణం జరగాలి. మనుష్యులు కలిసేటట్లు మనం చేయాలి. ఇదీ లేకపోతే మన వాక్కు ద్వారా త్యాగం చేయగల్గేటటువంటి మనో భూమిని మనం చేయ గల్గితే అదే నిజమైనటువంటి గోమేధం తప్ప, గోమేధం అని చెప్పి, ఒక ఆవుని

తీసుకు వచ్చి ఫటేల్ మని దానిని వేసేసి నేను గోమేధ యజ్ఞము చేశాను అని అంటే అది ఏ సంస్కృతికి చిహ్నము? అని చెప్తూ మహాభారతంలో ఒక శ్లోకం చెప్తాడు. అదేమంటే వృక్షాలను కాల్చివేసి జంతువులని చంపి రక్తాన్ని ప్రవహింప చేస్తే అది స్వర్గానికి దారి అయితే నరకానికి ఏది దారి అని అడుగుతాడు. అంటే అర్థం ఏమిటి? మీరు చేసే పనిని బట్టి ఫలితం ఉంటుంది ఎటువంటి విత్తనం నాటితే అటువంటి ఫలితం వుంటుంది అని మనం repeated గా చెప్పుకుంటూ కర్మ సిద్ధాంతాన్ని అక్షరాల నమ్ముతూ ఇతరులకు హింస కలగ చేసేపని నాకు ఆనందం కలగ చేస్తుందనేటటువంటి భ్రమకు లోనవుతూ వుంటే అది ఏమి సంస్కృతి? దానిని ఎలా అర్థం చేసుకుంటాము.

అజము అంటే మేక కాదు. అది ఒక రకమైన బీజము ఎటువంటి బీజము? 'జ' అంటే జన్మ లేనటువంటి బీజము. జన్మలేనటువంటి బీజమును నాటి మీరు యజ్ఞం చేయండి అంటే మీరు మేకను తీసుకొచ్చి కోసేస్తానంటే ఏం చెప్పేది నేను? అంటాడు. ఆఖరికి చిన్న –చిన్న పురుగులు అక్కడ ఉంటే అవి ఎక్కడ అగ్నిలో పడి కాలిపోయి నశిస్తాయో అని యజ్ఞగుండం చుట్టూ చిన్న కందకం లాంటిది చేసి దాంట్లో నీరు పోస్తాము మనము. అధర్మము అంటే హింసలేనిది అని చెప్పుకుంటూ హింసాత్మకమైన ప్రవృత్తిని యజ్ఞము లోనికి తీసుకురావడానికి కారణమేమిటంటే యజ్ఞమంటే నిన్న మీకు చెప్పాను కదా? రాజుగారు రాజమహిషిని కలుసుకుని వచ్చారు అంటే తమ సంస్కృతి పరిజ్ఞానం ఉపయోగించి రాజుగారు తన ద్వారా పెంచబడిన గేదెను కలుసుకుని వచ్చారు అని అర్థం చెపితే పాండిత్యం correct అవ్వచ్చుగాని, శబ్దార్థము correct అవ్వచ్చుగాని, భావార్థము ఖచ్చితంగా తప్పే. అలాగే యజ్ఞమయ జీవితము, త్యాగమయ జీవితము అధర్మము – హింస లేనటువంటి జీవితము ప్రబోధించేటటువంటి భారతదేశ సంస్కారపు ఔన్నత్యము హింసను కోరుకున్నది అనుకుంటూ చేసే యజ్ఞ ప్రక్రియను అర్థం చేసుకోలేకపోతే చివరకు మళ్ళా మనం అదే తప్పు చేస్తాం – అంటే గోమేధము – వాచామే విశ్వభేషజం నా మాట ఈ విశ్వాని కంతకి ఔషధంలా పని చేయాలి.

ఈనాడు ప్రపంచమంతా కూడా భారతదేశం వైపు ఆశతో చూస్తోంది అంటాడు శ్రీ అరవిందులు. ఎందుకు ఆశతో చూస్తున్నది అంటే మానవీయ సంస్కృతిని అర్థం చేసుకుని, మానవీయ జీవిత విధానాన్ని అర్థం చేసుకుని,

మానవ జీవితానికి ఒక శాస్త్రీయమైన స్థాయిని ఏర్పరచి ఒక వైజ్ఞానికమైన పంథాను కల్పించి– నువ్వు ఇలా చెయ్యి దీని ఫలితం ఇలా వుంటుంది. ఖచ్చితంగా ఈ ఫలితం ఇలాగే వుంటుంది అనే వైజ్ఞానిక దృష్టికోణాన్ని ఇక్కడ అద్భుతంగా Devolop చేసాము కాని ఈ అద్భుతంగా Develop చేసిన విషయాన్ని గాయత్రితో కలపక పోవడం వలన, యజ్ఞ విధానాన్ని గాయత్రితో కలపక పోవడము వలన వచ్చిన బాధ ఇదంతా. అంచేత ఈ దేవ సంస్కృతి దిగ్విజయ యాత్ర నిజంగా దిగ్విజయం కావాలంటే మనం గాయత్రి – యజ్ఞము యొక్క భావనాత్మక పక్షాన్ని నిరంతరము గుర్తుంచుకోకపోతే మళ్ళీ గాయత్రి అంటే ఒక అక్షర సముదాయము మాత్రమే అని – మీరు నేను చెప్పే మాటలని తప్పుగా అర్థం చేసుకోవద్దు. గాయత్రి అంటే "ఓం............ప్రచోదయాత్" కాదు అని అంటంలేదు నేను గాయత్రియే అది. కాని అది మాత్రమే గాయత్రి అని, అక్కడ మాత్రమే మీరు ఆగిపోతే, గాయత్రి మహిమ యొక్క అద్భుత శక్తిని మీరు ఉపయోగించుకోలేరు ఎందువల్ల? భారతీయ ఋషులు మనకందించినటువంటి ఒక విశుద్ధమైనటువంటి ఆధారం ఏమంటే మనం జీవించడంలో నిజమైనటువంటి ఆనందాన్ని ఎందుకు పొందటం లేదు అంటే మన జీవితంలో మనకి తెలుసున్నది 1/3 మాత్రమే. జాగ్రదావస్థ మాత్రమే మిగతా రెండు పాదాలు గురించి మనం పట్టించుకోవడం లేదు. వాటిని వుపయోగించుకోవడం లేదు స్వప్నావస్థ, నిద్రావస్థ ఇవి గాయత్రి యొక్క 3 పాదాలు. దీన్నే ఓంకారం యొక్క 3 పాదాలు అని కూడ అంటారు జాగ్రద్, స్వప్న, సుషుప్తి స్థాయిలో అర్థం చేసుకోవడానికి అర్హత ఏమిటంటే మీరు ఈ మూడు రకాలు (యజ్ఞాలను) చేసి ఉండగల్గడమే. బంగారాన్ని ఉపయోగించుకోవడానికి, నగ చేసుకోవడానికి అర్హత ఏమిటంటే మీ దగ్గర బంగారం వుండడమే. బంగారం మీ దగ్గర వున్నప్పుడు దానిని మీరు వుపయోగించే అర్హత మీకు ఎలా వచ్చేస్తుందో అలాగే ఓంకారాన్ని ఓంకారం నుంచి ఉత్పన్నమైన వ్యాహృతుల్ని, వ్యాహృతుల యొక్క explanation ఉత్పత్తి అయినటువంటి 24 అక్షరాల గాయత్రీమంత్ర సముదాయాన్ని మీరు ఉపయోగించుకోవాలి అంటే ఒకే ఒక అర్హత కావాలి అది ఏమిటంటే జాగ్రత్, స్వప్న, సుషుప్తులను మీరు పొంది వుండాలి పొంది వున్నారో లేదో ఒకసారి మిమ్మల్ని మీరు అడగండి. పొంది ఉండకపోతే ఖచ్చితంగా మీకు గాయత్రి చేసే హక్కు లేదు ఓంకారం ఉచ్చారణ వినే హక్కు లేదు. దీన్ని గురించి వినే హక్కు లేదు. అంటే ఏమిటి? మీరు మెలకువగా వున్నారా? లేదా? అని ఒకసారి ఆలోచించు

కోండి మీరు కలలు కంటున్నారా? లేదా? ఆలోచించుకోండి మీరు నిద్రపోగల్గు తున్నారా? లేదా? ఆలోచించుకోండి ఈ 3 అవస్థలు లేని జీవి ఎవడూ లేడు. అందువల్ల యావత్ సృష్టికీ, యావత్ ప్రపంచానికి కూడా దీన్ని అర్థం చేసుకునే టటువంటి అర్హత వున్నది కాని, మళ్ళా మనం ఎక్కడ తప్పు చేస్తున్నామంటే ఉపాసన, సాధన, ఆరాధన అనేటటువంటివి కేవలము ఒక గదికి మాత్రమే పరి మితము అయిపోయింది భగవంతుడు అంటే ఒక్క గుడిలో మాత్రమే వున్నా డనుకొని, తర్వాత ఆ భగవానుని అంతటా చూడలేకపోతే "విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని......" విద్యా వినయముతో సంపన్నమైనటు వంటి బ్రాహ్మణులు ఆవుల్లో, ఏనుగుల్లో, ఆ భగవంతుణ్ణి చూడటం చాల easy కానీ అక్కడతో వదిలి వేయలేదు ఆ శ్లోకాన్ని. శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః మిగతా వాటిల్లో దేవుణ్ణి కూడా చూడగల్గటం చాలా గొప్ప. కాని కుక్క లోను,కుక్క మాంసము తిను చండాలునిలో గూడా చూడగల్గడం సరియైన దర్శనం 1974 లో పూజ్య గురుదేవునివద్ద సాధనా శిబిరంలో వున్నపుడు గదిలో తుక్కు పడి వున్నది అక్కడి గదిలో తుక్కు పడి వుంటే 'ఆహా! ఆ తుక్కు ఎంత సందేశమిస్తున్నదో' అన్నారు ఆయన తుక్కు యేం సందేశం యిస్తోందో నాకైతే అర్ధం కాలేదు తుక్కుని చూడగానే శుభ్రం చేయాలనిపిస్తుంది ఒళ్ళంతా కంపరమెత్తిపోయి అంచేత తుక్కు కూడా ఒక గురువే. మట్టిలో మనం కూర్చోలేం కదా! ఒకసారి దులిపి శుభ్రం చేస్తాం అంచేత ఆ తుక్కు అక్కడ వుండటం కూడా మనను మనం శుద్ధి చేసుకొనే ప్రక్రియకు చాలా అవ సరమని గుర్తు చేస్తోందని అన్నారాయన అంచేత ఆ తుక్కులో కూడా సాధనా రహస్యాన్ని చూడగల్గేరు ఆయన. భగవంతునిలో కూడా సాధనా రహస్యాన్ని చూడలేక పోతున్నాం మనం అంచేత కేవలం దృష్టి కోణంలో మార్పు రావడమే గాయత్రీ మంత్రము - సద్బుద్ధి అంటాము అంచేత ఈ గోమేధము వాక్కు యొక్క శక్తిని ఉపయోగించుకోవడం చాలా ముఖ్యం

84 లక్షల జీవకోటి వున్నాయి ప్రపంచంలో వైజ్ఞానికులు ఒప్పుకుంటు న్నారు. ఈ సత్యాన్ని, మన ఋషులు ఏనాడో చెప్పారు. ఈ 84 లక్షల జీవయోను లలో ఒక్క మనిషికి మాత్రమే మాట్లాడే శక్తి వున్నది మిగతా వాటికి మాట్లాడే శక్తి లేదు అంచేత మనిషి ఎన్ని రకాల సాధన చేసినప్పటికీ, చేసుకోవలసినటు వంటి ఒకే ఒక సాధన ఏమిటంటే వాక్కును సంస్కరించుకోగల్గటం. వాణిని

సంస్కరించుకోగలగటం సంస్కరించుకో గల్గినటువంటి వాక్కు శాపానుగ్రహ కారిణి. మీరు ఏమి చెప్తే ఆ విధమైన ఫలితాలను ఇయ్యగల్గుతుందని ఋషులు చెబుతున్నారు. పతంజలి తన యోగ దర్శనంలో ఒకచోట ఒక మాట రాస్తాడు ఆ మాటను Thousand Island Park అమెరికా దగ్గర నున్నటువంటి ఒక ద్వీప సమూహం దగ్గర స్వామి వివేకానంద వివేచన చేస్తూ ఒక Challenge విసిరాడు ఏమన్నాడు? వాక్కు యొక్క శక్తిని మీరు నమ్మరేమో?! 12 సం॥ల పాటు ఏ వ్యక్తి అయినా సరే అబద్ధాలు చెప్పకుండా వుంటే వాక్కును అబద్ధాలకు నియోగించకుండా వుంటే అతను ఏమి చెబితే అది నిజమైపోతుంది. పూర్వకాలంలో ఈ వాక్ యొక్క శక్తిని ఎంత అద్భుతంగా వాళ్ళు సాధించ గల్గారు అంటే సూర్యుణ్ణి చూసి నువ్వు ఆగిపో! అంటే ఆగిపోవలసి వచ్చేది సూర్యుడికి. కథలు వింటూ వుంటాం కాని అవి కథలే అనుకుంటూ వుంటాం వచ్చిన గొడవ అది ఎందుకు కథలే అనుకుంటాం అంటే అలాచేసి చూపించగల్గి అలా చేయగల్గినటువంటి వ్యక్తిత్వాలు ఈనాడు లేవు కనుక భీముని గురించి ఒక కథ అనుకుంటాం. ఆ శక్తిని కోడి రామ్మూర్తి గురించి ఏమో ఇలా ఆపేసాడుట ట్రక్కులు ఆపేశాట్ట అంటే ఈ కాలంలో నమ్మబుద్ధి కాదు. ఈ కాలంలో వాళ్ళ శరీరాల్ని వాళ్ళు తీసుకెళ్ళటమే కష్టంగా వుందాయె! అంచేత గోమేధము—వాక్కు యొక్క ఉపయోగము మనము సవ్యంగా చేసుకోగలగడం నేర్చుకోవాలి అనేది అక్షరాభ్యాసం చేయిస్తున్నపుడు, విద్యాభ్యాసం చేయిస్తున్నపుడు చేయవలసిన మాటే. అయితే ఈనాడు ఆ విద్యాభ్యాసం యొక్క సంస్కారమే లోపించిపోయింది.

వాక్కును ఉపయోగించుకోవాలి ఎలా వుపయోగించుకోవాలి? అనే రహస్యాన్ని మనం మర్చిపోయి- అసలు వాక్కును మనం వుపయోగించుకోవడమే లేదు. అదీ మన స్థితి. వాక్కు మన ద్వారా విస్తృత మౌతోంది తప్ప వాక్కును మనం వుపయోగించుకోవడం లేదు కనుక గోమేధము మాత్రము మనకు కొంచెం చెయ్యాల్సి వున్నది. అశ్వమేధ యజ్ఞానికి నాందిగా సర్వమేధము మనం చేసేసాం. గానీ, గోమేధము- వాక్కును మనం జాగ్రత్తగా వుపయోగించుకోవడం నేర్చుకోవాలి కాని వాక్కును సరిగ్గా వుపయోగించు కోవటానికి పెద్ద సాధన ఏదీ అవసరం లేదు. సాధ్యమైనంత వరకు మాట్లాడకుండా వుంటేచాలు. Sex Change—ఈనాడు అమెరికాలో అక్కడా దీనిని గురించి చాలా వార్తలు వస్తున్నాయి. మగవారిని ఆడవారిగా, ఆడవారిని మగవారిగా మార్చివేయడము జరుగుతోంది.

కానీ మహాభారతంలో ఒక యక్షుడు- శిఖండి కథ మీకు తెలుసు కదా! ద్రుపదుని యొక్క కుమార్తెను పురుషునిగా మారుస్తాడు ఇదంతా మనం చదువుతాం తప్ప, 'శూనకర్ణుడు' అనేటటువంటి ఆ యక్షుని యొక్క ఒక్క విషయాన్ని మనం జ్ఞప్తికి తెచ్చుకోం. అతను రోజుకు 21 మాటలే మాట్లాడేవాడట — విని వుంటారు ఆ కథ. అంచేత ఒక వ్యక్తి యొక్క సంస్కారాలను మార్చివేసే- స్త్రీ సంస్కారాలు పురుష సంస్కారాలకు ప్రవేశపెట్టగల్గే శక్తి- వాక్కుకు వున్నది అని మహాభారతంలో ఈ కథ చెప్తుంది ఆపరేషన్లు అవీ ఏమీ అక్కరలేదు చెప్తూ వుంటాం కదా! శస్త్రంతో అయిన గాయం మానిపోతుంది గానీ, వాక్కుతో అయిన గాయం మాత్రం మరి మానదు. అంచేత వాక్కుని వుపయోగించుకోవడం మనం మర్చిపోయాం. ఈ వాక్కు యొక్క సామర్థ్యాన్ని వుపయోగించుకోవడం మనం మర్చిపోయాం చతుర్ముఖ బ్రహ్మ యొక్క భార్య సరస్వతి ఈ వాక్కుకు 4 ముఖాలుంటాయని మనం తెల్సుకుంటాం. వాక్కులో రక రకాలున్నాయి.

సూర్యుడి శక్తితో మీరు సంబంధం పెట్టుకున్నా సరే మళ్లా మీరు ఏర్పరచుకున్నటువంటి తాదాత్మ్యం వల్ల సూర్యుడి నుండి క్రిందకుదిగిన ఆశక్తి బైటకు వెళ్ళిపోకుండా మీలోనే వుంటూ, మీరు వినియోగించు కోవటానికి ప్రయత్నించినపుడే, వినియోగపడటానికి వీలుగా అస్త్ర సంబంధంతో 24 Valves మన శరీరంలో అమరి వున్నాయి. ఒక్కొక్క శబ్దోచ్చారణ చేసినపుడు, మన శరీరంలో ఒక్కొక్క Centreకు సంబంధించినటువంటి 4 శక్తి కేంద్రాల తలుపులు మూసుకుంటూ తెరుచుకుంటూ వుంటాయి ఆరు చక్రాలున్న శరీరంలో వున్నాం అని యోగ శాస్త్రం చెబుతూ వున్నది ఆ ఆరు చక్రాలకు సంబంధించిన 6X4 24 ద్వారాల కవాటాలు ఈ గాయత్రీ మంత్రాక్షర సముదాయంతో మూసుకుంటూ వుంటాయి. తెరుచుకుంటూ వుంటాయి. అంచేత మీరు ఆ సూర్యుని శక్తితో తాదాత్మ్యం చెందుతున్నపుడు, గాయత్రి మంత్రోచ్చారణ చేస్తూ మనస్సులో ఏ విధమైనటువంటి భావనలు లేకుండ, కేవలం ఈ మంత్రోచ్చారణ మాత్రమే జరుగుతూవుంటే, అక్కడి నుండి దిగిన ఆ భావ పరంపర మీ శరీరంలోనే వుండిపోతుంది. అలాగ ఇక్కడ ఇంకొక తమాషా ఋషులు చేసినది ఏమిటంటే Auto control చేసారు. Auto control అనేది- విమానం మొ॥ నడుపుతున్నపుడు Take off-Landing లలో మాత్రమే పైలట్ ఉపయోగం ఉంటుంది

తప్ప, ఒకసారి విమానం పైకి లేచిన తర్వాత పైలట్ ఏమీ చేయనక్కరలేదు Auto Pilot చేసేస్తూ వుంటుంది. అలాగే మనము ఎప్పుడైనా ఈ గాయత్రీ మంత్ర శక్తిని వినియోగం చేయాలి అన్నపుడు మాత్రమే మీరు ప్రయత్నం చేయాలి తప్ప లేకపోతే, మీరు కూర్చొని గాయత్రీ మంత్ర శబ్దోచ్చారణ చేస్తూవుంటే, మనకున్నటు వంటి 6X4=24 కవాటాలు వాటంతట అవి ఎప్పుడు ఎలా తెరుచు కోవాలో అలాగ తెరుచుకుని మూసుకు పోతుంటాయి. కనుక అనేక మంది మహాత్ములు అనేక రకాల విధి విధానాలను రకరకాలుగ సమూహాలకు అందిస్తూ అనేక ధ్యాన పద్ధతులలో– అది మీకు తెల్సినా, తెలియక పోయినా మీరు అది చేస్తేచాలు కనుక మీరు ధ్యానం చేస్తున్నపుడు కేవలం మంత్రాక్షరాలను మాత్రమే వుపయోగించు కోండి. మంత్రాక్షరములు రకరకాలుగా వుండవచ్చు. నేను చెప్పాను గదా! ఓం భూర్ భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్– అనే వుండనఖర్లేదు. 8 అక్షరాలతో కూడా వుండవచ్చు. త్రిపాదాత్మకమైన గాయత్రీ మంత్రము రకరకాలుగా వుండవచ్చు. కాని, మన శరీరంలో వున్నటువంటి ఆ 24 కేంద్రాలను మనం వుపయోగించు కోవడానికి ఈ సూర్య దోహన ప్రక్రియను మీరు వుపయోగించు కోవాలి సూర్యదోహన ప్రక్రియ ఏమిటో మీకు అర్థమయ్యే వుంటుంది మీరు కేవలము కళ్ళు మూసుకుని కూర్చుని 24 సార్లు మినిమమ్ 108 సార్లు Maximum ఇంకా కావాలంటే మీ ఇష్టం– గాయత్రీ మంత్రోచ్చారణ చేస్తూ, సౌరశక్తితో సంబంధం పెట్టుకోగల్గితే జరిగేటటువంటి ప్రక్రియతో 'ఇమం వివస్వతే యోగం ప్రోక్తవాన్–' వివస్వతునకు మొదటి సారి చెప్పాను. తర్వాత సూర్యవంశ రాజు లందరకు చెప్పుకుంటూ వచ్చాను. అని చెబుతాడు భగవద్గీత 4వ అధ్యాయంలో అంచేత ఈ యోగాన్ని– అంటే ఏమిటి? సూర్యుని యొక్క భావనాత్మకమైన ఆలోచనా స్థాయి నుంచి మనము సంబంధము ఏర్పరచుకొని ఇది 'సకాలేనమహతా యోగోనష్టః పరంతప' ఇది నాశనమైపోయింది. కానీ మళ్ళీ ఈ అశ్వమేధ పరంపరతో ఇంటింటికి భారతదేశంలోను, విదేశాలలోను దీనిని అర్థం చేసుకోగల్గిన వ్యక్తి వుంటే చాలును ఆధారం ఏమిటి ? అంటే నీవు ప్రశ్నించావు కనుక నీకు అర్హత వున్నదన్నాడు. 'పరి ప్రశ్నేన సేవయా' అన్నాడు భగవద్గీతలో. చాలామంది ఇది నేర్చుకోవడానికి మాకు అర్హత ఏమిటి ? అని అడుగుతారు. అర్హత ఏమిటంటే 'నేర్చుకోవాలి' అనే తపన వుండటమే. ఆ నేర్చుకోవాలి అనే తపననే పరిప్రశ్న అన్నారు పరిప్రశ్న అనకుండా మీరు

ఇంకోలా చేసోసుకోండి. ఏది చేసుకున్నా సరే, ఆ సూర్యశక్తితో మీరు సంబంధం పెట్టుకునేటటువంటి విద్యను 'సౌర విద్య' అన్నారు. 'సూర్య' విద్య అన్నారు. రకరకాల పేర్లతో పిల్చారు ఈ సూర్య విద్యను మీరు నిత్యమూ ప్రాక్టీసు చేసుకుంటూ, ఇంకొకటి తెల్సుకోవాలి మనం ఈ అశ్వమేధ యజ్ఞంలో 'పరా జగత్తును' మార్చడం పరాజగత్ అనేటటువంటి మాట భారతీయులకు మాత్రం క్రొత్తది కాదు విదేశీయులకు కూడ ఇప్పుడు క్రొత్తది కాదు ఈ పరాజగత్ అనేటటువంటి పదాన్ని కొంతమనం వివరించేటపుడు, కొన్ని పదాలను స్పష్టంగా అవగాహన చేసుకొంటే, సూక్ష్మజగత్తు నుండి పరాజగత్తులోనికి మనం ఎలా వెళ్తామో, పరాజగత్తులో వచ్చేటటువంటి మార్పులు మన నిత్య జీవితంలో ఎలా జరుగుతాయో తెలిస్తే, మీమీ జీవితాలలో, మీరు ఏ విధమైన మార్పులు కోరు కుంటున్నారో ఆ విధమైనటువంటి మార్పులు అక్షరాల తుచ మీరు ఎలా కోరు కుంటున్నారో, కోరుకున్నారో అలాగే జరుగుతాయి ఇది ఋషులు ఇచ్చినటువంటి ప్రతిజ్ఞ. "యేయథామాం ప్రపద్యన్తేతాంస్తథైవ భజామ్యహం" నేనేం చెయ్యలేను. మీరు ఎలా కోరుకుంటే అలాగే జరుగుతుంది కోరుకునేటప్పుడు కాస్త గొప్పగా కోరుకోండి. అదే వేరే విషయం అంచేత ఈ అస్త్ర విన్యాసాన్ని నేర్చుకోవడానికి ఈ సౌరశక్తిని పితకటం ఎలా చెప్పామో మీ కుటుంబంలో, మీ చుట్టు ప్రక్కల నున్నటువంటి వాతావరణంలో మార్పులు కల్గచేయటానికి నిన్న నేను మీకు ఒక కథ చెప్పాను కదా! చెట్టులేని వేళ్ళల్లో నీళ్ళు, ఎరువు పోస్తే మార్పు వస్తుంది తప్ప, చెట్టులో చైతన్యం వస్తుంది, ప్రాణం వస్తుంది తప్ప, చెట్ల యొక్క ఆకులలో మార్పు తెస్తే లాభం లేదు అని. కనుక మీ పిల్లలు మీ మాట వినటం లేదు,నేను చెప్పినట్లు జరగడం లేదు. అని మీరు పిల్లల్ని, చేష్టల్ని భౌతిక ప్రపంచంలో మార్పులు చేసుకోవాలి అనుకుంటే, ఆ మార్పులేవీ ఫలించవు మార్పులు చేసు కోవలసినది మానసిక స్థితిలో. బాహ్యజగత్తులో వున్నటువంటి మానసిక జగత్తులో మార్పులు తీసుకుని రావటానికి, ఆలోచనా తరంగాలను మార్చుకోవటం నేర్చు కోవాలి, అనేటటువంటి రహస్యాన్ని పరాజగత్తులో చెబుతూ, మహాభారతయుద్ధంలో విశ్వరూప సందర్శనంలో శ్రీకృష్ణుడు అర్జునుడికి చూపించినటువంటి రహస్యం ఇదే. మహాభారత యుద్ధం ఏదో నువ్వు చేస్తున్నావు అని అనుకుంటున్నావు. కాదు, మహాభారత యుద్ధం మానసిక స్థితిలో ముందే జరిగిపోయింది. నమ్మకం లేకపోతే నువ్వే చూసుకో అని చూపించాడు. సూక్ష్మజగత్తులో చూపించాడు

"దివ్యం దదామిత్ చక్షుః పశ్యమ్ యోగమైశ్వరమ్" ఈ దివ్యమైన చక్షువుతో సూక్ష్మజగత్తులో రాబోయే సంఘటనలు ఏ విధంగా రూపుదాల్చబోతున్నాయో తెల్సుకొని, మన జీవితంలో అటువంటి పరిస్థితులు మనకు నచ్చకపోతే, మనకు కావలసినట్లుగా పరిస్థితులను మార్చుకొనే విద్య, ఈ పరాకృతిని మార్చుకొనే విద్యలో, ఆలోచనా సామర్ధ్యాన్ని మనం చాలా జాగ్రత్తగా అర్ధం చేసుకోవాలి. ఈ ఆలోచనా సామర్ధ్యాన్ని చాలా జాగ్రత్తగా అర్ధం చేసుకోవడానికి చాల చిన్న చిన్న రూపంలో 18 శ్లోకాల ఫార్ములా ఒకటి ఇచ్చారు మళ్ళీ 18 అంటే ఒక అర్ధం వున్నది 'జయము' అని. తతో జయ ముదీరయేత్' అని 18-18 ఎక్కడెక్కడ వస్తుందో ఎప్పుడూ అది 'జయము' గెలుపును పొందడానికి ప్రయోగించాలి అనే సంఖ్యా రహస్యాన్ని గుర్తుంచుకుంటూ 18 శ్లోకాలు గల పురుష సూక్తంలో, సూక్ష్మ జగత్తు నుంచి పరాజగత్తును మార్చుకొని, ఈ భౌతిక జగత్తులో కావలసి నటువంటి మార్పులు ఎలా తీసుకురావాలో, చేసుకోవాలో చూపించాడు. అది చూపించడంలో ఎలా చూపించాడు అంటే 'త్రిపాదస్యామృతం దివి' అన్నారు ఒకచోట. అంటే మనకు కన్పిస్తున్న ఈ భౌతిక ప్రపంచం ఒక్క పాదం మాత్రమే. అంటే 4వ వంతు మాత్రమే మిగతా 3 వంతులు పైన ముందుగానే జరిగిపోయి వుంటాయి. అది జరిగి పోయిన తర్వాత ఈ భౌతిక ప్రపంచంలో జరిగే మార్పులను ఎవరూ ఆపలేరు అందుకే అర్జునుడికి చెప్తాడు శ్రీకృష్ణుడు. నువ్వు ఏదో గొప్పగా అనుకుంటున్నావు పాశుపతాస్త్రాన్ని సంపాదించాను. నావంటి తపస్విలేడు నేను ఇన్ని రకాల శాస్త్రాస్త్రాలను సంపాదించాను. నా వల్ల మహాభారత యుద్ధం గెలుస్తుందనుకుంటున్నావేమో? "నిమిత్త మాత్రం భవసవ్యసాచిన్" నువ్వు ఒక పాదం మాత్రమే. మిగతా 3 పాదాలు అక్కడ జరిగిపోయాయి. నువ్వు కాకపోతే ఇంకొకడొస్తాడు అది చెయ్యటానికి. మన అదృష్టం ఏమిటి? అంటే, యుగ పరివర్తన జరిగేటటువంటి, మహాభారత యుద్ధంలాంటి ఈ సమయంలో మనకు కూడా ఈ ఆహ్వానం అందచేయబడు తోంది కానీ, నేను చూసినటువంటి అవతార రహస్య ప్రక్రియలలో నేను ఎప్పుడు చూసినా, అవతారానికి మనుష్యులకంటే, మానవేతర ప్రాణులు ఎక్కువ సహాయం చేసాయేమో అనిపిస్తుంది.

రామావతారములో ఒక ఋషి సహాయం చెయ్యలేదు రాముడు గొప్ప వాడు అది, ఇది అన్నారు తప్ప నిజంగా రాముడు యుద్ధము చేయడానికి వచ్చే

సరికి కోతులు, ఎలుగుబంట్లు మాత్రమే మిగిలినవి తప్ప మనుష్యులు ఎవరూ సహాయము చెయ్యలేదు చెయ్యకపోయినా రావణాసురుడులాంటి వానిని చంపే సాడు. కారణమేమిటంటే అక్కడ- అక్కడ చంపేసారు. పైన జరిగిపోయిన తర్వాత క్రింద ఎవరయినా చేసెయ్యవచ్చు. అది గుర్తించుకోవడానికి ఇది చెబు తున్నాను. పరాజగత్తును మార్చడం ఎలాగో, అదే విధముగా కృష్ణుడి కాలంలో కృష్ణుడు అస్త్ర విన్యాసాన్ని నాశనం చేసే ప్రయత్నములో, ఇంద్రుడితో యుద్ధము చెయ్యాల్సి వచ్చినపుడు ఎవ్వరూ సహాయం చెయ్యలేదు. గోపబాలకులు సహాయం చేశారు. చిటికెన వ్రేలితో గోవర్ధనగిరిని ఎత్తినపుడు ఎవరున్నారక్కడ? అర్జునుడు ఉన్నాడా? వీళ్ళందరూ? ఎవ్వరూ లేరక్కడ. అదంతా చేసేశాక, కంసుణ్ణి చంపేశాక మేము వున్నాములే అని పంచపాండవులు వచ్చారు. అంతవరకు కృష్ణుడికి సహాయం చేసినవాళ్ళు మామూలు వ్యక్తులే కనుక ప్రపంచము యొక్క చరిత్రను చూసుకుంటుంటే మనకు ఈ కలికి అవతార ప్రకటీకరణకు కావల్సిన హక్కు ఉందా? లేదా? అంటే మనకు మాత్రమే ఉంది. అందుచేత ఈ హక్కును మనం ఎంత ఉపయోగించుకుంటాము? పరాజగత్తులో జరిగే మార్పులు భౌతిక జగత్తులో 1999కి కనిపించే లోపల ఎటువంటి మార్పులు వస్తాయని కొన్ని ప్రశ్నలు అడిగారు. అందులో కొన్ని విషయాలు మాత్రమే చెబుతున్నాను నేను.

1— ఏం జరుగుతుందంటే 1995 తర్వాత 1999 మధ్యలో దేవతలు మళ్ళా సశరీరముగా ప్రపంచములో మానవులతోపాటు కలిసి తిరుగుతారు ఇది వార్తా పత్రికలలో, టి వి మొదలగు వాటిలో వస్తాయి అన్నది ఒక భవిష్యవాణి. ఈ భవిష్యవాణి నిజం అనేదానికి నిదర్శనం నేను ఇందాక చెప్పానే **Chapters of life** అనే దానిలో దొరుకుతుంది ఇదే కాకుండా మీకెప్పుడయినా వీలు దొరికితే "ఎడ్గర్ కెసే" అనే వ్యక్తి వ్రాసిన పుస్తకాలు అవి ఒక్కటి దొరికినా సరే 1000 రూపాయలు అయినాసరే కొని చదవండి. ఆ వెయ్యి రూపాయలు విలువ ఆ పుస్తకములో ఉంటుంది. ఆ వ్యక్తి అంత గొప్పవాడిని ఎలా అయ్యాను అని చెప్పుకుంటూ ఏమి చెబుతాడంటే **World war** టైములో ఒక పడవమీద మేము 15, 16 మంది ప్రయాణము చేస్తున్నాము మా దగ్గర చాలా తక్కువ ఆహారము ఉంది. అందుచేత మా అందరి మధ్య మేము అందరము సమానముగా దానిని పంచుకున్నాము. సమానముగా పంచుకున్న తర్వాత పడవలోనికి వెళుతున్నాము. యుద్ధకాలము-ఒక్కొక్కరు చనిపోతున్నారు. చివరకు ఆ పడవలో నేను, ఓ ఎని

మిది సం॥ల పిల్లవాడు—నాకు మళ్ళీ అక్కడ ఎనిమిది అనే అక్షరం చదివిన తర్వాత కొంచెం ఆశ్చర్యం వేసింది. ఒక 8 సం॥ల పిల్లవాడు, నేను ప్రయాణము చేస్తున్నాము. నేను ఆకలితో నున్నాను. ఆ పిల్లవాడు ఆకలితో ఉంటే అప్పుడు నాకు ఆ చిన్నపిల్లవాడి మీద జాలివేసి నా దగ్గరున్న ఆహారాన్ని కూడ ఆ పిల్లవాడికి ఇచ్చేసి శరీరాన్ని వదిలేశాను.

అలా శరీరాన్ని వదలివేయడం వలన నాకు ఈ జ్ఞానము ప్రాప్తించింది ఇపుడు అంటాడు. త్యాగం యొక్క గొప్పతనాన్ని మరల అతడు చూపిస్తాడు. "ఎడ్గర్ కేసె" అనేటటువంటి వ్యక్తి ఎంత గొప్పవాడంటే రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నపుడు అమెరికన్ ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్ అనుకుంటా, చర్చిల్ వాళ్ళిద్దరూ అతని దగ్గరికి వెళ్ళేవారు. మేము ఏ విధముగా యుద్ధం చేస్తే గెలుస్తామని. అతనికి చాల అద్భుతమైన దివ్యశక్తి ఉన్నది అతను ఏమి చెప్పాడంటే 1986 వ సం॥రం తర్వాత ఏ రోజయినాకూడ రష్యా, రష్యాలాగ ఉండదు. అక్కడ ఆధ్యాత్మిక ప్రబోధం జరుగుతుంది అన్నాడు. నేను ఎప్పుడు ఏమనుకునే వాడినంటే ఆ భవిష్యవాణి చదివిన తర్వాత ఏదయినా యుద్ధం వస్తుందేమోనని. ఏ విధమయిన యుద్ధం లేకుండా అలా డైల్యూట్ అయిపోయినట్లు రష్యన్ కమ్యూనిజం ఏ విధంగా మారిపోయిందో మీ కళ్ళముందే జరిగింది కదా. అంటే సూక్ష్మ జగత్తులో వచ్చేటటువంటి మార్పులు, చేర్పులు చాలా దివ్యమైనటువంటి వేగముతో ఈనాడు మీ అందర ముందర జరుగుతూ ఉన్నాయి ఇంకొకటి ఏం జరుగుతున్నదంటే ముఖ్యముగా హిమాలయాలలో అశ్వమేధ యజ్ఞానికి కావల్సినటువంటి ధన సముదాయము పాతిపెట్టబడి వుంది మహాభారత కాలములో యుధిష్ఠరుడు తనకు అశ్వమేధ యజ్ఞానికి కావల్సినటువంటి ధనము లేదు అంటే వ్యాసుడు అక్కడ ధనముంది ఆ ధనాన్ని మీరు త్రవ్వకొని తీసుకోండి. హిమాలయాలలోంచి అన్నాడు. ఎక్కడ నుంచి వచ్చింది ఆ ధనము? మరువు అనేటటువంటి రాజు పూర్వకాలములో ఎప్పుడో అశ్వమేధము చేసినప్పుడు యిచ్చినటువంటి దక్షిణ ఎంత ఎక్కువగా ఇచ్చినాడు అంటే ఆ డబ్బు అంతా అక్కడే పడి వున్నది తీసుకోండి అంటే తనకు కావల్సినది తను తీసుకొని వచ్చాడు ఈనాడు మనకు కావల్సినటువంటి, అశ్వమేధ యజ్ఞానికి కావల్సినటువంటి ధనముకూడ అక్కడే వస్తోంది. ఇక్కడ ధనము అనే పదానికి అర్థం కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోండి. ధనము అంటే డబ్బు కాదు. డబ్బు మనం ఏర్పరచుకున్నది. డబ్బు

ప్రకృతిలో లేదు. రూపాయినోట్లు ప్రకృతిలో ఉన్నాయా ? ధనం ప్రకృతిలో వుంది కాని, ఆ ధనాన్ని మనం మోసుకొని పోలేక ఆ ధనానికి బదులు కొన్ని కాగితం ముక్కల్ని అల్లరునేటుగా పట్టుకొని అవసరం అయినప్పుడు దానిని Exchange గా మార్చుకుంటున్నాము. ప్రకృతిలో నున్నటువంటి ఆ ధనము ఈనాటికీ హిమాలయాలలో సువర్ణమనే పేరుతో లభ్యమవుతుంది ఆ సువర్ణ మన్నా, గోమేధమన్నా ఒక్కటే అందుచేత ఈ అశ్వమేధానికి ఆయత్తమైనటు వంటి మనము సూర్యుని యొక్క భావ సంపదలను స్వీకరిస్తూ పరదశలో వచ్చే టటువంటి మార్పులను మనం తెలుసుకుంటూ ఈ మార్పులు ఎలా వస్తాయో కూడ మీకు చెప్పాను. సువర్ణం మంచి ఫలాలను మీ రుపయోగించుకో గల్గితే మార్పులు వస్తాయి. ఆ మార్పులే ఇపుడు గురువుగారి దగ్గరకు వెళితే నీ రోగం నయమయి పోతుంది అంటాడు. ఆ రోగము నయమయి పోతుంది అంటాడు. ఆ రోగము నయమయి పోతుందనే పదమే సువర్ణము అందువలన మన రోగాలు నయమయి పోతూ వుంటాయి కాని దానిని ఎలా ఉచ్చరించాలంటే దాని వెనుక ఆ సూర్య శక్తి వుండాలి. ఆ భావ సంవేదన వుండాలి. కనుక ఆ భావ సంవేదనతోపాటు, హిమాలయాన్నించి వస్తున్నటువంటి ఈ సువర్ణ మయినటువంటి శక్తిని మనం సంపాదించుకోగల్గితే దానితోబాటు మన జీవితంలో నున్నటువంటి షోడశ సంస్కా రాలను తిరిగి పునరుద్ధరించుకో గల్గితే, అంటే భారతీయులైన మనం ఏం చేయా లంటే ఈ షోడశ సంస్కార ప్రవృత్తిని మళ్ళా మన జీవితంలో పెంపొందించు కోవాలి. విద్యాభ్యాసం, నామకరణం అన్నప్రాశనం మొదలైన సంస్కారా లున్నాయి గదా, పేర్లే మనం చెప్పలేని స్థితిలో ఉన్నాము కాని మనం యేమీ గాబరా పడనక్కర్లేదు "నిమిత్త మాత్రం భవ సవ్య సాచిన్" మళ్ళా మనకు తగి నట్లు ఆ భారతీయ సంప్రదాయాన్ని మనము తీసుకోవచ్చు ఏ గురువు శిష్యుల మైనా మనం పాటు పడవలసినది కలిసికట్టుగా అశ్వమేధ యజ్ఞాన్ని పూర్తిచేయ డానికే. ఈ అశ్వమేధ యజ్ఞం పూర్తి చేయటానికి, దానిలో మన అవసరం ఏమి టంటే, కల్కి అవతారాన్ని క్రిందికి దించటానికే ఈ కల్కి అవతారాన్ని క్రిందికి దించటానికి కావల్సిన సూత్రాలన్నీ కూడ, కల్కి పురాణంలో, అగ్నిపురా ణంలో చాలా స్పష్టంగా దొరుకుతాయి. దాని తర్వాత రెండు, మూడు ప్రశ్నలు వేశారు. ఆ రెండు, మూడు ప్రశ్నలలో ఉన్నటువంటివి క్లుప్తంగా చెప్తాను నేను. ఒక ప్రశ్న ఏమిటంటే ఓంకారము అనేది సాధించడం మానవ మాత్రులకు

సాధ్యమా? ఓంకారము అనేది సాధించడం మానవ మాత్రులకు సాధ్యం కాదు. ఎందుచేతనంటే సాధించబడిన దాన్ని మళ్ళీ ఎలా సాధిస్తాము? అందుకు ఓంకారాన్ని మనం సాధించేసి ఉన్నాము, సాధించాము అని తెలిసికోవాలి. ఓంకారమంటే శబ్దం కాదు. ఓం అనేది "తస్య వాచకః ప్రణవః" అతని పేరు ఓం అతని పేరు ఓం కాని అతను ఓం కాదు అతను ఏ పేరుతో పిలిచినా పలుకుతాడు కాని అతనిని ఓం అనే పేరుతో మనం ఎందుకు పిలుస్తాం అంటే మనకు మూడు. అవస్థలు వున్నాయి మూడు బాధలు వున్నాయి జాగ్రద్బాధ,స్వప్న బాధ సుషుప్తి బాధ. అంచేత ఈ మూడు బాధల్నీ దాటి వున్నటువంటి నాల్గవ స్థితినే ఓం అంటాము.

ఆ నాల్గవస్థితి మీకు Already వుంది. ఆ నాల్గవస్థితి వుంది కనుక యీ మూడు స్థితులను మనం గమనించగల్గుతున్నాము కనుక ఓంకారాన్ని మీరు పొందనక్కర్లేదు. పొందే వున్నారు. "స్మృతిర్లబ్ధ్వా"గుర్తించండి. దానిని ఉపయోగించండి. ఇంకొకటి ఏమి చెప్పారంటే గాయత్రి పదంలోని ప్రతీ పదమునకు అర్థం వివరించ ప్రార్థన.

ముఖ్యముగా వశిష్ట విశ్వామిత్రుల దాంట్లో 'ధీమహి' అనే పదాన్ని వాడారు ధీమహి అంటే ఏమిటో తెలుపమన్నారు. గాయత్రి మంత్రంలోని ప్రతి పదమునకు ఇంతవరకు అర్థం చెబుతూనే వున్నాను. ఎన్నిరకాల, ఎంతమంది మహర్షులు ఎన్నివిధాలుగా చెప్పినా గాయత్రి మంత్ర అర్థాన్ని సంపూర్ణంగా ఎవరూ చెప్పలేదు. అందుచేత నేనుకూడ సంపూర్ణంగా చెప్పగలనని అనుకోను. కాని గాయత్రి మంత్ర అర్థం తెలిసికొనే విధానం మీకు చెప్పాను జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం లేకపోతే విద్మహే, ధీమహి, ప్రచోదయాత్. యీ మూడు పదాలను జాగ్రత్తగ అర్థం చేసుకోండి ఒక కుర్రవాడు M B.B S. మొదటి సంవత్సరంలో చేరాడు. ఇంట్లో అందరు డాక్టరుగారని పిలుస్తారు. కాని అతను డాక్టరు కాలేదు జ్ఞాతుమ్ స్టేజిలో వున్నాడు తెలిసికోవడానికి ప్రయత్నం చేస్తున్నాడు డాక్టరవడానికి.

M B B.S. అయిదేళ్ళు కోర్సు అయిన తర్వాత, హౌస్ సర్జను అయిన తర్వాత అప్పటికి అతనికి డాక్టరు ఇవ్వరు. చూస్తూ వుంటాడు ద్రష్టుం, తన కంటే అనుభవం వున్నవాళ్ళు, గొప్పవారైన డాక్టర్లు ఎలా ప్రాక్టీసు చేస్తున్నారో చూస్తాడు ఆ తర్వాత తను కూడ ప్రవేష్టుం డాక్టరైపోతాడు, అందుచేత యీ

మూడు విధానాలు నిత్య జీవితంలో ఎప్పుడూ ఉపయోగించుకుంటూ వుంటాము. ఇది గాయత్రి యొక్క "ధీమహి" అనే పదానికి అర్థం ధీమహి అనే పదానికి ధారణ చేయుట అనేటటువంటి అర్థంకూడా వున్నది. ధీమహి అనే పదానికి అర్థం ఏమిటంటే తెలిసి వున్నది తెలిసికోవడం. తెలిసి వున్నది తెలిసికోవడమెలా?అంటే దాని కొక ఉదాహరణ

సాధారణముగా ఎలా చెప్పవచ్చునంటే కేన్సర్‌కు మందు కనిబెడతాను అంటాడు ఒక వ్యక్తి. కొన్ని సమూహాలు కోట్లకోట్ల రూపాయలు కేన్సరుకు మందు కనిపెట్టడానికి ఖర్చుపెడుతున్నాము. కాన్సరుకి మందు మనకు తెలుసా? తెలియదు. మరి తెలియకపోతే తెలిసికోడానికి డబ్బెలా ఖర్చుపెడుతున్నారు? తెలియదుగదా! మరి డబ్బు ఖర్చుపెడితే ఎలా తెలుస్తుంది అంటే మీకు తెలుసును అని తెలుసును. కాని ఎక్కడ వుందో తెలియదు. ఈ స్థితిని "ధీ" అంటారు. Intution అని కూడా అంటారు. ఇది "ధీమహి".

అందుచేత గాయత్రి మంత్ర సాధనలో ఒకానొక స్థితిలో ఆ సౌరశక్తి సందోహన ప్రక్రియలో ఆ సూర్యుని యొక్క భావ కిరణాలు ఎప్పుడైతే సాధకుని మీద పడిపోయి——సూర్యకిరణాలు సర్వత్ర వ్యాపించి వుంటాయి కనుక–సర్వత్ర అనే పదాన్ని నేను భౌతిక జగత్తుకు మాత్రమే పరిమితం చేయలేదు – 14 భువనాలలో వ్యాపించి వుంటాయి కనుక. అతను ఆ స్థాయికి వెళ్ళిపోగల్గితే–అంటే సూర్యునితో తాదాత్మ్యం చెందగల్గినపుడు, సూర్యుడు "జగతస్సత్య ఆత్మః" సూర్యుడు జగత్తు యొక్క ఆత్మ కనుక, ప్రపంచములో ఎక్కడ ఏది ఉన్నా తెలిసిపోతుంది కనుక భవిష్యత్తులో రాబోయేటటువంటి కేన్సర్ యొక్క మందు కూడా తెలిసికోగల్గుతారు అనే నమ్మకం ప్రతీ వ్యక్తికి వుంది కనుక వాడు Sien-tist అవ్వవచ్చు నేను భగవంతుని నమ్మను అంటాడు కాని తెలియని మందును కనిబెడతాను అనే మాట అనటంలోనే భగవంతుని నమ్ముతాడు.

ధీమహి అనే పదాన్ని మనం ఆ విధంగా అర్థం చేసుకోవచ్చు. దాని తరువాత 4 వేదాలు, యజ్ఞము, దానము, తపస్సు ఇవి అన్నీ కలిపి గాయత్రీ మంత్రం యొక్క కళలోనే- ఒక్క కళకు సరితూగవని ఎలా నిరూపించగలము? ఈ వేదాలన్నీకూడ మన వైఖరీ జగత్తులో యీ భాషద్వారా మనం తెలుసుకుంటాము. కాని

భాషకు అందనటువంటి 8 స్థాయిలు వున్నాయి కాని భాషకు అందినదిదాటి, భాషకు అందనటువంటి ఆ 8 స్థాయిలను కూడ మనం గాయత్రీ స్వరూపము అనుకుంటున్నాము కనుక యీ వేదాలు, వేద వాఙ్మయాలు, రేపు రాబోయే విజ్ఞానము అన్నీ కూడ గాయత్రిలో ఉన్నాయని నిరూపించవచ్చు

ఇంకా సులభమైన ఉదాహరణ ఇవ్వదల్చుకుంటే ప్రతిసారి మనం ఇచ్చేటటువంటి ఉదాహరణ Englishలో వున్నటటువంటి 26 అక్షరాలలో భూతకాలంలో Print అయిన అన్నివేల పుస్తకాలు కూడా ఆ 26 వేల అక్షరాలలోనే వున్నాయి, అంటే మనం ఒప్పేసుకోవాలే తప్ప ఇంకో ఇది లేదు కదా! అదే విధంగా గాయత్రీ మంత్రంలో 24 అక్షరాలలో 24 గం॥లో జరిగేటటు వంటి 24 ఆలోచనా స్థాయిలో జరిగేటటువంటి విధి అంతా వున్నది. దాని తర్వాత ఈ 1980 నుంచి 2000 మధ్య వున్నటువంటివి ఇప్పుడే చెప్పేను మీకు, ఏ విధమైనటువంటి మార్పులు జరగబోతున్నాయో. కాని నేను చెప్పినది మీకు ఈ విషయంలో అభిరుచిని కలగచేయగలిగితే నేను కృతార్థుడిని అయినట్టే ఎందుచేత అంటే ఈ విషయాలకి అంతు ఎక్కువ ఉండదు. అందులో ఒక్కొక్క విషయంలో చాలా నిష్ణాతులయినటువంటి వ్యక్తులు ఇక్కడే వున్నారు కాని నా ఈ ప్రయత్నం ఏమిటంటే మన ఋషుల యొక్క అశ్వమేధ యజ్ఞాన్ని, ఒక యజ్ఞముగా కాకుండా, ఒక గుర్రాన్ని పరిగెత్తించేటటువంటి ఒక భౌతిక ప్రక్రియ కాకుండా సంపూర్ణ మానవ జాతియొక్క ఆలోచనా స్థాయిని మార్చేటటువంటి ప్రక్రియ, అని నిరూపించడమే. దాని తర్వాత మనువు చెప్పింది ధర్మశాస్త్రం ఇది అంతటికంటే గాయత్రి చాలా గొప్పది అని, గాయత్రి యొక్క ఆధిక్యత తెలుప ప్రార్థన అన్నారు. గాయత్రి యొక్క ఆధిక్యతను తెలుపడానికి విశేషంగా మనం చెప్పవలసిందేమిటంటే "గయాం త్రాయతీ ఇతి గాయత్రీ". ప్రాణాలను రక్షించేది గాయత్రి. ఏ విద్య మీరు నేర్చుకోవాలన్నా, ఏ స్మృతులు మీరు నేర్చుకోవాలన్నా దీనంతటికి ప్రాణం ముఖ్యం ఆ ప్రాణాన్ని ధారణ చేసేటటువంటి గాయత్రీ విద్య మనకు తెలిసి వుంటే, ప్రాణ విద్య తెలిసి వుంటే, అన్ని రకాల శాస్త్రాలు నేర్చుకోడానికి అనుకూలత ఏర్పడుతుంది కనుక అని ఒక చిన్న ఉదాహరణ

మాత్రమే. కాని గాయత్రి లోనికి సీరు ఎంత లోతులోనికి దిగదల్చుకున్నార అనేది మనం చెప్పలేము ఎందుచేత అంటే గురుదేవులు ఒకసారి ఏమి చెప్పారంటే గాయత్రీ మంత్రాన్ని నేను ఏదో చెప్పారనుకుంటున్నారు రాబోయే తరములో 2000 సం॥ల దరిదాపుల్లో వచ్చే చిన్న పిల్లలు గాయత్రీ మంత్రము యొక్క నిజ స్వరూపం ఎలాంటిదో తెలియ చేసినపుడు, నేను గాయత్రి గురించి చెప్పినది ఒక చిన్న పిల్లవాడు చెప్పినట్లే వుంటుంది అన్నారు ఆయన ముఖ్యంగా ఈ మొత్తము అశ్వమేధ యజ్ఞ పరంపరలో మనం తెల్సుకోవలసింది, చేయవలసినది 8 కార్యక్రమాలు వున్నాయి. ఒకటి నిన్న బలివైశ్య ప్రక్రియ అని చెప్పాను. ఈ బలివైశ్యము ఖచ్చితంగా ప్రతి ఇంట్లోను జరిగేటట్టు చూడండి. సంస్కారములు, షోడశ సంస్కారములు మళ్ళా తిరిగి పునరుద్ధరించబడాలి మనము ఏ గురువు శిష్యులైనా సరే ఈ అందరి గురువుల శిష్యులు కలసి, నేడు వున్నటువంటి అసమానతలను, అసమానతలు అంటే భౌతిక అసమానతలు కాదు. ఆధ్యాత్మిక ఆలోచనా అసమానతలని దూరం చేయడానికి మనం అందరం కలసికట్టుగా సమిష్టిగా, ఏ విధమైనటువంటి కార్యక్రమాలని చేపట్టగలం అని నిర్ణయించుకోవడం కూడా అశ్వమేధములోని ఒక భాగమే కాని ఇవి అన్నీ అందించినటువంటి వ్యక్తిని గురించి, నేను మీకు చెప్పకుండా ఇది అంతా చెప్తూ వస్తే ఏ వ్యక్తిద్వారా అయితే నేను ఈ జ్ఞానాన్ని సంపాదించుకున్నానో ఆ వ్యక్తికి నా కృతజ్ఞతలు చూపించుకున్నట్టు వుంటుంది కనుక, రెండు విషయాలు ఆ వ్యక్తి గురించి కూడా చెప్తాను.

1971 గాయత్రీ జయంతినాడు మధురలో ఆ వ్యక్తిని కలుసుకున్నాను. పూజ్య గురుదేవుల్ని కల్సుకున్న తర్వాత ఆయన జీవితంలో మొదటి 16 సం॥లు చాలా సాధారణంగా గడచిపోయాయి ఆయన 5వ ఏట మదన మోహన మాలవ్యతో గాయత్రీ దీక్ష తీసుకున్నారు. రోజుకి 5 మాలలు చేస్తూ వుండేవారు. ఈ 5 మాలలు చేస్తూ మామూలుగా ఆయన జీవితం గడిచిపోయింది తప్ప ఆయన జీవితంలో అద్భుతాలు ఏమీ జరగలేదు కానీ ఆయన 16వ ఏట ఒక అద్భుతం జరిగింది గాయత్రీ మంత్రాన్ని సాధన చేస్తున్నపుడు ఆయన ఎదుట ఒక

సూక్ష్మశరీరధారి ప్రత్యక్షమై "నువ్వు ఈ పనులు చేయాలి" అని అన్నారు దానికి ఈయన భయపడ్డానన్నారు భగవత్ సాక్షాత్కారం కాలేదు అని గాభరా పడతాం. తప్పు, నిజంగా భగవత్ సాక్షాత్కారం జరిగితే గాభరా పడతాం మనం ఇంకొకటి కూడా చాలాసార్లు నేను ప్రతి మనిషిని అడగమని చెబుతాను. గుర్తుంచు కోండి అది నిజంగా మీ ఉపాస్యదేవత మీకు ప్రత్యక్షమైతే మీరు ఏం కోరు కుంటారు? గబుక్కున చెప్పండి అంటారు నేను చెప్పలేను అది. అందుకని వాళ్ళు ప్రత్యక్షమవరు Actualగా మనకు ఏమీ అడగాలని లేదు కదా? అంచేత ఆ 16 సం॥ల వయస్సులో గల గురుదేవుల దగ్గఱకు సూక్ష్మ శరీరంతో వచ్చినటు వంటి ఆ వ్యక్తి ప్రత్యక్షమై, నువ్వు చాలా పనులు చేయాలి అంటే— "మొట్ట మొదట ఆయన అనుకున్న దేమిటంటే ఇది ఆయన "భ్రమ" అని. అంచేత' 'My life is my message' అంటారు ప్రతి గురువు కూడా. ఈ గురవు గారే కాదు, ఏ గురువు అయినా చెప్పేదేమిటంటే "నా జీవితమే నా సందేశ"మని

అంచేత మనం కూడా, రకరకాల అనుభూతులు మనకు ఏమైనా వస్తే, మొట్టమొదట మనం వేసుకోవలసిన ప్రశ్న ఏమిటంటే ఇది నిజమైనటువంటి అను భూతియేనా? అని. లేకపోతే ఇది నా మనో విభ్రమా?? సరే! ఆయన అలా అనుకున్న తరువాత ఆయనకు,ఆయన క్రిందటి 8 జన్మలుచూపించారు.అన్ని జన్మ ల్లోను నీకు గురువుగానే వున్నాను యీ జన్మలో కూడ నీ బాధ్యత నాదే అని ఆయనకు 28 లక్షల గాయత్రి పురశ్చరణ చేయమని చెప్పారు. ఏ మంత్రమైనా అక్షర లక్షలు జపం చేస్తే ఆ మంత్ర సిద్ధి కల్గుతుందని మంత్ర శాస్త్రం చెబు తోంది. అలాంటివి 24 సార్లు చెయ్యాలి అంటే సుమారు 9 కోట్ల గాయత్రీ మంత్ర జపం చెయ్యాలి నువ్వు అన్నారు. 16 ఏళ్ళ బాలకుడిగా వున్నపుడు సరే చేస్తానన్నారు అనగానే 'నువ్వు ఏదో తమాషా, ఆషామాషీగా చెయ్యడం అనుకుంటున్నావు. నువ్వ నీ ఇష్టం వచ్చింది తినటానికి వీల్లేదు. ఒక గుప్పెడు గోధుమలు ఆవుకు పెట్టాలి. అది పేడ వేసినపుడు అరగకుండ వున్న గోధు మలు ఏమైనా వస్తే, ఒకసారి రావచ్చు, ఒక్కోసారి రాకపోవచ్చు - వాటిని కడిగి, ఎండబెట్టి, దాన్ని నీ చేత్తోనే విసురుకొని, తర్వాత రొట్టెలుగా చేసుకుని తినవలె

తన్నారు. అంతకు తప్ప వేరే ఆహారం తీసుకోవడానికి వీలు లేదు. దీనినే గో సంస్కారిత ఆహారం అంటాం. 'గో' అనేది 'వాణి'కి సూచకం. మన హక్కును 'విశ్వభేషజం'— ప్రపంచంలో వున్నటువంటి ఆర్తుల దుఃఖానికి భేషజంలాగ పని చేయాలి అని అనుకుంటే ఇంత సాధన చేయాలి, చేసుకోవాలి- నాలుకను చేసుకున్నాడు ఆయన ఇంతే కాదు భారతదేశ స్వాతంత్ర్యానికి ఒక స్వయంసేవకుడిగా నువ్వు పని చేస్తూ, పోలీసు దెబ్బలు తింటూ, జైలుకు వెళుతూ వుండాలి అన్నాడు.

మనం 900 అనుష్టానం, రోజుకు 2 గంటల పాటు చెయ్యాలి అంటే ఎన్ని Conditions చెప్తామో. 10 మందికి మనం చెబుతూ వుంటాం. నేను అనుష్టానం చేస్తున్నానని. ముల్లా నసీరుద్దీన్ అని ఓ స్నేహితుడుండేవాడు నాకు కాశీలో. అతనికి పెళ్ళి చూపులు. అతగాడికి ఇంకో స్నేహితుడున్నాడు. అతనికి మంచి బట్టలు, అవీ వుండేవి. అంచేత పెళ్ళిచూపులకు వెళ్తున్నాను కదా నీ బట్టలు కొద్ది రోజులు ఇవ్వు. అని నసీరుద్దీన్ అడిగాడు. షరాయి, లాల్చీ ఎవరికైనా Suit అవుతుంది కనుక వేసుకొని బైల్దేరారు స్నేహితులిద్దరు. అంటే బట్టలు ఇచ్చిన స్నేహితుడు—వేసుకున్నవాడూను పెళ్ళిచూపులైన తర్వాత అన్ని విషయాలు మాట్లాడిన తర్వాత, ఆ స్నేహితుడు ఆవేసుకున్న బట్టలు నావి అన్నాడు సంబంధం తప్పిపోయింది. అదేమిటిరా! నిన్ను పెళ్ళికి సహాయం చేస్తావని తీసుకొస్తే బట్టలు కూడ లేవనుకోరా? అలా చెప్పావు ఏమిటి? అన్నాడు. అయ్యయ్యో! తప్పయిపోయింది. యీసారి నువ్వు చూసే సంబంధంలో అది కూడ చెప్పనులే అన్నాడు. ఇంకో చోటకు వెళ్ళారు పెళ్ళిచూపులకు అక్కడ అన్నీ జరిగాక నసీరుద్దీన్ స్నేహితుడేమన్నాడంటే అతడి బట్టల గురించి నన్నేం అడక్కండి అవి నావి కావు అన్నాడు. ఇలాగ మనం చేసేటటువంటి చిన్న చిన్న సాధనలకు విశేషమైన ప్రచారం ఇచ్చుకునే స్థితిలో రోజుకు 8 గంటలు గాయత్రీ మంత్రం జపం చేస్తూ, గో సంస్కారిత ఆహారం మాత్రమే స్వీకరిస్తూ, కాంగ్రెస్‌లో స్వయం సేవకుడిగా పని చేస్తూ—మళ్ళీ అక్కడ ఆఫీసులో బాధ్యతలు తీసుకోవడానికి ఆయన గురువు ఒప్పుకోలేదు స్వయం సేవకుడిగానే వున్నారు.

పోలీసు లాఠీ దెబ్బలు తింటూ, జైలుకు వెళ్తూ, ఆయన అనుష్ఠానం పూర్తి చేసారు. ఈ అనుష్ఠాన శృంఖల చేస్తూ ఆయన ఊరుకున్నారా? ఆయన గురువు $1\frac{1}{2}$ సం॥లు అంటే $17\frac{1}{2}$ సం॥ల వయసు వచ్చాక ఒకసారి హిమాలయాలకు రా అన్నారు. ఈనాడు మనం కాస్త విసుగ్గా, చికాగ్గా ఉంటే హిమాలయాలకు వెళ్ళిపోతాం అని బెదిరిస్తూంటాం. కానీ అతను హిమాలయాలకు $17\frac{1}{2}$ సం॥ల బాలకుడిని తీసుకు వెళ్ళి (ఆయన గురువు) అక్కడ ఉన్నటువంటి ప్రతి ఋషికి పరిచయం చేసారు

ఆ ఋషులందరు ఎవరెవరు? మనం చెప్పుకుంటున్న ప్రతి ఋషి ఈనాటికీ హిమాలయాల్లో వున్నారు. మనం కూడా వుంటాము. మనం కూడా అజరులము, అమరులమే మన శరీరాలు నశ్వరమే తప్ప, మన ఆత్మలు నశ్వరములు కావు అందుచేత ఋషులు అప్పటి నుండి ఇప్పటి వరకు ఉన్నారు ఉన్నారా! అని ఆశ్చర్యపోవద్దు హిమాలయాల్లో వాళ్ళ సాధన వాళ్ళు చేసుకుంటూనే వున్నారు. ఈ వశిష్టుడు, విశ్వామిత్రుడు, యాజ్ఞవల్క్యుడు–మీరు ఏ ఋషి పేరు చెప్పినా, వారంతా ఇప్పటికీ హిమాలయాల్లోనే ఉన్నారు. వాళ్ళందరి వద్దకు ఈ $17\frac{1}{2}$ సం॥ల బాలకుడిని తీసుకు వెళితే వారి కళ్ళ వెంట నీరు వచ్చిందిట. ఎందుకు కన్నీరు కారుస్తున్నారు?అని అనుకుంటే–గురువుగారి గురువుగార్ని చూసి ఈర్ష్య చెందారట వారు. ఏమని ఈర్ష్య చెందారు? మాకు కూడా ఇటువంటి శిష్యుడు ఉండి ఉంటే, మాకు ఈ తపన ఉండేది కాదు కదా! అని మేము అనేక రకాలైనటువంటి ఋషి పరంపరను, అనేక రకాలైన జ్ఞాన విజ్ఞానులను కూడా భారత జాతికి వారసత్వంగా అందిస్తే, అసలు మేము చెప్పినది ఏమిటో మేము వేదాలలో చెప్పింది ఏమిటో,మా ఋషి పరంపర ఏమిటో కూడా తెలియని స్థితిలో ఉన్నారు భారతీయులు. అనగానే గురువుగారి గురువుగారికి ఉత్సాహం వచ్చేసింది. నా పని మాత్రమే కాదు, మీ పని కూడా చేస్తాడు ఈతడు అని అన్నారు.

ఆ ఋషులందరి కార్యక్రమాలు కూడా ఆ $17\frac{1}{2}$ సం॥ల బాలకుని నెత్తిన పడ్డాయి. ఇదంతా ఆయన చేసారు. ఇంతా చేస్తున్నపుడు ఋషులు ఆయనకు

ఇంకో పని చెప్పారు. సంస్కృత భాష నాశనమైపోయింది. సంస్కృతాన్ని అర్థం చేసుకునేవారు ఈ నాడు లేరు ఏం చేద్దాం? అన్నారట గురుదేవుల గురువు గారు—ఏ పని చెప్పినా మావాడు చేస్తాడు అనే వారట, ఈయన తలూపేవారు. అంచేత వ్యాసుడు వ్రాసిన ప్రతి పుస్తకాన్ని హిందీలోకి అనువదించమన్నారు. వ్యాసుడు వ్రాసిన ఏ పుస్తకం పేరైనా చెప్పండి గురుదేవులు దానికి హిందీ అనువాదం చేసేసారు ఈ హిందీలోనికి అనువాద కార్యక్రమ ఉద్దేశ్యం ఏమిటంటే సంస్కృత భాష నిజంగా నాశనమైపోయింది. సరే! కానీ, సంస్కృత భాషను తిరిగి దాని స్థానానికి తీసుకు రావాలంటే ఒకటే మార్గమున్నది సంస్కృత భాష మూలంలో అద్భుతమైనటువంటి విజ్ఞానాన్ని కల్గి ఉంది ఆ విజ్ఞానాన్ని కనుక మనం వాళ్ళ భాషలో విప్పి చూపించగల్గితే, వచ్చినట్లు వాళ్ళు సంస్కృతం నేర్చుకుంటారు. విదేశాలలో, ఆక్స్‌ఫర్డ్‌లో కొన్నిచోట్ల ప్రొఫెసర్లు, విద్యార్థులు కూడా సంస్కృతంలోనే మాట్లాడుకుంటారు. కానీ నేటి స్థితిలో ఇక్కడ సంస్కృత అధ్యాపకులు ఏ భాషలో మాట్లాడుకుంటారో నాకు తెలీదు. కాని అక్కడ సంస్కృతం ఇంత గొప్పగా ప్రచారం పొందటానికి కారణం ఏమిటి? అంటే ఇంగ్లీషులో, సంస్కృతంలో ఉన్నటువంటి విషయాలను, -ఇంత గొప్ప విషయాలున్నాయి. అని ప్రచారం అవడం వలన, దాని మూలాన్ని తెల్సుకోవటానికి రకరకాలైనటువంటి వ్యక్తులు వస్తున్నారు కనుక వ్యాసుడు వ్రాసినటువంటి ప్రతి సంస్కృత పదానికి హిందీలో గురుదేవులు అనువాదాన్ని అందించారు

యోగ సాధన చేసుకుంటూ, ఇదంతా చేస్తూ కూడా ఆయన ఇందాక పని చేసారు. 2000 సంవత్సరం వరకు 64 పేజీలు గల రెండు మాస పత్రికలు. 1. యుగ నిర్మాణ యోజన—ప్రపంచాన్ని ఎలా మార్చాలి అనేటటువంటి విషయాలున్న పత్రిక 2. అఖండ జ్యోతి అంటే మన ఋషులు ఇచ్చినటువంటి జ్ఞాన సంపదను హిందీ భాషలోనికి వ్రాసేటటువంటి 64 పేజీలు గల ఈ రెండు పత్రికల్లో ప్రతీ అక్షరం కూడా పూజ్య గురుదేవులు ముందుగానే వ్రాసి భౌతికంగా కనుమరుగైనారు. ఇప్పటికీ ఆ పత్రికలు వస్తూనే ఉన్నాయి వాటి circula-

tion లక్షల్లో ఉంది. ఆ పత్రికల గొప్పదనమేమిటంటే ఒక్క ఎడ్వర్టైజ్ మెంటు లేకుండా ఎక్కడా ఖాళీ ఉండకుండా ప్రతీ పేపరు పూర్తిగా ఉపయోగించ బడటం, ఇటువంటి ప్రయత్నం చేసినటువంటి ఆ మహనీయుడు అందచేసినటు వంటి విజ్ఞానంలో కొంత భాగాన్ని నేను మీకు అందించే ప్రయత్నం చేసాను. ఈ ప్రయత్నాన్ని మీరు ఇంతగా విని నన్ను కృతార్థుణ్ణి చేసి నందుకు ధన్య వాదాలు. (దగ్గు) (5 సార్లు గాయత్రీ మంత్రం.)

—0—